

'దేవత' లో సావిత్రి.












బాబూమూవీస్ వారి
ఈస్ట్మన్ కలర్ చిత్రం

# లేతమనసులు

దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు నిర్మాత సి.సుందరం సంగీతం మహదేవన్
కోడైరెక్టర్ కె.విశ్వనాథ్ • పార్ట్నర్కో సమర్పణ • శ్రీ ఫిలింస్ విడుదల
స్టూడియో శ్రీ సారథి హైదరాబాద్

కుటుంబములోని ప్రతివారు



జమున
స్నానపు సోపు
కోరుతారు

ఆదర్శమైన స్నానపుసోపు
తక్కువ ధర
ఎక్కువకాలం వాడవచ్చు

బెంగాల్
కెమికల్

* కలకత్తా
* బొంబాయి
* కాన్పూరు

మూడు వివిధ రంగుల
12 బిళ్ళలుగల
పెట్టెలలో లభించును

సరికొత్త రుచి
ఆరోగ్యానిచ్చే
అమరపానీయం

ఫ్రూటాల్




తయారు చేయువారు
ఇండియా
క్యానింగ్
యిండస్ట్రీస్
విజయవాడ-3.

NVKA

for MAXIMUM BREEZE




















మెట్రో పొలిటన్ ఎంటర్‌ప్రైసెస్ ప్రైవేట్ లి॥
28. గోరక్‌పూర్ ట్రంక్‌రోడ్, కలకత్తా-7 ఫోన్: 56-2790

ఆంధ్రప్రదేశ్‌కు సోల్‌సెల్లింగ్ ఏజెంట్లు మెస్సర్స్ సెంచురి ట్రేడింగ్ కం॥ కొటారు బిల్డింగ్, గాంధీనగర్, విజయవాడ-1

విశ్వావసు ఉగాదికి (MSC) వారి విశేష కానుక

ఆనాటి తెలుగులిపి మొదటిదయిగా మొదలైన నాటినుంచి ఆధునిక యుగందాకా. సుమారు 2000 ఏండ్ల సాహిత్యాన్ని. అందికగా, పొందికగా పన్నెండు సంపుటాలలోకి ఒదిగించి....

ఏ సాహిత్యకర్తైనా . సాధారణ పాఠకుడుగాని, సాహితీపరుడుగాని . సమగ్ర ఆంధ్ర సాహిత్యంతో సన్నిహిత సంబంధం ఏర్పరచుకోవాలి..

ప్రాచీన, నవీన సాహిత్యాలలో ప్రామాణికంగా అధికారి, ప్రచారకుడిగా, ప్రచారదాయకగా ప్రజాసామాన్యంలో పటిష్ఠ ప్రతిష్ఠ సంపాదించుకొన్న సవ్యసాచి సాహితీమూర్తి శ్రీ ఆరుద్ర నిర్వహిస్తున్న...

చెప్పుకోదగ్గ కవుల కథలూ, వారి కావ్యాల సౌందర్యం, సౌరభాల వివరాలు

సాహిత్య ప్రాడ్వివాకుడు

శ్రీ రాజమన్నారు గారి ఉపోద్ఘాతంతో

పన్నెండు సంపుటాలలో

**రమారమి 3000 పుటలు**

సాహిత్యప్రజా సామాన్యానికి విశ్వావసు ఉగాది కానుకగా యం. శేషాచలం అండ్ కో ముద్దుగా ముద్రణగా ప్రచురించింది ...

క్యాలికో అట్టతో, కంటికింపైన కూర్పు తీర్పులు .

# యం. శేషాచలం & కో

మచిలీపట్టణము, సికిందరాబాదు, మద్రాసు

తెలుగు సాహితీ సౌరభ్య, సౌందర్యాలకు వాచవి

# సమగ్ర ఆంధ్ర సాహిత్యం

పన్నెండు సంపుటాలలో పరిచయం

## ప్రచురణకు ముందే కొనుగోలు సదుపాయాలు

[అసలువెల ఒక్కొక్క సంపుటం రూ. 6. రిజిస్టరు పోస్టేజి దాదాపు రూ. 1]

ప్రచురణకు ముందే మొత్తం చెల్లించేవారికి రూ 50 మాత్రమే.

పైగా పోస్టేజీ, ప్యాకింగులు ఉచితం అంటే, దాదాపు రూ 22 ఆదా అన్నమాట -

వాయిదాలుగా కోరేవారు, పేర్లు నమోదు చేసుకొని

ఆరంభంలోనే రూ 10 డిపాజిట్టు కడితే

ప్రతినెలా 1-5 తేదీల్లో మా పోస్టుఖర్చులతో రిజిస్టరు పోస్టులో పుస్తకాలు పంపుతాము

వారికి దాదాపు రూ. 12 ఆదా అన్నమాట

వాటిధర 6 రూ లు

ఏపెల కొనెల ఆఖరులో 10 వెలపోటు పంపాలి

11, 12 నెలలకు ఏమీ పంపక్కరలేదు.

**ఈ సదుపాయం ఏప్రెల్ 30 వ తేదీవరకే ఆతర్వాత కచ్చితంగా అసలు ఖరీదు రూ. 5/-, పోస్టేజి ఖర్చులూ కలిసి రమారమి రూ. 6/- ఇచ్చుకోవలసిందే.**

పన్నెండు సంపుటాలనూ పన్నెండు నెలల్లో వేలికవాయిదాలలో ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు వారి సమర్పణ....

సమగ్ర ఆంధ్రసాహిత్యం

మొదటి సంపుటం

చాళుక్య యుగం

ఆరుద్ర

# ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు

రాష్ట్రపతిరోడ్డు, సికిందరాబాదు

గంగాధర్

## మనలో మాట

సమకాలీన ప్రాధాన్యత కలిగిన రకరకాల అంశాలను గురించిన రచనలు ప్రచురించాలని మా సంకల్పం. ఈ వారం 47వ పేజీలో ప్రారంభమయే 'పరుగు పందెం యోధులు' వ్యాసం మా పాఠకులకు నచ్చగలదని ఆశిస్తున్నాము. వ్యాసంతోపాటు ప్రచురించిన ముగ్గురు క్రీడా కారుల బొమ్మలను వేసినవారు శ్రీ కె. దశరధరామ్...

*　　　*　　　*

అపస్వరం నవల యీ వారంతో అయిపోతున్నది. వచ్చేవారం మరొక పెద్ద కథ ప్రచురణ ఆరంభమవుతుంది.

*　　　*　　　*

"వనితాలోకం"లో 'మానసంరక్షణ కోసం' అనే వ్యాసావళిలో చివరి వ్యాసాన్ని యీ వారం వేశాము...

*　　　*　　　*

"వేల్పులకైనా మార్పులు తప్పవు' శీర్షికలో వచ్చేవారం 'లక్ష్మి'ని గురించి చదువవచ్చు.

*　　　*　　　*

కృష్ణానదిలో జరిగిన దుర్ఘటనకు సంబంధించిన ఫోటోలు 9వ పేజీలో చూడవచ్చును. ఈ సంచిక ముద్రణకు వెళ్ళే సమయానికి అంతకుమించిన తాజా వార్తలేవీ అందలేదు.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి శారద (ఫోటో: ప్రభాకర్)




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 30—4—'65
విశ్వావసునామ సం॥ చైత్ర బహుళ చతుర్థి
సంపుటము: 57 సంచిక 35
స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్
*
సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ
*
ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-

**చందా వివరాలు**

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28 60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120 00. అమెరికా రూ. 176.80 ఆస్ట్రేలియా రూ. 148.20

విడిప్రతి 30 పై.
సంవత్సర చందా 15.60 పై.
6 మాసాల చందా 7.80 పై.



త్వరలో!
కొత్త శీర్షిక
ప్రారంభం
వివరాలు
వచ్చే సంచికలో

# ఉత్తరాలు

## ముఖచిత్రం

ఈమధ్య తరచుగా మీరు ప్రచురించుచున్న బి సరోజాదేవి ఫోటోలు ఎంతో ఆకర్షణగా ఉంటున్నవి. మా అభిమానతార అయిన సరోజాదేవి ముఖచిత్రం చూసి ఎంత ఆనందించామో చెప్పక్కరలేదు

'విజ్ఞుడు' కథ మమ్మల్ని కడుపుబ్బ నవ్వించింది నిజంగా అలాంటి విజ్ఞులు మనకు నిత్యమూ ఎదురై బాధిస్తూనే ఉంటారు రచయితకు మా కృతజ్ఞత.

లక్ష్మి (నరసరావుపేట)

* * *

క్రొత్త సంవత్సరంకి, క్రొత్త తార, సుకన్య మీ పత్రికకు ముఖచిత్రంగా రావడం మాకు పాత తారలతో విసుగెత్తటంవల్ల, విచిత్రంగా, ఆనందంగా ఉండటం జరిగింది క్రొత్త తారతోపాటు, అన్నీ క్రొత్తవిగానే ఉండాలనీ కాంక్షించుతాము.

మైలవరపు సావిత్రీదేవి (విశాఖపట్నం)

## న్యూఢిల్లీ లేఖ

శ్రీకృష్ణగారి 'న్యూఢిల్లీలేఖ' ఆసక్తిదాయకంగా ఉంటున్నది కేంద్ర ప్రభుత్వపు మంత్రివర్గంలో జరిగే కుంభకోణాలు వారి కలంనుండి సమయోచితమైన విమర్శతో వెలువడి బట్టబయలు కావటం హర్షదాయకం సభ్యతాయుతమూ, సంస్కారయుతమూనైన వారి లేఖావాహిని అడ్డంకులు లేకుండా సాగుతుందని ఆశిస్తున్నాను.

డి. సదాశివరావు (గుంటకల్)

## కథలు

పి ఎస్ నారాయణ వ్రాసిన "చంచల" కథ చాలా బాగుంది కథలో వాస్తవానికి లోటురాకుండా పాత్రలను ఉత్తమంగా చిత్రీకరించారు ఇంతటి చక్కటి కథను మీ (మా) "ఆంధ్ర సచిత్ర వార పత్రిక" ద్వారా మా కందించిన రచయితకు నా అభివందనలు 16—4—65 వారపత్రికలో ముఖచిత్రం 'తేనెమనసు' లో సుకన్య ఆకర్షణీయముగా ఉంది

పిడుసు సుబ్రమణ్యం (రాజంపేట)

* * *

9—4—65 వారపత్రికలో రాంబాబుగారి 'విజ్ఞుడు' అనే కథ చదివాను చాలా బాగుంది సోమర్‌సెట్, మాహ్మ్ మిస్టర్ నో ఆల్ అనే కథ ముందు భాగము జ్ఞప్తికి రావటంలేదా?

జె హైమవతి (కాకినాడ)

* * *

వై జానకిగారు వ్రాసిన "నిజం" కథ నిజంగా వాస్తవికతకు చాలా దగ్గరలో ఉండి చాలా బాగుంది. కథలోని సంఘటనలు నిజ జీవితములో మనం తరచూ చూస్తూనే యుంటాం

బాల్యంలో పిల్లలకు పేదవాళ్లు, ధనికులు అనే భేద భావము పెద్దలు కల్పిస్తేనే తప్ప, వారికి కలుగదనేది కథలో నిరూపించారు

బేగం (శృంగవరపుకోట)

* * *

2—4—65 వారపత్రికలో ప్రచురింపబడిన "తావిలేనిపూలు" అనే కథానికలో చిన్న పొరపాటు పేజి 30, మొదటి కాలం చివరినుంచి మూడవ లైనులో "బ్రిలియడ్స్" అని వ్రాశారు, బహుశ అది "బిలియార్డ్స్" అని నా నమ్మకం. అవునా?

ఇ రాజేంద్రబాబ్, (తాడేపల్లి)

* 'కాదు' మాత్రం కాదు !

## వ్యాసాలు

26—3—65 సంచికలో 22 వ పేజీలో 'లతిక'గారి "కథ కంచికి" లో ఉదహరించినట్లు సూర్యశశాంక వహ్ని నయనుడు అనగా శివుడు కాదు అది విష్ణుస్తోత్రములో విష్ణువును ఆ పేరుతో ప్రార్థించారు రచయిత (త్రి) గారు శివునికాపేరు ఎందుకుపయోగించారో తెలియచేయగోరుతాను

కె ఎం కె చిన్నా (విశాఖ)

## చిత్రలహరి

9—4—65 ఉత్తరాలు శీర్షికయందు హైదరాబాద్ పాఠకులు 'తేనె మనసులు' లో నటించిన కృష్ణను పరిచయం చేసినందులకు ప్రశంసించి, బి. యస్‌సి యందు ఆర్ట్సు సబ్జక్టు ఎకనామిక్స్ ఉండడ మేమిటని వెలిబుచ్చారు మాకు ఆశ్చర్యం కలిగింది ఎందుకనగా మన ఆంధ్రప్రదేశ్‌లోని (మూడు విశ్వవిద్యాలయాలలోను) చాల కళాశాల అందు సైన్సు సబ్జక్టులలో ఆర్ట్సు సబ్జక్టు (ఎకనామిక్సు) యున్నది. బహుశా వారికి తెలియదేమో.

పి పాండురంగబాబు, పి వినోదాబాయి (కడప)

## పద్మశ్రీ నాగయ్య

ఈమధ్య మహానటుడు, లలిత సంగీతకర్త, త్యాగశీలుడు శ్రీ నాగయ్యకు జరుగుతున్న సన్మానాలు భారతీయ సాంప్రదాయాన్నే గుర్తు చేస్తున్నవి. అనాదిగా వస్తున్న మన సంప్రదాయం ఏమంటే ఒక ప్రదేశంలో పుట్టి పెరిగిన వ్యక్తి విశిష్టతను ముందుగా మరొక ప్రదేశం గుర్తించటం, ఆ తరువాతనే అతని జన్మభూమి అతనిని గుర్తించటం. అలాగే శ్రీ నాగయ్యగారి విషయంలోనూ జరిగింది భారత ప్రభుత్వం పద్మశ్రీ బిరుదు ప్రసాదించిన తరువాతనే ఆయనకు ఈ చిత్ర పరిశ్రమ ప్రసిదుల సన్మానాలు, పుష్పాభిషేకాలు.

రామయ్యచౌదరి (కలకత్తా)



## రచయితలకు మనవి

మా కార్యాలయం చేరే ప్రతి రచనతోనూ దాని రచయితగాని, రచయిత్రిగాని అది తమ స్వంత రచనేననీ, దేనికి అనుకరణకాదనీ హామీ వ్రాసి పంపాలి. ఇటువంటి హామీలేని రచనలను ప్రచురణకి స్వీకరించలేము.

సంపాదకుడు

ఆంధ్రసచిత్రవారపత్రిక

చైనావాళ్లు మూషిక భక్షకుల జాతికి చెందినవారు
అబ్దుల్లా
చైనా స్వాగతం



పాక్ దురాక్రమణ
తాత్కాలిక యుద్ధ విరమణ సందేశం
అణుయుద్ధ ప్రమాదం
ప్రపంచం


ఇండియాపై వ్యతిరేక నినాదాల కోసం



దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి 27 వ వర్ధంతి సందర్భమున ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి విజయవాడ ఆంధ్రపత్రిక కార్యాలయంలో దేశోద్ధారకుని చిత్రపటానికి పుష్పమాలవేసి శ్రద్ధాంజలి సమర్పించారు.

**న్యూఢిల్లీ లేఖ.**

# దేశకాల పరిస్థితులు!

మహానవులు వస్తూంటారు, వెళ్లిపోతుంటారు. సంఘటనలెన్నో జరుగుతూ వుంటాయి. కాలచక్రం రకరకాలుగా తిరుగుతూ వుంటుంది. ఎన్ని మారినా, ఎంత చైతన్యం వచ్చినా మారనవి, నిశ్చలమైనవీ రెండే రెండు మొదటిది : విధి, రెండవది : చరిత్ర.

కాలానికి, పరిస్థితులకూ ప్రత్యక్షసాక్ష్యులు యీ రెండు మొదటిది లోకాన్ని నడిపిస్తుంది రెండవది లోగడ గడచిన వృత్తాంతాన్ని పూసగుచ్చినట్లు చెపుతుంది

ఎన్నో దశాబ్దాల క్రితం ఒకమారు లార్ కర్జన్ ఒకానొక సందర్భంలో ప్రసంగిస్తూ, బ్రిటిష్ వారి ఆధిపత్యాన ఉన్న రాజ్యాలలోకెల్లా ఇండియా మణిపూసలాంటిదనీ, శోభాయమానమైన ఆభరణమనీ అన్నారు ఆమాట నిజమే ననిపిస్తుంది కారణం ఏమంటే భూమ్మీద వెలుగువడ్డ తొలిక్షణం నుంచి యీ ఇండియా రకరకాల వ్యక్తులందరికీ ఆకర్షణగానే ఉంటూ వచ్చింది ఈ రకరకాల వ్యక్తుల్లో సామ్రాజ్యంలేని మహారాజుల దగ్గర్నుంచి కొండరాజుల వరకూ ఉన్నారు ఇక లాభాలమీద లాభాల నార్జించేవారికి ఈ దేశం ఎప్పుడూ బంగారుగని లాంటిదే

ఇంత మంచి దేశానికి అనుకోని దురవస్థలు రావటానికి కారణాలేమిటి ?—అవి రెండు మొదటిది ఈ దేశంలోని సౌభాగ్యం, రెండవది యిక్కడి ప్రజల్లో అనైక్యత ఈ రెండు కారణాలూ చూపరులకు విరోధాభాసంలా కనిపిస్తాయి.

ఉదాహరణకు హిందువులనే తీసుకుందాం ప్రత్యేకత నంటూ ఒకదాన్ని ఆపాదించుకోవాలని మొదటి నుంచీ వీరి తాపత్రయం అందువల్లనే హైందవం వల్ల ఐక్యత సిద్ధించకపోగా, వూహించనంతటి అనైక్యత వాటిల్లింది మహాభారతం ఉన్న దనుకోండి పంచపాండవులు ద్రౌపదితో సహా విముక్తిని వెతుక్కుంటూ హిమాలయ పర్వత శిఖరాలను అధిరోహించటం మొదలెట్టారు ఒకరి తర్వాత ఒకరు పడిపోవటం మొదలెట్టారు పడిపోకుండా పైకి పోతున్న వాళ్లంతా, పడిపోయిన తమవారి కోసం కించిత్తయినా బాధపడలేదు వ్యక్తిగతంగా ఎవరికి వారు ఒకళ్ళైపోవటంతో ఐక్యత దెబ్బతిన్నది ఇది కేవలం ఉదాహరణ మాత్రమే !

అశోకుడు ఆచరించి, ప్రవచించిన అహింసా సూత్రం హిందూ తత్వాలమీద చిత్రంగా ప్రతిఫలించింది ఒక వర్గం కథనం ప్రకారం హైందవం ప్రభావం తగ్గటానికిదే కారణం ఏమైతేనేం, ఇండియా ఎప్పుడూ ఏ దేశాన్నీ దురాక్రమణ చెయ్యలేదు కనీసం అలాంటి ఊహనైనా ఏర్పరచుకోలేదు ఎటొచ్చీ నాలుగు దిక్కులనుంచీ అవకాశం సంపాదించిన ప్రతి ఒక్కడూ మనల్నే కొల్లకొట్టుకుపోయాడు

రెండువేలకు మించని ఒక బృందం కొన్ని శతాబ్దాల క్రితం అప్పటి ఢిల్లీ రాజైన పృథ్వీరాజును సంహరించటం, తమ రాజ్యాన్ని స్థాపించుకోవటం అంతటితో ఆగక తొమ్మిదికోట్ల మంది భారతీయులను అనుయాయులుగా చేసుకొనటానికి ప్రయత్నించటం జరిగింది ఇది విడ్డూరం కాదా ? హిందువులే ఆనాడే గనుక స్వార్థాన్నీ, అనైక్యతనూ,



ఇండియాలో క్రొత్త బ్రిటిష్ హైకమీషనర్ శ్రీ జాన్ ఫ్రీమన్ మార్చి 27 న ఢిల్లీ వచ్చారు.

# ఆశయాలు పెద్దవే: ఐక్యత మాత్రం పూజ్యం

## న్యూఢిల్లీ లేఖ

ప్రాణభీతిని వదలి—త్యాగంచేసి—ఆ రెండువేల మందిని ఎదిరించినట్లయితే చరిత్ర మరోవిధంగా రూపొందిఉండేది అప్పటి కులమత భేదాలే నేటికీ కొన సాగుతూ వచ్చాయి ముప్పయి సంవత్సరాల క్రితం కాస్త తగ్గుముఖం పట్టిన ఆ వ్యత్యాసాలు 1947 ఆగస్టు 15 నుంచీ మళ్లీ తీవ్రరూపం ధరించాయి ఇండియాను ఏకంచేయాలనీ, భారతీయులంతా ఒకే మతమన్న సత్యాన్ని వెలుగులోకి తేవాలనీ మహాత్మాగాంధీ, జవహర్‌లాల్ ప్రభృతులు కృషి జరిపారు. ఒక చిన్న ఉదాహరణ 1962 లో—అంటే మొన్ననే— భారతదేశంలోని పేదా, సాదా, చిన్నా, పెద్దా అంతా కలిసి ఢిల్లీలోని స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ముందు నిల్చొని తమకున్నదేదో ప్రభుత్వానికి సమర్పించటానికి సిద్ధమయ్యారు చైనా దండయాత్రను ప్రతిఘటించటానికి ప్రతి ఒక్కరూ నడుంకట్టారు. లక్షలాదిమంది సైన్యంలో చేరటానికి ముందుకొచ్చారు కానీ కాంగ్రెసు నాయకత్వం విఫలమైపోతున్నదన్న భావం వచ్చేసరికి ఎక్కడివాళ్లక్కడ చెల్లాచెదరై పోయారు దేశం ఈనాడు యిలా ఉన్నదంటే సవాలక్ష కారణాలు ప్లానింగ్ కమిషన్ లాంటి కొరగాని కొయ్యలుగా తయారయ్యాయి. చైనావాడు అస్సాం నూనె మిల్లులకు ఎనభై మైళ్ల దూరంలో ఉన్నప్పటికీ ప్లానింగ్ కమిషన్ పెద్దలంతా మూడో ప్రణాళికను అమలుపర్చటానికి నియమించవలసిన తరవాతి కమిటీని గురించి ఆలోచిస్తారు నెహ్రూగారు చివరి రోజుల్లో, బాగా దెబ్బతిని ఉన్నాడు— మానసికంగానూ, శారీరకంగానూ చైనా యింతటి కుట్ర చేస్తుందని ఆయన కల్లో కూడా ఊహించలేదు. అలాంటి దశలో ఆయన నాయకత్వాన్ని నడిపించటానికి ఎందరో ఉపనాయకులు కావాల్సి వచ్చారు. ప్లానింగ్ పేరిట, రక్షణ పేరిట మొరార్జీదేశాయి పన్నులను ఎక్కువ చేశాడు కానీ పన్నుల వనాళ్ళు జరక్కపోగా ఎగవేత మాత్రం ఉధృతంగా పెరిగి పోయింది



ప్రధాని శ్రీ శాస్త్రి

ఈనాటి పరిస్థితి ఏమిటి ? అడుగడుగునా కుంభకోణం జరిపే ప్రతిపక్షాలవారు కాంగ్రెస్ ప్రతిష్ఠను గంగపాలు చెయ్యటానికి సిద్ధమయ్యారు అయినప్పటికీ కాంగ్రెసులో ఈమాత్రం ఐక్యతైనా మిగిలిఉన్నదంటే అది నెహ్రూగారి చలవే మొత్తంమీద ఈనాడు కాంగ్రెసులో ఉన్నది రెండేరెండు వర్గాలు (1) అసమర్థులైన నాయకులు (2) పదవుల్లేని పెద్ద తలలు ఇలాంటి దశలో పాకిస్తాన్ మనమీద కత్తిగట్టిందంటే ఆశ్చర్యంలేదు. మన దేశంలోకి అమధ్య చైనా

ఒక రోడ్డేసింది ఇప్పుడు పాకిస్తాను రోడ్డు వేస్తున్నది వీటి భవిష్యత్తు ఏమిటో!

సరిహద్దుల్లో పరిస్థితి అలా ఉంటే నందా గారు పోయిన వారం కలకత్తాలో మాట్లాడుతూ "దేశంలో ఐక్యత ఉండాలి" అన్నారు ఆమాట కొస్తే కాంగ్రెసులోనే లేదు ఐక్యత! ఇక దేశంలో ఎక్కడనుంచి వస్తుంది?

పాకిస్తాన్‌కు మనమీద ఆధిపత్యం చెలాయించాలని ఎప్పటినుంచో ఆశ! ఆ ఆశ ఎప్పుడెప్పుడు నెరవేరుతుందా అని సమయంకోసం కాచుక్కూర్చున్నారు ఈ ఆశ వెనుక అంతరార్థం వేరే ఉంది ఎన్నో తరాలపాటు భారతదేశాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా పరిపాలించింది మహమ్మదీయులే గదా అని వాళ్ల విశ్వాసం పైగా ఆ రోజుల్లో హిందువులు వాజమ్మలై కూర్చున్నారని కూడా వీరికి తెలుసు ఆ మహమ్మదీయులే ఈనాడు పాకిస్తాన్ ద్వారా ఇండియాని దోచుకోవాలనుకొనటంలో ఆశ్చర్యమేమీ లేదు! పైగా పాకిస్తాను చైనాతో లాలూచీకి దిగింది ఎంతకైనా తెగించవచ్చు

ఈనాటి మన శక్తి సామర్థ్యాలు మాటేమిటి? కొందరు మనకేం ఫరవాలే దంటున్నారు. మరి కొందరు నిరాశ నిస్పృహలతో పెదవి విరుచుకుంటున్నారు. మన దేశంలో ఉండే వైమానికదళం, నౌకాదళం ఆశాజనకంగా లేవు అమెరికా పాకిస్తాన్‌తో ఆ మధ్య కుదుర్చుకొన్న ఒప్పందంవల్లనే ఇండియాకు పూర్తిగా తన సహకారాన్ని యివ్వలేకపోతున్నది అందువల్లనే ఇండియాలోని వైమానిక దళం సర్వ సన్నాహాలూ చేసుకోలేక పోతున్నది దీనికి తోడు ఇండియాలో ఈనాడున్న ఓడలు చాలవు ఒక దశలో రష్యా తన సహకారాన్ని అందచేస్తానంది కానీ, దాన్ని మనమే వినియోగించుకోలేకపోయాము ఆశించిన సహాయం అమెరికా యివ్వలేదు మిగిలింది పూజ్యం!

ఇండియా స్వాతంత్ర్య పరిరక్షణకు ప్రతిసైనికుడూ రక్తాన్ని ధారపోయటానికి సిద్ధంగా ఉన్నాడన్నారు రక్షణమంత్రి శ్రీ వై బి చావన్ పార్లమెంటులో. కాదన్నదెవరు? తగిన ఆయుధాలు లేనే లేవు. మన బంగారం మంచిది కాకపోతే స్వర్ణకారు డేం చేస్తాడు!

—శ్రీకృష్ణ ★

# బలియమైన విధి...



—మునిగిపోయిన పడవలు.

కృష్ణానదిలో తెప్పవుత్సవం జరుపుకొనేందుకు వెళ్ళిన ఎనిమిది పడవలు సీతానగరం వద్ద ఘోరమైన ప్రమాదానికి గురిఅయ్యాయి. ఎందరు మరణించారో తెలియలేదు. 18 శవాలు మాత్రం దొరికాయి. ప్రమాదం జరిగినప్పుడు పడవలలో దాదాపు 50 మంది వున్నట్లు పోలీసుల కథనం మొదట, ఒక పడవలోకి నీరు ప్రవేశించటం వల్ల ప్రమాదం సంభవించిందని కూడా తెలియవస్తున్నది.



ఒడ్డుకు చేరిన శవాల్ని కవా!




# సత్యాగ్రహం

— లలిత —

ఆముక్త మాల్యద ఆంధ్ర కవితా పితామహుడు అల్లసాని పెద్దన వ్రాసి కృష్ణదేవరాయల పేర వెలయించాడనీ; క్రీడాభిరామం శ్రీనాథ కవిసార్వభౌముడు వ్రాసి వల్లభరాయని పేర వెలయించాడనీ, కన్యాశుల్కం అప్పారావుగారు కాక అన్యులెవరో వ్రాశారనీ; సారస్వత రంగంలో అపవాద తరంగాలున్నాయి. కృతి - కర్తృత్వం గురించిన వివాదాలు లోకంలో సహజం!

అలాంటప్పుడు, సత్యాగ్రహం అన్న ఉద్యమానికి కారకులు గాంధీజీ అని యేకగ్రీవంగా యెందుకంగీకరించాలి? మరొకరెందుకు కారకులు కారాదు? వచ్చు! కావచ్చు! కనుక, వచ్చిన-తెలియవచ్చిన కారణాలు, ఉపపత్తులూ, ఉదాహరణ పూర్వకంగా వివరించే, నా ప్రతిపాదనను నేను బలపరుస్తాను.

సత్యాగ్రహం అంటే యేవిటి? ఆగ్రహం అంటే యీనాడు "కోపము" అనే అర్థంలో వ్యవహరిస్తున్నారు. కాని భాషాచరిత్రలో అర్థవిపరిణామము పరిశీలిస్తే; ఒకప్పుడొక అర్థంలో వినియుక్తమైన పదం, కొన్నాళ్లకు మారి, మరోలా వాడబడుతుందని-తెలుస్తుంది. విపరిణమించిన పదాలలో "ఆగ్రహం" కూడా వొకటి! ఆదిలో, ఆగ్రహం అంటే పట్టుదల అని అర్థం.

కోపం వచ్చినప్పుడు పట్టుదలలు పెరుగుతాయి. కనుక, ఆగ్రహానికి కోపం అనే అర్థ విపరిణామం సంభవించింది. ఇక, సత్యాగ్రహం అంటే సత్యం కోసం ఆగ్రహం అనే యెందుకు చెప్పుకోవాలి?

సత్యకి వచ్చిన ఆగ్రహం అని యెందుకు అనుకోకూడదు? అనుకుని తీరాలి! అదే సమంజసం కూడా! ఆవిడకి యిష్టం లేని యే పని జరిగినా, జరుగుతుందని తెలిసినా ఆగ్రహం వచ్చేది.

రాగానే, అలుక కొనసాగించేది. ఆ మానవతికి యెప్పుడెందుకెలా కోపం వస్తుందో, అన్నీ తనకి తెలుసునని అహంకరించే ఆ లీలామానుష విగ్రహుడికి సైతం తెలియని కిటుకు! తెలిసే అవకాశం యేదీ? స్వంతంగా ఆలోచిస్తే కదా తెలియడం? అతను స్వ-ఇచ్ఛా-అనుసారి కాడు. సత్యావిధేయుడు. (సత్య + అవిధేయుడు అని విసంధి చెయ్యకండి. పాపం వస్తుంది!)

ఆమె సమక్షంలో గాని, ఆ రమణీప్రియ దూతికలు వింటున్నప్పుడు గాని కృష్ణుడు సత్యభామా విధేయుడుగనే వ్యవహరింపబడాలి. ...హరింపబడకపోతే సత్య ఓర్మి హరింపబడుతుంది. బడి, ఆమెకి ఆగ్రహం వస్తుంది. రాకుండా సంచరించేవాడు కృష్ణుడు. అందుకనే ఆమె "మీర జాలగలడా నా యానతి" అనుకునేది అనేది సరాగంగా!

కాని, కాలగతి వొకలా వుండదు కదా! అద్దం తిరుగుతునే వుంటుంది

కథ! పురాణ కథ లన్నిటా (యెందుకేనా మంచిది, చాలా పురాణకథలలో) కథ అడ్డం తిరగడానికి కలహాభోజ బిరుదాంకితుడైన నారద మహామునీంద్రుడు సూత్రధారి అవుతుంటాడు.

సత్యాగ్రహం కథలో కూడా ఆ రివాజే పాటించబడింది నారదుడు కృష్ణుని చూదామని దేవలోకం నుంచి బయల్దేరి వచ్చాడు. మహాత్ముల్ని దర్శించేటప్పుడు రిక్త హస్తాలతో పోరాదు కదా, చేతులూపుకుంటూ!

పత్రమో, పుష్పమో పట్టుకెళ్ళాలి. ఆకులతో వున్న పువ్వు తీసుకెళ్తే, పత్రమూ పుష్పమూ యిచ్చినట్టుంటుందని, దేవపారిజాతం వొకటి తీసుకుని వచ్చాడు.

సత్యాలోలుడు ఆమె సన్నిధిని కొలువుతీరి వుండలేదు. "మిమ్మల్ని కొలిచే భాగ్యం మాకు అనుగ్రహించం" డని రుక్మిణి అర్థించడం చేత ఆమె కోరిక తీర్చడానికి, ఆమె మందిరానికి వేంచేశాడు. కృష్ణుని వునికి దివ్యదృష్టితో అవలోకించి నారదుడు అక్కడికి అవతరించాడు.

అభివాదములూ, ప్రత్యుత్థానములూ అయేయి. తెచ్చిన పువ్వు కృష్ణుడి కిచ్చి, ఇస్తినయ్యా వాయనం అన్నాడు నారదుడు. అందుకుని, పుచ్చుకొంటినయ్యా వాయనం అన్నాడు కృష్ణుడు.

నోము నోచాక, ఉద్యాపన చెప్పాలి కదా! నీకు నచ్చిన వారికి, నీ మది మెచ్చిన వారికి యీ పువ్వు యివ్వాలి సుమా!" అని ఉద్యాపన చెప్పాడు నారదుడు.

వలచి, కొలిచిన పూజాఫలంగా- సరసనవున్న రుక్మిణిని కృష్ణుడు పారిజాతాలంకృతను గావింపగా- నోము పండిన రుక్మిణి పట్టరాని తృప్తితో పరవశించి మురియగా- మురిపించినందుకు నరసిజనాభుడు మురియగా-నారదుడలవోకగా తినకింక-ఆరగింపు కయ్యం మొదలయేనని వుప్పొంగగా—

ఆ వైనం-కని-సత్యప్రియదూతిక వొక్క- అంగన పోయి-చాటున వుండి-తనువిన్నది- కన్నది- తన నేలిన తరుణికి తగుదునమ్మా యని విన్నవించగా, సత్య,

"మాసిన చీరగట్టుకొని
మౌనము తోడ నిరస్త భూషయై
వాసెన కట్టుగట్టి, నిడు
వాలిక కస్తురి పట్టుపెట్టి లోఁ
గాసిలి, చీకటింటికడ
కంకటిపై, జలదాంత చంద్రరే
ఖా సదృశాంగియై"

—గాఢ మనోజ విషాద వేదనతో వుండగా, అక్కడ గవాక్షం వెనుక కనుపించిన దూతిక గవాక్షులు తనకు మరిక కనిపించక పోగా కృష్ణునికి మతి స్థిమితం తప్పింది. ముని నా కిచ్చిన పూవు చందమును, నే మున్నాడి యీ భోజనందన కర్పించిన జాడయుం, తెలియ, చెంతం బొంచి, వీక్షించి, పోయిన సాత్రాజితి బోటి-నావలన తా నేమేమి కల్పించెనో" అని విపరీతంగా చలించిపోయాడట.

అతని తాల్మి, "కేసన పటాంచల చందల" మైందట! మనస్సు, "తిరిగెడు బండి కండ్ల పగిది" భ్రమించిందట! ఎందుకని? సత్యకి ఆగ్రహం వస్తుందని!.........

.....సత్యాగ్రహోద్యమంవల్ల దేవ పారిజాతం

"వామలోచన కేళి వనములోన
చలువ వెదజల్లు చెంగల్వ కొలని కెలన
సరస కర్పూర కదళికా తరులనడుమ
బెరటి చెట్టుగ....

—నాటింపబడింది, నా టి న, నాటినుంచే, అలిగి సాధించుకునే వుపాయానికి సత్యాగ్రహం అని పేరు వచ్చింది. ఈ పేరు-ప్రతిష్ఠలు ద్వాపరలో సత్యకి పూర్వమే - కృతయుగం నాటి కైకకి రావలసినవి. కాని ఆవిడ అలకవల్ల అవి విపరీత పరిణామాలు కలగడం చేత ఆ పేరు ప్రతిష్ఠలు ఆవిడకి దక్కలేదు

కారకులు వొకరు కాగా, పేరు మరొకరికి రావడానికి; ఆ యిద్దరికీ కొన్ని సారూప్యాలుండాలి కదా? ఆ ముక్త మాల్యదలో పెద్దన శైలీ, తిరుతెన్నులూ, క్రీడాభిరామంలో శ్రీనాథుని పోకడలూ కనిపించబట్టి కదా, సాహిత్య పరిశోధకులు అనుమానించడానికి ఆస్కారం కలిగింది! అలాగే సత్యాగ్రహానికి గాంధీజీ కాకుండా సత్య కారకురాలు కావడానికి కొన్ని పోలికలు కావాలి కదా? అవి యివి!

కృష్ణుడు రుక్మిణికి పువ్వు యివ్వలేదు. బ్రిటిష్ వాళ్లు మనకి స్వరాజ్యం యివ్వలేదు! సత్యకి ఆగ్రహం వచ్చింది. గాంధీగారికీ వచ్చింది! సత్య ఆగ్రహం వల్ల దేవపారిజాతం లభించింది. గాంధీగారి సత్యాగ్రహం వల్ల స్వరాజ్యం లభించింది!

పుణ్యక వ్రతం వల్ల సత్యకి గర్వభంగ మైందనుకొండి! అధికార వ్యామోహ వ్రతం వల్ల గాంధీగారి ఆశయాలకి భంగం వాటిల్లింది

ఇరువురి చరిత్రలలోనూ యీ సామ్యము లుండడం చేత, పరిశీలకులకు దగ్గర కాలంలో గాంధీగారు గోచరించడం చేత- అలనాటి సత్య ఆగ్రహం విస్మరింపబడి, గాంధీగారి సత్యాగ్రహమే మొదటిదనే భ్రమ చరిత్ర పరిశోధకులకు కలిగించింది. ఆ ఉద్యమానికి ఆయనే మార్గదర్శి అని అపోహపడ్డారు.

నిలకడ మీద నిజం వెల్లడైంది! సత్య మార్గదర్శి. గాంధీజీ ఆమె అనుయాయి.........! ★




# సిరి వరిస్తే

చిత్రపు హనుమంతరావు

ప్యాసింజరు రైలు ఒక్క కుదుపు కుదిపి స్టేషన్‌లో ఆగింది. చివరి కంపార్టుమెంటులో కిటికీ నానుకుని మగత నిద్రలోవున్న మోహనరావు ఉలిక్కిపడి లేచి, కళ్ళు నులుపుకుని స్టేషన్‌వైపు చూసి ఉలిక్కిపడ్డాడు. తను దిగవల్సిన వీరవాసరం స్టేషన్ వదలడానికి సిద్ధంగా ఉంది రైలు! కంగారుగా చేతిసంచీ పుచ్చుకుని రైలు దిగి, తేలిగ్గా వూపిరి పీల్చుకుని, సిగరెట్టు ముట్టించుకుని రైలు వంకే చూస్తూ లాంతరు స్తంభం దగ్గర నిలబడ్డాడు. రైలెక్కినప్పటినుండీ వీరవాసరందాటిపోతానేమోనని ఎంత కంగారుపడ్డాడు! అందువల్లనే భీమవరం వచ్చేంతవరకూ మెలకువగానే ఉన్నా ఎంతలో నిద్ర పట్టేసింది! ఈ రాత్రి రైల్లో వచ్చినప్పుడల్లా తనకు అనుమానమే నిద్రలోపడి పాలకొల్లో, నర్సాపురమో వెళ్ళిపోతానేమోనని! గతంలో కొన్నిసార్లు ఆవిధంగా జరిగింది. ఓసారి మాట వరుసకు వసంతతో అంటే తనను ఎంత హాస్యం చేసింది! అప్పటినుండీ రాత్రి రైల్లో వచ్చినప్పుడల్లా "ఏయే వూర్లు తిరిగివచ్చారు బావగారు? ....." అనడం మామూలైంది వసంతకు.

ప్లాట్‌ఫారంమీద కిర్సనాయిలు దీపాలు అంధకారాన్ని పారద్రోలడానికి వృధా శ్రమపడుతున్నాయి. పోర్టరు గంట కొట్టాడు గార్డు విజిల్‌వేసి, పచ్చదీపం చూపి రైలెక్కాడు ఓపికలేనట్లు వీరసంగా కూతవేసి, రిటైరవడానికి సిద్ధంగా వున్న గుమాస్తాలా భారమైన నిట్టూర్పు విడుస్తూ కదిలింది రైలు. రైల్లో జనం చీకు చింతలకు అతీతులైనట్లు నిర్విచారంగా జో తున్నారు రైలు స్టేషన్ దాటింది క్షణ క్షణాని దూరమయింది. టక . టక శబ్దం రాను రా తగ్గిపోయింది

ఆ చిమ్మ చీకట్లో ఎదురుగావున్న తో తోపు మరింత గంభీరంగా ఉంది కీచురాళ్ల ధ్వని దూరాన ఆనందంతో గెంతులువేసే నక్కల కూత తప్ప మరేమీ విన్పించడంలేదు స్టేషన్ వైపు నడిచాడు మోహనరావు స్టేషన్‌మేష్టరు బుకిం ఆఫీసు తలుపులు బిగించుకుని పక్కపై మే వాల్చాడు. పోర్టరు అఖరిదీపం కూడా ఆర్పే

స్టేషన్ [illegible] జేబులు తడుముకున్నాడు. చుట్టలైతే ఉన్నాయికాని, అగ్గిపెట్టె లేదు. మోహనరావువచ్చి బల్లమీద కూర్చుని, అప్రయత్నంగా రిస్టువాచీ చూసుకుని తనలో తాను నవ్వుకున్నాడు. అది అలవాటు ప్రకారం పన్నెండు గంటలు చూపిస్తోంది! తండ్రి మిగిల్చి వెళ్లిన ఆస్తి అది !

'అగ్గిపెట్టె ఉందా బాబూ?......" అన్నాడు పోర్టర్.

మోహనరావు అగ్గిపెట్టె ఇస్తూ, "టైమెంత అవుతుంది? ." అన్నాడు.

పోర్టరు చుట్ట ముట్టించుకుని గుప్పు గుప్పున పొగ వదుల్తూ, "ఇవాళ వేళకే వచ్చింది బాబూ బండి మూడు గంట లవుతుందేమో. ..." అన్నాడు.

తలెత్తి చూశాడు మోహనరావు ప్రకృతంతా అంధకార మయమయి ఉంది తను చేరవల్సింది నాలుగు మైళ్ల దూరానఉన్న రాయకుదురు గ్రామం స్టేషన్ బయటకువచ్చి చూశాడు వెంకన్న బండిని చూడగానే మనస్సు కాస్త తేలిక పడింది అంతదూరం నడచి వెళ్లవల్సిన అవస్థ తప్పింది కానీ ఇంత చీకట్లో బయల్దేరి వెళ్లడం శ్రేయస్కరంకాదు కాస్త తెల్లవారేక వెంకన్న బండి కట్టించుకుని వెళ్లవచ్చు.

మోహనరావు బల్లమీద కూర్చుని సిగరెట్టు ముట్టించుకుని, ఆలోచనల్లో మునిగిపోయాడు గతంలో కల్సిన 'నిన్న' మంచి నీటిలో సుందర దృశ్య ప్రతిబింబంలా కన్నులముందు మెదల సాగింది నిన్న ఎంత మధురమైన రోజు! తన కెంత ఉత్సాహమూ, ఆనందమూ కలిగాయి! తనలో గూడు కట్టుకునివున్న నిర్లిప్తతా, నిరుత్సాహమూ నిన్నటితో పటాపంచలయ్యాయి ఆరోజుకోసం నాలుగు సంవత్సరాలుగా కళ్లు కాయలు కాచేలా ఎదురు చూస్తున్నాడు హృదయంలో ఒక ప్రక్క ఆరోజు వస్తుందేమోనన్న ఆశ— అది పేరాశ కావచ్చు! మరోప్రక్క రాదేమోనన్న నిరాశ ఆరోజు వచ్చింది వెళ్లింది కాని ఆరోజు తన జీవన గ్రంథంలో సువర్ణాక్షరాలతో లిఖించుకోవల్సిన రోజు ఆనాటి తియ్యని అనుభవాలు, మధురమైన అనుభూతులు తన మనస్సులో ఏనాటికీ మరుగున పడవు ... ఆరోజు ..

* * *

తలుపు తట్టిన శబ్దం వినబడ్డంతో తనకు మెలకువవచ్చి, వళ్లు విరచుకుని తలుపు తీశాడు గుమ్మంలో నిలబడ్డ వ్యక్తిని చూడగానే నిద్ర మత్తు పూర్తిగా వదిలింది వచ్చింది చంద్రమ్మ కాదు! కాకీ బట్టల్లో టెలిగ్రాము ప్యూను. అతడి వైపు గుడ్లప్పగించి చూస్తూ నిలబడిపోయాడు

"వసంతగారికి టెలిగ్రాము వచ్చిందండి ." అన్నాడు టెలిగ్రాము ప్యూను. యాంత్రికంగా కవరు పుచ్చుకుని చూశాడు. వసంత పేరు క్రింద తన చిరునామా ఉంది. సందేహంలేదు! తన వసంతకే వచ్చింది! ప్యూను అందించిన కాగితం మీద సంతకం పెట్టాడు టెలిగ్రాము ప్యూను సైకిలెక్కి వెళ్ళిపోయాడు తనుమాత్రం గుమ్మంలో అచేతనంగా నిలబడిపోయాడు చాలాసేపు. చీకటి తెరలింకా కరగలేదు. [illegible] [illegible] లోపలికివచ్చి కూర్చున్నాడు. వణుకుతున్న వేళ్లతో కవరు చింపి టెలిగ్రాము చదివేడు. గుండెజబ్బు ఉన్నవాడయితే అలాంటి వార్తను చూసీ చూడగానే కళ్లు మూసేవాడే! కాని తను యవ్వనంలో ఉన్నవాడు, తనది దృఢమైన శరీరం, తనలో వేడిరక్తం ప్రవహిస్తోంది. అంతేకాక జీవితంలో సుఖంకన్న దుఃఖాన్నే ఎక్కువపాలు చవి చూసిన వాడు! ఆ విషాదమైన అనుభవాలతో హృదయం ఏనాడో మొద్దుబారిపోయింది . టెలిగ్రాము మరొక సారి చదివేడు . . సందేహంలేదు. తన వసంతకే వచ్చింది, వాళ్ల దగ్గర్నుంచే వచ్చింది!

సిగరెట్టు ముట్టించుకుని వాలు కుర్చీలో కూర్చున్నాడు. తన మనస్సులో ఆలోచనలు పరిపరి విధాల పోయాయి. నిన్నటికీ, ఇవాల్టికీ ఎంత తేడా! నిన్న మొన్నటివరకూ తన మనియార్డరు కోసం ఆతృతతో ఎదురుచూసే వసంతకూ, తనకూ అంతస్థుల్లో ఎంత తేడా . నిన్నటి వరకూ వసంత హైస్కూలు మేష్టారి ఒక్కగానొక్క సంతానం తన కాబోయే అర్ధాంగి "బావా నువ్వు చంద్రుడివైతే నేను వెన్నెలను. నువ్వు కల్పవృక్షానివైతే నిన్నల్లుకున్న లతను నేను. నీ తోడూ, నీడాకంటే నేను కోరుకునేది లేదు. " అని మురిసిపోయే వసంత ఈనాడు లక్షాధికారిణి! తానొక బ్యాంకులో గుమాస్తా ఇద్దరి అంతస్థులు భిన్న ధృవాలు. ఈ సిరి తమను వేరుచేస్తే? సిగరెట్టు ఆఖరివరకూ కాలి, చెయ్యి చురుక్కుమనడంతో ఆలోచనలకు అంతరాయం కల్గింది సిగరెట్టు పారేశాడు తన మనస్సు పెడ మార్గాలు పట్టడంతో బాగా బుద్ధి చెప్పింది సిగరెట్టు! వసంతను ఆవిధంగా వూహించడానికి మనసెల్లా వచ్చింది తనకు? తన మనస్సులో చెలరేగిన భావాలు వసంతకు తెలిస్తే కళ్లనీళ్లు పెట్టుకుని, 'ఈసిరి నాకువద్దు బావా నాకు కావాల్సిందల్లా నువ్వు " అంటుంది వసంత ఈ వలచి వచ్చిన సిరిని కాదనడానికి సిద్ధపడుతుందేమోకాని, తనను కాదనదు తనను ఏకాకిని చెయ్యదు! తన జీవితానికి వెలుగల్లా వసంత! ఎప్పటికీ వసంత! తన కొక ఆశా కిరణం వసంత! తన జీవిత సర్వస్వం వసంత! ఎప్పటికీ వసంత తనదే! అయినా తన పిచ్చికాని, సిరి వసంతను వరిస్తే ఒకటీ, తనను వరిస్తే ఒకటీనా? తమకు అలాంటి విభేదాలురావు. ఈ సిరి తమను వేరు చెయ్యలేదు.

"అదేమిటిబాబూ వీధి తలుపు బారుగా తీసేసి లోపలి గదిలో పరధ్యానంగా కూర్చున్నారు? "

చంద్రమ్మ గొంతు విని ఉలిక్కిపడ్డాడు ఏదో చెబుదామనుకున్నంతలో చంద్రమ్మ లోపలికి వెళ్లిపోయింది

"అబ్బాయిగారూ .. కాఫీకి నీళ్లు పడేశాను మొహం కడుక్కోండి .." చంద్రమ్మ లోపల్నుండి కేక వేసింది.

మొహం కడుక్కోడానికి పంపు దగ్గరకు వచ్చాడు. భళ్లున తెల్లవారింది. బాలభానుడు నిద్ర లేచి ప్రకృతినంతనూ నింపి వేస్తున్నాడు సూర్యోదయ దృశ్య శోభ ఎంత సుందరంగా ఉంది! వసంత సూర్యోదయ దృశ్య శోభని [illegible] తనను తాను మరచిపోతుంది. 'చూడుబావా.... ప్రకృతి దృశ్యం ఎంత రమణీయంగా ఉందో.....' అంటుంది. కేవలం వసంతను సంతృప్తి పరచడానికి తనూ నిలబడేవాడు. వసంత మాటల్లో సత్యం ఈనాడు తెల్సి వచ్చింది. ఈరోజు మామూలుగానే తెల్లవారింది. రోజులాగే ఈరోజూ సూర్యుడు ఉదయించాడు అయితే సూర్యోదయ దృశ్య శోభలో ఏదో ప్రత్యేకతఉంది తన మనస్సులో కరడు గట్టిన చీకట్లు కరిగి వెలుగు ఉదయించింది.

"అబ్బాయిగారూ ... పరధ్యానం జాస్తిగాఉంది. నీళ్లు కాగాయి " చంద్రమ్మ హెచ్చరింపుతో క్షణాల్లో దంతధావనం ముగించుకుని కాఫీ కలిపాడు. తనొక గ్లాసులో తీసుకుని, మిగతాది చంద్రమ్మ కిచ్చాడు కాస్త దూరంలో కూర్చుంది ఆమె కాఫీ త్రాగుతూ,

"చంద్రమ్మా . నాకు చాలా డబ్బు వచ్చిందనుకో. నీకేం కావాలి? . " అన్నాడు తను.

"పండంటి అమ్మాయిగార్ని పెళ్లి చేసుకోండి. ఎంత కాలమిలా ఇబ్బంది పడతారు?... "

చంద్రమ్మకు ఎందుకు తనంటే ఇంత అభిమానం? నెలకి తనిస్తున్న అయిదు రూపాయల వల్లా? లేక బర్మావెళ్లి మరి తిరిగిరాని కొడుకు పోలికలు తనలో వెతుక్కుంటోందా? ఉదయం ఆరు గంటలు కాకుండానే వచ్చి తనకు మేలు కొలుపు పాడుతుంది పక్కమీదినుండి లేస్తూనే చంద్రమ్మను చూస్తాడు నుదుట నిండైన కుంకుమ బొట్టుతో, జుట్టు ముడిలో ఏదో ఒక పువ్వుతో చంద్రమ్మను చూడగానే ఎక్కడలేని ధైర్యమూ కలుగుతుంది తనకు శకునాలమీద పిచ్చి నమ్మకం ఉండడంవల్ల. అన్ని మరచి, విషాదాన్ని విస్మరించి నవ్వు ముఖంతో కళకల్లాడుతూ ఉంటుంది వస్తూనే కుంపటి రాజేసి, కాఫీకి నీళ్లు పెట్టి, అంట్లు గిన్నెలు తోముతుంది. ఆ తర్వాత తనకు వంట పనిలో సాయంచేసి వెళ్లిపోతుంది రెండు గదులు, చక్కని వరండాఉన్న చక్కటి ఇల్లు. చంద్రమ్మలాంటి పనిమనిషి దొరకడం తన అదృష్టం రాజమండ్రి వచ్చిన కొత్తల్లో హోటలు భోజనం పడక ఎంత ఇబ్బంది పడ్డాడు! స్వయంగా వంట చేసుకోమని సలహా ఇచ్చిందీ చంద్రమ్మే!

"ఇవాళ వంట చేసుకో దల్చుకోలేదు. హోటల్లో భోజనం చేస్తాను "

ఆశ్చర్యపోయింది చంద్రమ్మ.

"నీకేమైనా డబ్బు కావాలా?

"నెల కాలేదు బాబూ "

పిచ్చి చంద్రమ్మ! డబ్బు అవసరమైనా నెల కాకపోతే అడగదు లోపలికివచ్చి పెట్టె తెరచి చూస్తే దాన్లో ఉన్నవి రెండే రెండు అయిదు రూపాయల నోట్లు! అవునుమరి నడుస్తున్నది నెల ఆఖరివారం. చంద్రమ్మకు అయిదు రూపాయలు ఇచ్చాడు. ఎంతో సంతోషంతో వెళ్ళిపోయింది చంద్రమ్మ తను ఆలోచిస్తూ వాలు కుర్చీలో కూర్చున్నాడు. ఇంటావిడ వచ్చి అడిగింది 'ఆఫీసులేదా బాబూ ' అని అప్పటికి ఆఫీసు గుర్తుకొచ్చింది. గడియారం చూస్తే పది

కులుబు దాటింది రోజూ తొమ్మిదయ్యేసరికల్లా అదరా బాదరాగా నాలుగు మెతుకులు కొరికి, బట్టలు వేసుకుని ఆఫీసుకు బయల్దేరుతాడు. రెండు మైళ్ల దూరానవున్న తను పనిచేసే బ్యాంకు చేరేసరికి సుమారు పదిగంటలవుతుంది అరగంట ముందు వెడితే ఏజెంటు రంగనాథంగారు ఆశ్చర్యం ప్రకటించరుకాని, ఒక్క నిముషం ఆలశ్యమయినా ఎక్కడలేని కోపమూ వచ్చేస్తుందాయనకు కళ్ళు, ముక్కుకొన ఎర్రబడతాయి. తర్వాత తన గదిలోకి కేకేసి యక్ష ప్రశ్నలు వేస్తారు ఒకరోజు తామందరూ కూర్చుని రంగనాథంగారి స్వభావాన్ని గురించి మాట్లాడుకుంటూ ఉంటే రాఘవరావు అన్నాడు. "రంగనాథంగారి స్థానంలోవున్న ఏ మానవుడయినా అలాగే ప్రవర్తిస్తాడు భార్య గయ్యాళి. ఆవిడ ఈయనగారి మాట వినదు కూడా. ఆవిడకు ఎదురు చెప్పగల ధైర్య సాహసాలు ఈయనకులేవు ఇంట్లోనూ, ఆఫీసులోనూ తన మాట చెల్లకపోతే ఎలా? ఆవిడపై తీర్చుకోలేని కక్ష మనపై సాధిస్తాడు. అక్కడ మేకపిల్ల ఇక్కడ పులిపిల్ల" అని. రాఘవరావు మాటలు ఎంతవరకూ నిజమో తనొకసారి ఆయనింటికి వెళ్ళినప్పుడు తెల్సింది. ఇంట్లో ఆయన్నుచూస్తే 'ఈయనకు మాటలు వచ్చా? రావా?' అన్పిస్తుంది ఎవ్వరికయినా నిన్నటివరకూ ఆయన చేతుల్లో బానిస తను! ఇవాళ స్వతంత్రుడు ఆయన అనే మాటలు పడే ఓపికా, ఓరిమి ఈనాడు లేవు. ఆయన ఏదైనా అంటే బాగా బుద్ధి చెప్పి, ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి మరీ వస్తాడు!

తీరుబడిగా స్నానం ముగించుకుని బట్టలు వేసుకుని, టెలిగ్రాము మరోకసారి చూసుకుని జేబులో పెట్టుకున్నాడు రిక్షాలో హోటలుకు

# సిరివరిస్తే

వెళ్లి భోజనంచేసి ఆఫీసు చేరుకునేసరికి పన్నెండు గంటలయింది. చేతిలో గోల్డుఫ్లేకు సిగరెట్టుతో ఆఫీసులో ప్రవేశించాడు తనలా నిర్లక్ష్యంగా వెళ్లడంచూసి ఆఫీసులో అందరూ తెల్లబోయారు రిజిస్టరులో సంతకం చెయ్యకుండానే తన సీట్లోకి పోయి కూర్చున్నాడు కొంతసేపు ఎవ్వరూ మాట్లాడలేదు తన వైపు వింతగా చూస్తూ ఉండిపోయారు అందరిలో కాస్త పెద్దవాడయిన కృష్ణమూర్తి దగ్గరకువచ్చి "ఏం భాయీ. ఆఫీసు మీద శీతకన్ను వేశావు ఎక్కడైనా మంచి ఉద్యోగం దొరికిందా, లేక అయ్యగారి కోప తాపాలకు తాళలేక ఉద్యోగానికి తిలోదకాలిద్దామనుకుంటున్నావా?" అన్నాడు తన సమాధానం కరస్పర్శ, చిరునవ్వు! కృష్ణమూర్తికి అర్థం కాలేదు

"మూర్తీ. నువ్వు ఆరోజు అలాంటి అమూల్యమైన సలహా ఇవ్వకపోతే ఇవాళ నేను ఇంత ఉత్సాహంగా, ఆనందంగా ఉండేవాడ్నికాదేమో ..."

"ఏమిటో చెప్పవయ్యా సస్పెన్సులో పెట్టక"

మారు మాట్లాడక టెలిగ్రాము అతడి చేతికిచ్చాడు. కృష్ణమూర్తి సంతోషంతో తనను వాటేసుకుపోయాడు తక్కినవాళ్లు వచ్చారు విన్నారు. తన అదృష్టాన్ని కొనియాడేరు. రంగనాథంగారిపై కక్ష తీర్చుకోడానికి మంచి సమయమని, ఆయనకు తగిన విధంగా బుద్ధి చెప్పమని ప్రోత్సహించేరు రాజీనామా రాసి, జేబులో పెట్టుకుంటూంటే సీతయ్య వచ్చి చెప్పాడు 'అయ్యగారు పిలుస్తున్నారని' కుర్చీలోంచి లేచి, కాలరు సర్దుకుని సిగరెట్టు ముట్టించుకుని ఆయన గదిలో ప్రవేశించాడు తనను ఆవిధంగా చూడగానే ఆయనకు నోట మాట రాలేదు అవునుమరి అంతవరకూ ఆయన అల్లంత దూరంలో ఉండగానే చేతిలో సిగరెట్టు జార విడిచేవాడు! సిగరెట్టు పొగ వదలడంతో అగ్గిమీద గుగ్గిలం వేసినట్లయింది ఆయన కోపం తారస్థాయిని అందుకుంది

"ఆఫీసుకువచ్చి ఎంత సేపయింది?...

"పది నిముషాలు కావచ్చు"

"ఆఫీసు ఎన్ని గంటలకో మర్చిపోయావా?.

". . . . ."

"నిన్నే అడుగుతున్నది అంత నిర్లక్ష్యంగా ఉన్నావు. మతుందా?......"

"ఎవరికి ,"

"వాట్!!! అంతవరకూ వచ్చిందా? ఇవాళ్టివరకూ నీమీద దయా దాక్షిణ్యాలు చూపిస్తూ వచ్చాను. వాటికి నువ్వు అనర్హుడివి 'మోస్ట్ ఇనెఫిషియంట్!', నీలాంటి 'మేనర్‌లెస్', 'రెక్‌లెస్', 'ఇనెఫిషియంట్' ఫెలోస్ మాకు" ఆయన మాటలు అనడానికి అవకాశ మివ్వక 'ఆగండి' అని తను గర్జించడంతో అదిరిపడ్డారాయన. జేబులో కాగితం ఆయన చేతుల్లో పెట్టి,

"మిస్టర్ రంగనాథం ఈ క్షణంనుండి నేను మీ చేతికింద గుమాస్తాని కాదు మర్యాద ఇచ్చి పుచ్చుకోవడం నేర్చుకోండి" అని విసవిసా తలుపు దగ్గరకు వచ్చి వెనక్కి తిరిగి చూశాడు ఆయన ముఖం పాలిపోయింది కత్తివాటుకు నెత్తురు చుక్కలేని పరిస్థితి ఆయనకు ఓటమి, తనకు గెలుపు. హృదయంలో ప్రతీకారం తీర్చుకున్నానన్న సంతోషం వెంటనే ఆఫీసు వదిలి వద్దామనుకుంటే తక్కినవాళ్లు కదల నిస్తేకద! రంగనాథంగారు తేరుకుని రామ్మూర్తిని పిలిచేసరికి గంట పట్టింది రామూర్తి అసలు సంగతి చెప్పాడు కాబోలు వెంటనే తన దగ్గరకు వచ్చారు ముఖంలో చిరునవ్వు తెచ్చిపెట్టుకుని,

"ఏమయ్యా మోహనరావు... ఇలాంటి శుభవార్త నా చెవినవేస్తే నోట ముత్యాలు రాల్తాయటయ్యా యు ఆర్ ఎ 'మిస్చివస్ బోయ్' .. ఎంత హడావుడి చేశావు రా . నాచేంబరులోకి రా" అంటూ తన చెయ్యి పట్టుకుని మరీ తీసుకు వెళ్లారు సీతయ్యను హోటలుకి పంపి కాఫీ ఫలహారాలు తెప్పించారు 'నీకు లాటరీ తగిలిందని అయ్యరుకు తెల్సిందేమో .. బాదంహల్వా నోట్లో వేసుకుంటే కరిగిపోతోంది.... ఇడ్లీలు దూదిలా ఉన్నాయి కాఫీ అమృతం కదయ్యా .." అంటూ కబుర్లు చెప్పి బలవంతాన ఫలహారం తినిపించి, కాఫీ త్రాగించేరు.

"వసంతంటే నీ మేనమామ కూతురుకదూ?"

"అవునండి"

"ఈ అమ్మాయితోనేకదూ నీ పెళ్లి నిశ్చయమవుతా?"

"ఊఁ"

"అదృష్టవంతుడివి మోహనరావు. ఈ అమ్మాయితో నీ పెళ్లి నిశ్చయమవడం, పెళ్లి కాకుండానే అమ్మాయి పేరున నువ్వు లాటరీ టికెట్టు కొనడం, ఫస్టు ప్రయిజు రావడం చాల తమాషాగాఉంది సుమీ ... అంతా అమ్మాయి



"మీరు ఫస్టుఫారంలోపెట్టిన స్కాలర్ షిప్ దరఖాస్తేనా? అప్పుడేనా? కాస్తాగండి మరి...!"

# మీరు త్రాగే ప్రతికప్పు టీ రుచి, సువాసన పోకుండా వుండాలని బ్రూక్ బాండ్ వారు ఎలా తాపత్రయ పడుతున్నారంటే

ఓ కప్పు టీ మీకు ఎంత ముఖ్యమో – అదేవిధంగా సువాసన, కమ్మదనం ముఖ్యంగా టీలో వుండితీరాలి అని బ్రూక్ బాండ్ వారు రుచి చూడటంలోను, బ్లెండింగ్ చేయటంలోను, టీ సరఫరా చేయటంలోను వారికిగల 60 ఏండ్ల అనుభవంతో తెలుసుకో గలిగారు.

వారికి గల ముఖ్యమైన బ్లెండ్లలో ఒకదానిని తయారు చేయడానికి బ్రూక్ బాండ్ టీ టేస్టర్లు నిత్యం 600 రకాలకు పైగా మాదిరి చూస్తారు వీటిలో 30కి పైగా వేరువేరు తోటలనుండి వచ్చే టీలను ఎంచి, ఆఖరి బ్లెండు ప్రత్యేక సువాసన కమ్మదనాలతో మీ అభిరుచులకు తగినట్లుగా వుండే టట్లు హామీ యిస్తారు

కాని యింత నేర్పుతో చేసే టీ బ్లెండింగు ఒక్కటే సరిపోదు. ఎంత శ్రేష్ఠమైన బ్లెండ్లయినప్పటికీ సువాసన, కమ్మదనం పూర్తిగా అనుభవించాలంటే అవి తప్పనిసరిగా తాజావే అయి వుండాలని బ్రూక్ బాండ్ వారికి తెలియని సంగతి కాదు తాజాదనం పోకుండా వుండాలంటే టీని గాలి చొరలేని డబ్బాలలో ప్యాక్ చేయడం ఒక మార్గం. అలా చేస్తేనే నాణ్యత తగ్గకుండా, కల్తీ లేకుండా టీ లభిస్తుంది

బ్రూక్ బాండ్ వారు యింతటితో వూరుకోలేదు. వారి సేల్స్‌మెన్ స్వయంగా ఎప్పటికప్పుడు తాజా సరకులను సరాసరి లక్షల షాపులకు వారంవారం అందిస్తూంటారు. వీటిలో మీదొకటి అందుకే మీరు కొనే బ్రూక్ బాండ్ టీ మిక్కిలి తాజాగా లభిస్తుంది ... ఎప్పుడూ ఒకే రుచి, సువాసనలను ఇస్తుంది.




IWT882408

"మా మామయ్య కూతురు వసంత వుంది.... తోపెళ్ళికూడా నిశ్చయమయింది "

"మూడక్షరాల పేరు బాగానేవుంది. . అమ్మాయి పేరున రాసి, నీ 'కేరాఫ్' ఎడ్రసు ఇచ్చుకో. "

కృష్ణమూర్తి సలహా నచ్చింది తనకు. ఇంత కాలం తనపేరున కొంటే ఫలితం లేదు.

'ఈసారి వసంత పేరున కొంటే? .' అన్పించి కృష్ణమూర్తి చెప్పినట్లు తూ. చ. తప్పకుండా పడచుకున్నాడు కృష్ణమూర్తి సిగరెట్టు దమ్ము లాగి, పొగను వదుల్తూ

"నేను కథలు రాస్తానని మీలో ఎంతమందికి తెలుసు? " అన్నాడు

"నువ్వా, నేనూ కథలు రాయడం మొదలు పెడితే పత్రికల పరిస్థితి, పాఠకుల పరిస్థితి ఎలా వుంటుందో ఊహించు .." అన్నాడు తను పకపకా నవ్వుతూ.

"సీపీ మా శ్రీమతి కథలు రాస్తుందని తెలుసు కదూ "

"తెలుసు ఆవిడ కథారచనలో అగ్రస్థానాన్ని సంపాదించుకుంది "

"నిజం ఎప్పుడూ చేదుగా రుచించడం సహజం నువ్వు హాస్యం చేస్తావని నేను బాధపడను. ఈ రహస్యం ఇంతవరకూ ఎవరికీ చెప్పలేదు సందర్భం వచ్చింది కాబట్టి నీతో చెబుతున్నా . నేను బి. ఏ ప్యాసయ్యాక కథలు రాయడంలో మంచి ఆసక్తి ఉండేది చాలా కథలు రాసాను పత్రికలకు పంపేను నా పేరుతో ఏ ము ం దో గా ని వారం తిర క్కుండానే 'భూమి గుండ్రంగా వుంది' అని నిరూపిస్తూ నన్ను వెతుక్కుంటూ తిరిగి వచ్చేవి ! ఆ తర్వాత ఉద్యోగంలో చేరాను, పార్వతితో వివాహమైంది పార్వతి నాకథలు చదివి తెగమెచ్చుకునేది కాని అవే కథలు ప్రచురణకు అర్హతలేదని పత్రిక వాళ్లు తెలియజెప్పారని అమాయకపు పార్వతికేం తెలుసు? ఒకరోజు నాకొక వింత ఆలోచన పుట్టింది నాకథలు పార్వతి పేరున పంపుతే? అలాగే చేశాను ఫలితం ప్రచురణమయింది అప్పటి నుంచీ పార్వతి పేరునే నాకథలు పంపుతున్నాను చాలా ప్రచురణ మయ్యాయి పార్వతికీ కథలు చదవడంలో మంచి ఆసక్తి వుంది, నాకు ప్రోత్సాహాన్ని ఇస్తుంది ఒకొక్కసారి అమాయకంగా అంటుంది 'మీపేరున ఎందుకు పంపరని' నేను తేలిగ్గా నవ్వి 'నీపేరున పడితే నాపేరున పడినట్లు కాదా?' అంటాను, కాని అసలు రహస్యం ఇంత వరకూ పార్వతికి చెప్పలేదు

ఆనాడు కృష్ణమూర్తి మాటల్లో నిజం తనకు ఈనాడు తెలిసి వచ్చింది సాయంత్రంవరకూ భవిష్యత్తును గురించి కలలు కనడంతోనూ, స్నేహితులతో ముచ్చటించడంలోనూ గడచి పోయింది. తర్వాత తాము కృష్ణమూర్తి ప్రోగ్రాము ననుసరించి అయ్యారు హోటల్లో కాఫీ, ఫలహారాలు సేవించి, సినిమా చూశారు, హోటల్లో భోజనం చేశారు తర్వాత తనను రైలెక్కించి వాళ్ళు వెళ్ళి పోయారు

* * *

ఎక్కడో తొలికోడి కూసింది మోహనరావు ఆలోచనలకు అంతరాయం కల్గింది తెలతెలవారుతున్నది బండి వెంకన్నను నిద్రలేపాడు. కొద్ది క్షణాల్లో బండి సిద్ధమయింది నంచి పుచ్చుకుని బండెక్కి మేము వాల్చేడు. బండి కదిలింది. మోహన రావు సిగరెట్టు ముట్టించాడు. అకించని సౌభాగ్యం పొందినప్పుడు, గతంలో కలిగిన విషాదంతో బేరీజు వేసుకుని మరింత ఆనందించడం మానవ లక్షణం !

మోహనరావు స్వగ్రామం రాయలవారి కాలంలో ఒక వెలుగు వెలిగిన రాయకుదురు గ్రామం తండ్రి భీమవరంలో డాక్టరు . ఆయన మూర్తి. ఆరడుగుల భారీ విగ్రహం, నల్లని జుత్తు... ఒత్తయిన మీసాలు కాంతి నహనాలకు పుట్టినిల్లయిన విశాలమైన కళ్ళు... మోహనరావు మనస్సులో గతమంతా మెదిలింది...

అప్పటికి తను ఏడేళ్లవాడు సాయంత్రమయ్యే సరికి తల్లి చక్కగా సింగారించుకుని తన తండ్రి కోసం వేయి కళ్లతో ఎదురు చూసేది తండ్రి వస్తూనే తనను ముద్దుపెట్టుకుని తల్లితో లోపలికి వెళ్ళి పోయేవాడు తనుకూడా వెడితే తల్లి అనేది 'బాబూ పోయి ఆడుకోమ్మా ' అని

ఒకరోజు అర్ధరాత్రి ఎవరో వచ్చారు, ఏదో చెప్పారు . తండ్రి కంగారుగా 'స్టెతస్కోపు', మందుల పెట్టె తీసుకుని వాళ్లవెంట వెళ్ళి పోయాడు రెండుగంటల తర్వాత ఎవరోవచ్చి, తల్లితో ఏదో చెప్పారు. ఆవిడ ఘోరుమంది, నెత్తి బాదుకుంది తనను పక్కింటి పిన్నిగారు వచ్చి తీసుకుని వెళ్లారు ఉదయం మేనమామ వచ్చాడు

## చిన్నారి పాప

చిన్నారి పాపాయి
చిరునవ్వు నవ్వితే
వెన్నెల్ల వెలుగులు
ఇల్లెల్ల నిండును.
అందాల మా పాప
అధరాలు ముడిచితే
కమనీయ కావ్యాలు
కనిపించునందులో.
మా పాప కన్నులలో
మెఱిసేటి కాంతి
మా యింట వెలిగేటి
ఆనంద జ్యోతి.
చిట్టి మా పాపాయి
చిన్ని కపోలాలు
అరవిచ్చి మెఱిసేటి
లేతగులాబీలు
మా యింటిలో పాప
మా కంటికే వెలుగు
మా పాప రూపమే
మా యింటి దీపము.

-కుమారి ఆవుల ప్రమీలాదేవి

తల్లినిల్ని పెట్టుకున్నాడు. ఆనాటితో తల్లి స్వరూపం మారిపోయింది ముఖాన బొట్టులేదు కళ్లకు కాటుకలేదు తలలో మల్లెలులేవు తల్లిని చూడగానే భయంవేసి, వెనవేసుకుపోయేవాడు తల్లిని ఒకటిరెండుసార్లు 'నాన్నేడమ్మా ' అన్నాడు తను 'వస్తారు నాన్నా ' అనేది తనను హృదయానికి హత్తుకుంటూ. తల్లి హృదయంలో దాగివున్న విషాదమంతా ద్రవించి కన్నీరై కళ్లవెంబడి కాలువలై ప్రవహించేది. ఒకసారి పక్కింటి బాబిగాడు చెప్పాడు 'మీనాన్న లారీ క్రిందపడి చచ్చిపోయేడురా ' అని. అప్పుడు తనకు అర్థంకాలేదు. జ్ఞానం వచ్చేక తెల్సింది— తన తండ్రి మరి తిరిగి రాడని.

మేనమామ తన తల్లినీ, తనునూ తీసుకుని రాయకుదురు వెళ్లాడు తన జీవితంలో అదొక మైలు రాయి మేనమామ ఒక్కగానొక్క సంతానం మూడేళ్ల వసంత ముద్దొస్తూ, బోసి నవ్వులు చిందిస్తూ ఉండేది వసంతను ఎత్తుకుని ఆడిస్తూ, నవ్వించి నవ్వుతూ గడిపి వేసేవాడు తను. అత్తయ్యను అడిగేవాడు 'ఆపాప తనకేమవుతుంద'ని 'నీ కాబోయే పెళ్లామోయ్' అనేదావిడ నవ్వుతూ. తనకు ఆవిడ మాటలు అర్థమయ్యేవి కావు

మేనమామ వీరవాసరం హైస్కూల్లో లెక్కల మేష్టారు ఉదయం ఎనిమిది గంటల కల్లా నలుగు రైదుగురు విద్యార్థులను వెంటబెట్టుకుని వెంకన్న బండిలో వెళ్ళి పోయేవాడు సాయంత్రం చీకటి పడ్డాక ఇల్లు చేరుకునేవాడు

తనను రాయకుదురు ఎలిమెంటరీ స్కూల్లో జేర్పించాడు మేనమామ వసంతతో ఆటలు ఆడ డానికి సమయం తగ్గిపోయింది మరో మూడేళ్లకు వసంత పెరిగి పెద్దదయి తనతో స్కూలుకి వచ్చేది థర్డు ఫారము వరకూ చదువు అక్కడే సాగింది తర్వాత వీరవాసరం హైస్కూల్లో జేర్పించడంతో మేనమామతో ఉదయం వెళ్లి, సాయంత్రానికి తిరిగి వచ్చేవాడు. వసంతతో గడప డానికి సమయం మరింత తగ్గిపోయింది ఎస్సెల్సీ మంచి మార్కులతో ప్యాసు కావడంతో భీమవరం కాలేజీలో జేర్పించాడు మేనమామ రెండు రోజులు సెలవులొస్తే మేనమామ ఇంట్లో ప్రత్యక్ష మయ్యేవాడు తను అది కేవలం వసంతను చూడ టానికే ఒకసారి కన్పించినట్లు మరొకసారి కన్పించేది కాదు ఆమె మోహంలో సిగ్గు మొగ్గలు తొడగడం మొదలయింది ఆమె రూపురేఖలు తీర్చి దిద్దడానికి పూనుకున్నాడు సృష్టికర్త తనను చూసి సిగ్గుపడేది తను ఎప్పటి బావే కదా ! తనను చూసి సిగ్గుపడుతుందేమిటి ? అది ఆమె తప్పు కాదు కాలం ఆమెలో తెస్తున్న మార్పు.

మేనమామ నవీన భావాలు కలవాడు స్త్రీ పురోగాభిలాషి అందువల్లనే వసంత చదువు థర్డు ఫారంతో ముగియలేదు వీరవాసరం హైస్కూల్లో చదువు కొనసాగించింది

సంవత్సరాలు గిర్రున తిరిగాయి తను బి ఏ. ఫస్టు క్లాసులో ప్యాసయ్యాడు వసంత ఎస్సెల్సీ ప్యాసయింది తల్లి ముఖంలో వెలుగు వర్ణించ నలవికాదు తన బాబు కలెక్టరవుతాడని మురిసి పోయింది పాపం ఆమెకు తెలియదు తనలా బి ఏ. ఫస్టుక్లాసులో ప్యాసయినవాళ్లు గుమాస్తాలుగా స్థిరపడతారని రాజమండ్రీలో బ్యాంకులో ఉద్యోగం రావడంతో మేనమామ సంతోషించాడు. కొద్ది సంవత్సరాలలో ఆఫీసరు కావచ్చునన్నాడు. వాణ

గన్నా గడిచాయి. తన ఉద్యోగపు హోదాలో మార్పులేదు. జీతం మాత్రం ఐదు రూపాయలు పెరుగుదల వసంతకు లాటరీలో ప్రయిజు వచ్చిందని తెల్సాక కదా ఆఫీసరు పోస్టుకి రికమెండ్ చేస్తానన్నారు రంగనాథంగారు ! ఉన్నచోటనే మరింత చేరడం ధన లక్షణం కాబోలు !

ఉద్యోగంలో చేరడంతో తల్లి తన పెళ్ళిని గురించి తొందరపడింది తమ అభిమతం వసంత కాలేజీలో చదవాలని వసంత అంది : 'నా కెందుకు బావా పై చదువుల' ని తన సమాధానం 'లోక జ్ఞానం పొందడానిక' ని మేనమామ అన్నాడు 'ఆడ పిల్లకి పై చదువు లెందుకు ? భీమవరం కాలేజీలో చదివించాలంటే ఖర్చెంత అవుతుందో ఆలోచించావా ?' అని వసంత చదువు ఖర్చు తను భరిస్తానని చెప్పినప్పుడు ఎదురు చెప్పలేక 'దాన్ని చేసుకునేది వాడు, వాడిష్టం' అని సమాధాన పడ్డాడు తల్లి మౌనం వహించింది 'నీ అభిమతానికి ఎదురు చెప్పలేను, నీకోసం చదువు తాను' అంది వసంత భీమవరంలో ఇల్లు అద్దెకు తీసుకుని వసంతనూ, అమ్మమ్మనూ దాన్లో ప్రవేశ పెట్టి, వసంతను కాలేజీలో చేర్పించి తను రాజమండ్రి చేరుకున్నాడు అది నాలుగేళ్ల క్రితం

"మన వసంత మొహంలో లక్ష్మీ కళ ఉందిరా" అనుకుని మురిసిపోయేది తల్లి ఈనాడు ఉంటే ఎంత సంతోషించేది !

క్రిందటి వేసంగిలో మేనమామ ఉత్తరం రాశాడు 'తన తల్లికి సుస్తీగా ఉంద'ని వెంటనే సెలవు దరఖాస్తు పెట్టాడు అప్పుడు సెలవులో ఉన్న పేరిశాస్త్రి ఆఫీసులో చేరేంతవరకూ ఎవ్వరికీ సెలవు మంజూరు చెయ్యనని నిష్కర్షగా చెప్పారు రంగనాథంగారు. తను తల్లి దగ్గరకు చేరుకునేసరికి సమయం మించిపోయింది.

'ఇప్పుడో? మరుక్షణానికో ?' అన్నట్లుంది తల్లి పరిస్థితి తనను గుర్తించలేదు ఆ పరిస్థితిలో తల్లినిచూసి దుఃఖమాగక బావురుమన్నాడు కొద్ది సేపట్లో అంతా అయిపోయింది తల్లి వసుధలో కలిసిపోయింది. తనకు జీవితంపై విరక్తి పుట్టింది. వసంత తనను ఓదార్చేది తనను ఎల్లవేళలా కని పెట్టుకుని ఉండి, తన అవసరాలను సమకూర్చేది. తనను మామూలుగా మనిషిని చెయ్యడానికి సమస్తవిధాల ప్రయత్నించేది

"అమ్మ నన్ను విడచి వెళ్లిపోయింది నా కెవరున్నారు లోకంలో ?" అంటూ ఏడ్చాడు వసంత దగ్గరొకసారి

"నే నున్నాను బావా " అంది చీర చెంగుతో తన మొహం తుడుస్తూ వసంత ఒడిలో మొహం పెట్టుకుని పడుకున్నాడు హృదయభారం తగ్గి ఉపశమనం కల్గింది జుట్టు సవరిస్తూ అంది

"ఆ ముందురోజు అత్తయ్య నాతో చాలాసేపు మాట్లాడింది బావా . నాచేత ప్రమాణం చేయించుకుంది 'నీకు తోడునీడగా ఉంటాన' ని తనకు ఆఖరు ఘడియలు సమీపించాయని తెల్సిందో ఏమో గాని, నాన్నతోనూ, అమ్మతోనూ మన పెళ్లి విషయమే మాట్లాడింది నాన్నగారు అన్నారు "మోహనుని అల్లుడుగా చేసుకోవడం కంటె నేను కోరుకునేది మరేమీలేదు సుభద్రా .. ఈ విషయమై నువ్వు దిగులుపడద్దు" అని అమ్మ కూడా ఆమాటే అంది. అత్తయ్య తృప్తిగా శ్వాస తీసుకుంటూ 'ఇప్పటివరకూ వాడ్ని గురించే బెంగ.. ఇప్పుడు అదీ తీరింది..... వసంత వాడ్ని ప్రేమానురాగాలతో చూసుకోగలదు. .. వాడికి ఏలోటూ రానివ్వదు' అని. ఆ రాత్రి చాలా ఉత్సాహంగా కన్పించింది మేమందరమూ జబ్బు తిరుగుముఖం పట్టిందని అనుకుని సంతోషించాము గాని, అత్తయ్య జీవితం కొన్ని ఘడియల్లో ముగుస్తుందని వూహించలేకపోయాము" అని,

". . . . . . . . ."

"బావా .. . నేను చదువు మానేస్తాను .... నీ సుఖం కంటే ఆ చదువు ఏమాత్రం ఎక్కువ కాదు "

"వద్దు వసంతా .. మరొక్క సంవత్సరం వోపికపడితే డిగ్రీ వస్తుంది "

నాలుగైదు రోజుల క్రితం మేనమామ ఉత్తరం రాశాడు వసంత పరీక్షలు బాగా వ్రాసిందట అమ్మమ్మా, వసంతా రాయకుదురు వచ్చేశారట మే నెలలో పెళ్లి ముహూర్తాలు ఉన్నాయని, సెలవు ప్రయత్నంమీద ఉండమని రాశాడు కొద్ది రోజుల్లో ఇంతకాలమూ తన హృదయంలో నవ వసంతాలు వెలిగించిన వసంత శాశ్వతంగా తనదై పోతుంది వసంత గుర్తుకువస్తే, ఆమె మూర్తి

లత : రాధా ! ఈ బొమ్మల
గుడ్డ నీ జాకెట్టుకా మీ
అమ్మాయి గౌనుకా ?
రాధ : మా వారి షర్టుకి !

తవిజవజ (విశాఖ)

కళ్లముందు మెదిలి, మనస్సులో మధురానుభూతుల్ని రేకెత్తిస్తుంది

"వసంతా. ." అని గొణుక్కున్నాడు మోహనరావు

"అమ్మాయిగారు వచ్చి వారం పదిరోజులయిందండి "

"ఎంతదూరం వచ్చాం వెంకన్నా?....."

"రాయకుదుర్లోనే ఉన్నామండి "

మోహనరావు లేచి కూర్చున్నాడు. ఠళ్లున తెల్లవారి పోయింది ఇల్లు రెండు ఫర్లాంగుల దూరంలోవుంది 'ఇంటికి పరిగెత్తుకుని వెడితే?' తన ఆలోచనకు నవ్వుకున్నాడు మోహనరావు ఈవార్త ముందెవ్వరికీ చెప్పడు వసంతను కవ్వించి నవ్వించి మరీ చెబుతాడు వసంత హాస్యం చేస్తున్నాడనుకుంటుంది ఇంటిదగ్గర బండి ఆగడంతో క్రిందకు దూకి లోపలకు పరిగెత్తాడు

"ఏ మేవ్ అల్లుడొచ్చాడు ." అన్నారు రమణయ్యగారు

కమలమ్మగారు వచ్చి అతడ్ని కుశల ప్రశ్నలు వేసి ఆడావుడిగా లోపలికి వెళ్లింది కాఫీకి నీళ్లు పడేసి, మోహనరావు స్నానం చెయ్యడానికి నీళ్లు తోడమని రంగికి పురమాయించిందావిడ

మోహనరావు లోపలికి వెళ్లబోతూఉంటే

"కూర్చోరా ఏమిటి సంగతి ఉత్తరం రాయకుండా వూడిపడ్డావు....." అన్నారు రమణయ్యగారు.

ఆయన మాటలు వినిపించలేదు. అతడి తొందరపాటు చూసి తృప్తిగా నవ్వుకున్నారు రమణయ్యగారు. వసంత గదిలోకి దారితీశాడు మోహనరావు. వసంత పక్కమీద లేదు తనెంత పిచ్చివాడు! సూర్యోదయ దృశ్య శోభ తిలకిస్తూ మల్లె పందిరి దగ్గర నిలబడి ఉంటుంది.

"వసంతా . " అన్నాడు అనురాగంతో.

సమాధానంలేదు. తనిలావస్తే అలా లోపలికి వెళ్లిందేమో కొద్ది క్షణాల్లో తిరిగి వస్తుంది. తనని చూసి ఆశ్చర్యపోతుంది. 'ఇన్ని నెలలకి గుర్తుకి వచ్చానా బావా.. ..' అంటుంది ఎల్లవేళలా తన కళ్లముందు మెదిలే జవ్వని తనంటే మొహం ఎర్రబడిపోతుంది.

కుర్చీలో కూర్చున్నాడు మోహనరావు. టెలిగ్రాము మరొకసారి చూసుకున్నాడు గాలి వీచింది. బల్లమీద కాగితం క్రిందపడింది మోహనరావు తీశాడు దానిపై చక్కని దస్తూరీ వసంతది. చదువ నుపక్రమించాడు మోహనరావు.

"నాన్నా,

'కాలేజీ చదువులు చదవడం లోకజ్ఞానం సంపాదించడానికి' అన్నాడు బావ కాని ఆ చదువు నాలో ఉన్న జ్ఞానాన్ని నశింపజేసింది . పరిస్థితుల ప్రోద్బలంవల్ల కళ్లల్లో పొరలు క్రమ్మాయి. నన్ను నువ్వూ, అమ్మా, బావా క్షమించగలరేమో గాని లోకం క్షమించదు నలుగురూ నన్ను వేలెత్తి చూపిస్తారు .

నువ్వెంత అమాయకుడివి నాన్నా ... నేను వచ్చినప్పటినుండీ చిక్కిపోయానని బలానికి మందు తిప్పిస్తున్నావు ఒకటి రెండు సార్లు తిన్నది వమనం చేసుకుంటే పైత్యం చేసిందని భ్రమ పడ్డావు ఒక వ్యక్తి నన్ను పెడ మార్గాలు పట్టించి తన దాహాన్ని తీర్చుకున్నాడు ఫలితం నేను తల్లిని కాబోతున్నాను ఇంతకాలం బావకు ఏదో ఒక విధంగా నచ్చ జెప్పవచ్చునని, అతడు నన్ను మోసగించడనే ఆశతో జీవించాను కాని నిన్న అతడి దగ్గర్నుండి 'తన పెళ్లికి తప్పక రమ్మని' ఆహ్వానం వచ్చింది. నా ఆశలు అణగారి పోయాయి. లోకం దృష్టిలో కడుపులో దినదిన ప్రవర్ధమానమవుతున్న శిశువుకి తల్లిని నేను. తండ్రి అతడంటే లోకం విశ్వసించదు ఈ పరిస్థితిలో లోకంనుండి నిష్క్రమించడంకన్న వేరే గత్యంతరంలేదు బావకు తీరని అన్యాయం జరిగిపోయింది నావల్ల మన వంశానికి తీరని కళంకాన్ని ప్రసాదించి వెళ్ళిపోతున్నాను నీకు కూతురు పుట్టలేదనుకో. ఈనాటినుండీ బావే నీ సర్వస్వమూ.

నీ

అమ్మడు"

మోహనరావుకు కళ్లు చీకట్లు క్రమ్మాయి. శరీరం వశం తప్పింది

"వసంతా " ఒక్క గావుకేకపెట్టాడు మోహనరావు.

మృత్యువు వెంటాడుతున్నప్పుడు నిరాశతో, నిర్జీవంగా మానవుడు వేసేకేక అది రంగి గంగాలు మావతో సరసాలాడుతూ బావిలో చేదవేసి, నీళ్లే తోడడానికి తలదించి, తృళ్ళిపడి చేద వదిలింది.

వసంత కదిలింది ఆమె ముఖంలో చిరునవ్వు చిందులు త్రొక్కుతోంది. అది జీవంలేని చిరునవ్వు!!!

★

## 30-4-1965 శుక్రవారం మొదలు 6-5-1965 గురువారం వరకు.

**మేషం :** వృత్తి వ్యాపారాల్లో మీరు ఇదివరకు ప్రారంభించిన వ్యవహారాలను ఇప్పుడు పూర్తి చేయగలరు వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో ఇదివరకు ఏర్పడిన అవరోధాలు తొలగిపోతాయి వృత్తిలో అనుకూల వార్తలను వింటారు ఆర్థిక వ్యవహారాలు బాగానేఉన్నా, రావలసిన డబ్బుమీద ఆధారపడి నూతన వ్యవహారాలకు పూనుకోవడం తగదు వారాంతంలో సాహసముతో కూడిన వ్యవహారాలు కొంచెం లాభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం వారం మధ్యనుంచి బాగా ఉంటుంది. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది పుణ్యకార్యాలు చేస్తారు

**వృషభం :** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు కలగడంవలన, తరువాత కొంత అభివృద్ధి సాధించినా ఈ వారం అంత సంతృప్తికరంగా ఉండదు మీరు స్వంతంగాచేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి వృత్తిలో మీ శ్రమకు తగిన ప్రతిఫలం లభిస్తుంది ఉద్యోగంలో ముఖ్యమైన వ్యవహారాలు మీరు స్వయంగా చూడడం మంచిది రావలసిన డబ్బు సమయానికి అందుతుంది ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది ఇంజనీర్లకు యోగవంతమైన సమయం

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు కొద్ది మార్పులతో నెరవేరుతాయి వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు

**మిథునం :** మీరు ప్రయత్నించిన వ్యవహారాలకు ఆటంకాలు రావడం, అనుకోని వ్యవహారాలు నెరవేరడం వంటి సంఘటనలు జరుగుతాయి కాని మొత్తం మీద ఈ వారం ఆదాయం బాగానే ఉంటుంది భారీఎత్తునచేసే వ్యాపారాలు వాయిదా వేయడం మంచిది. వారం ప్రారంభంలో సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా కొంతవరకు లాభిస్తాయి ఉద్యోగంలో వారం మధ్యలో కొద్ది చికాకులు వస్తాయి కోర్టు వ్యవహారాల్లో ప్రతికక్షులు బలహీనపడే సంఘటనలు జరుగుతాయి ఆరోగ్యం బాగానే ఉంటుంది

స్త్రీలకు—ఆరోగ్యం బాగానేఉన్నా, కొంచెం బలహీనత కన్పిస్తుంది విలాస వస్తువులు కొంటారు నూతన విషయాలను తెల్సుకొంటారు

**కర్కాటకం :** వృత్తి వ్యాపారాలు ఈవారంలో ప్రోత్సాహకరంగానే ఉంటాయికాని వారాంతంలో కొద్ది చికాకులు ఏర్పడవచ్చును వ్యాపారంలో మీ అభిప్రాయాలకు తగిన అవకాశాలు లభిస్తాయి. వృత్తిలో నూతన మార్గాల ద్వారా ఆదాయం పెరుగుతుంది ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో ఇదివరకు ఏర్పడిన చికాకులు చాలవరకు తొలగిపోతాయి సాంఘిక కార్యక్రమాల్లో కొంతమంది అనూయాపరులు నిందా ప్రచారానికి పూనుకొనేల సూచనలు ఉన్నాయి.

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| చం బు | ర శు | గు రా | |
| శ | వారఫలం | | |
| | మహేష్ | | కు |
| | కే | | |

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు సంతృప్తికరంగా ఉంటాయి సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది

**సింహం .** గ్రహబలం బాగా ఉంది వృత్తి వ్యాపారాల్లో మీ ఆలోచనలు సరియైనవని రుజువు కావడం వలన ఆదాయంతోపాటు సాటివారిలో అంతస్తు కూడా పెరుగుతుంది అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు కొంచెం శ్రమమీద నెరవేరుతాయి వ్యాపారం భారీ ఎత్తున చేయడంవలన ఆర్థికంగా ఒత్తిడి రావచ్చును ఉద్యోగంలో మీ మంచితనంవల్ల అనవసరమైన బాధ్యతలను వహించవలసి వస్తుంది రాజకీయ వ్యవహారాల్లో నూతనోద్యమాలు అనుకూలంగా ఉంటాయి ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం

స్త్రీలకు—ఆరోగ్యం ఇదివరకటికంటే బాగా ఉంటుంది బంధు మిత్రులను కల్సుకొంటారు. సంతానానికి కించిదనారోగ్యం చేస్తుంది

**కన్య :** వృత్తి వ్యాపారాల్లో ఏ వ్యవహారాన్నీ పూర్తిగా నెరవేరేవరకు నమ్మడానికి అవకాశంలేదు. వారం ప్రారంభంలో ఆకస్మికంగా కొన్ని చికాకులు ఏర్పడి వారాంతానికి సర్దుకొంటాయి మీరు కొన్ని అనవసరమైన వ్యవహారాల్లో చిక్కుకొనడంవల్ల ప్రయోజనకరమైన వ్యవహారాల్లో శ్రద్ధ చూపించలేని పరిస్థితి ఏర్పడుతుంది వృత్తి రీత్యా చేసే ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి మిత్రులతో కలసి వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది సాటివారితో భేదాభిప్రాయాలు రావచ్చును అలంకార వస్తువులు కొంటారు

**తుల :** ఈవారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలకంటే మీరు స్వంతంగాచేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి వారాంతంలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో ఇతరుల జోక్యంవల్ల నష్టం రావచ్చును. నూతన వ్యవహారాలు ఆశించినంత బాగా ఉండవు వృత్తిలో కొత్తవారి పోటీని ఎదుర్కొని విజయాన్ని సాధించగలరు కోర్టు వ్యవహారాలు ఇదివరకటికంటే బాగా ఉన్నా, పూర్తిగా అనుకూలత లభించదు మిత్రులకు సకాలంలో సహాయం చేయగలరు.

### ఈవారం ధరలు

ఆపరాల ధరలు నిలకడగా ఉండి వారాంతానికి కొంచెం తగ్గుతాయి. బెల్లం ధరలో ఒడుదుడుకులు వస్తాయి పసుపుధర మందంగా ఉంటుంది నూనె, నువ్వుల ధరలు క్రమంగా పెరుగుతాయి. బట్టల ధరలు కొంచెం తగ్గవచ్చును.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది శుభమూలంగా వ్యయం జరుగుతుంది.

**వృశ్చికం :** ప్రతి వ్యవహారము మీరు ఆదర్శప్రాయంగా నెరవేర్చడానికి ప్రయత్నించడంవలన అనవసరమైన వ్యయ ప్రయాసలకు గురికాగలరు వృత్తి వ్యాపారాలు వారం ప్రారంభంలో బాగానే ఉన్నా, వారాంతానికి చికాకులు ఏర్పడడంవలన మీరు ఈవారం సాధించినది ఏమీ ఉండకపోవచ్చును వృత్తిలో మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి ఉద్యోగంలో కార్యభారం పెరిగినా, మీ కృషిని అధికారులు గుర్తించగలరు ఆరోగ్యం బాగా ఉంటుంది సాటివారిలో నూతన గౌరవాన్ని పొందగలరు

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. సంఘ సేవికలకు మంచి సమయం

**ధనుస్సు :** వృత్తి వ్యాపారాలు లాభదాయకంగానే ఉన్నా, మీకు అంతగా ఇష్టంకాని వ్యక్తులతో సన్నిహితంగా ప్రవర్తించవలసిన అవసరం అప్పుడప్పుడు ఏర్పడడంవలన ఈవారం అంత సంతృప్తికరంగా ఉండదు వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ఇదివరకటికంటే అనుకూలంగా ఉంటాయి వృత్తి రీత్యా ప్రయాణంచేసి కార్యసాధన చేయగలరు ఉద్యోగంలో మీ పరిస్థితి బాగానే ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది రాజకీయ వ్యవహారాల్లో నూతనోద్యమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం ప్రస్తుతం బాగానే ఉన్నా నిర్లక్ష్యం చేయరాదు శుభ కార్యాల విషయంలో కొంచెం అభివృద్ధిని సాధించగలరు

**మకరం :** మీరు ఘన విజయాల్ని ఏమీ సాధించలేకపోయినా, అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా జరిగిపోవడంవలన ఈవారం సంతృప్తికరంగానే ఉంటుంది భారీ ఎత్తున చేసే వ్యాపారాల్లో అనుకూల వార్తలను వింటారు వృత్తిలో మీకు ముమ్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి బంధువుల వ్యవహారాల్లో కొత్త సమస్యలు తలయెత్తడంవలన ఆందోళన కలుగుతుంది ఆరోగ్యం బాగా ఉంటుంది సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు సంతృప్తికరంగా ఉంటాయి వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. బంధు మిత్రులను కలుసుకొంటారు.

**కుంభం :** ఆర్థిక వ్యవహారాల్లోకంటే ఆరోగ్య విషయంలో శ్రద్ధ వహించడం అవసరం వృత్తి వ్యాపారాల్లో మీరు ఇదివరకు ఎంత ప్రయత్నం చేసినా నెరవేరని వ్యవహారాలు ఇప్పుడు సానుకూల పడుతాయి వ్యాపారంలో లాభదాయకమైన మార్పులు వస్తాయి అధికారులవలన జరగవలసిన వ్యవహారాల్లో అనుకూల వార్తలను వింటారు కోర్టు వ్యవహారాల్లో ప్రతికక్షులు బలహీనపడే సంఘటనలు జరుగుతాయి వారాంతంలో సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా కొంతవరకు లాభిస్తాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది సాహిత్య కళారంగాల్లో అభివృద్ధిని సాధించగలరు.

# వారఫలం

సంతానానికి శుభ్య సంతోషాలు లభిస్తాయి.

**మీనం :** ఈవారం గతవారంకంటే బాగా ఉన్నా విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశం లేదు. వృత్తి వ్యాపారాల్లో చాలా శ్రమమీద స్వల్పాభివృద్ధిని సాధించగలరు. వ్యాపారంలో మీ తాలూకు వస్తువులు పోయే సూచనలు ఉన్నాయి. వృత్తిలో మీరు ఇదివరకు కొన్ని వ్యవహారాలను నిర్లక్ష్యం చేయడంవలన మీరు ఇప్పుడు పొందవలసినంత లాభాన్ని పొందలేని పరిస్థితి ఏర్పడుతుంది ఉద్యోగంలో ముఖ్యమైన వ్యవహారాలు మీరు స్వయంగా చూడడం మంచిది ఆరోగ్యం బాగానే ఉంటుంది

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు బాగా ఉంటాయి ప్రయాణాలు వాయిదా పడతాయి. దైవకార్యాలు నిరాటంకంగా నెరవేరుతాయి ★

# జన్మదినఫలం

## ఏప్రిల్-30

ఈ సంవత్సరం గడచిన సంవత్సరంకంటే అనుకూలంగా ఉంటుంది మీరు ఇదివరకు ఎంత ప్రయత్నం చేసినా, నెరవేరని వ్యవహారాలు ఇప్పుడు ఫలిస్తాయి భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలకంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి సంవత్సరం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభిస్తాయి వృత్తిరీత్యా దూర ప్రయాణాలుచేసి కార్యసాధన చేయగలరు ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి ఆరోగ్యం బాగానే ఉంటుంది కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది బంధువుల వ్యవహారాల్లో మీరు ఎంత శ్రమపడి కృషి చేసినా నిష్కారం తప్పదు విద్యార్థులకు సెప్టెంబరు పరీక్షలు అనుకూలంగా ఉంటాయి

## మే-1

ఆదాయం మామూలుగానే ఉన్నా, అన్ని వ్యవహారాలు మీరు అనుకొన్నట్లుగా జరగడంవలన ఈ సంవత్సరం సంతృప్తికరంగానే ఉంటుంది వృత్తి వ్యాపారాల్లో మీ కంటే పెద్దలు కూడా మీ సహాయాన్ని అపేక్షించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది భారీ ఎత్తున చేసే వ్యాపారాలు ప్రారంభంలో సామాన్యంగా ఉన్నా, రాను రాను లాభదాయకంగా ఉంటాయి వృత్తిలో మిత్రులతో భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది కోర్టు వ్యవహారాల్లో అనవసరమైన వ్యయ ప్రయాసలకు గురి కాగలరు ఆరోగ్యం ఇదివరకటికంటే బాగా ఉంటుంది. బంధువర్గంలో ఇతోధిక గౌరవాన్ని పొందగలరు విలాస యాత్రలు చేస్తారు విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కావచ్చును.

## మే-2

మీ ఆలోచనలు మీ స్వంత పనుల్లోకంటే ఇతరులకు సలహా రూపంలో బాగా ఉపకరిస్తాయి. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభించవచ్చును. వృత్తిలో మీరు అనవసరమైన సందేహాలకు గురి కావడంవలన చేజిక్కిన అవకాశాలను కూడా కోల్పోయే ప్రమాదం ఉంది ఉద్యోగంలో స్థాన చలనము కలగవచ్చును కాని మారబోయే స్థానం కూడా అనుకూలంగానే ఉంటుంది సంవత్సరంలో మొదటి భాగంకంటే రెండవభాగం చాలా బాగుంటుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయతగదు కుటుంబ కార్యక్రమాలు సంతృప్తికరంగా ఉంటాయి శుభకార్యాల విషయంలో మీ ఆలోచనలు ఫలిస్తాయి. విద్యార్థులకు ఏప్రిల్ పరీక్షలు బాగా ఉంటాయి

## మే-3

జీవితంలో ఇటువంటి సమయాలు చాలా అరుదుగా వస్తాయి ఇంతవరకు కేవలం ఆశయాలుగా మీ ఊహాపథంలోవున్న విషయాలు ఇప్పుడు కార్యరూపాన్ని ధరిస్తాయి వృత్తి వ్యాపారాల్లో మీ అంచనాలకంటే అధికంగా వ్యయం జరగవచ్చును కాని ప్రతిఫలం కూడా దానికి తగినట్టుగానే ఉంటుంది. మీకు అంతగా ఇష్టం లేకపోయినా, కొన్ని వ్యవహారాల్లో మధ్యవర్తిత్వంవంటి పాత్రను నిర్వహించవలసి వస్తుంది ఉద్యోగంలో ఉన్నత స్థానంకోసం మీరు జరిపే ప్రయత్నాల్లో అధికారులతోడ్పాటు లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో బాధ్యతతో కూడిన పదవిని నిర్వహించగలరు ఆరోగ్యం బాగా ఉంటుంది. అనేకానేక వస్తువులు కొంటారు పుణ్యకార్యాలు చేస్తారు. విద్యార్థులకు క్లాసు రాగల సూచనలు ఉన్నాయి.

## మే-4

వృత్తి వ్యాపారాల్లో మీకు విశేష ప్రాబల్యం గల వ్యక్తుల అండదండలు లభించడంవలన ఈ సంవత్సరం మీరు తగినంత అభివృద్ధిని సాధించగలరు. నూతన వ్యాపారాలు అంత అనుకూలంగా ఉండకపోవచ్చును. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు కొంచెం శ్రమమీద నెరవేరి లాభిస్తాయి వృత్తిలో కొత్తవారి పోటీని ఎదుర్కోవలసి వస్తుంది. ఉద్యోగంలో అధికారులు మీపట్ల అనుకూలంగానే ఉంటారుకాని సాటివారితో భేదాభిప్రాయాలు రావచ్చును. మొగమాటాలకు లొంగిపోయి డబ్బుకు సంబంధించిన వాగ్దానాలు చేయడం మంచిదికాదు ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు బాగానే ఉంటాయి విద్యార్థులకు ఏప్రిల్ పరీక్షలు బాగా ఉంటాయి. రాజకీయ నాయకులకు మంచి సమయం.

## మే-5

ఈ సంవత్సరం అంత బాగా ఉంటుందని ఆశించడానికి అవకాశంలేదు. వ్యాపారంలో అప్పుడప్పుడు అవస్థమీది, అనుభవం మరొకరిది కాగల పరిస్థితి ఏర్పడవచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది వృత్తిలో కొంతమంది వ్యక్తులు మీకు ఆశలు చూపించి మోసం చేయడానికి ప్రయత్నం చేస్తారు ఉద్యోగంలో మీరు ఎంత మంచిగా ప్రవర్తించినా అది ఇతరులకు చెడుగానే కన్పిస్తుంది ప్రయాణాల్లో మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలబలం పెరగడంవలన మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. అప్పుడప్పుడు స్వల్ప అనారోగ్యం చేస్తుంది ఆడంబరంకోసం వ్యయం చేస్తారు విద్యార్థులు మొదటి నుంచీ శ్రద్ధగా చదవడం మంచిది.

## మే-6

ఈ సంవత్సరం అప్పుడప్పుడు కొద్ది చికాకులు వచ్చినా, మొత్తంమీద వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో ప్రయోజనంకంటే ప్రయాస అధికంగా ఉంటుంది సంవత్సరం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి వృత్తిరీత్యా దూర ప్రయాణాలు చేస్తారు సమయానికి ఏదో ఒకవిధంగా డబ్బు అందుతుండడం వలన అన్ని వ్యవహారాలు నిరాటంకంగా నెరవేరుతాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి బాగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాల్లో ఎవరితోను వాద ప్రతివాదాలకు దిగడం మంచిదికాదు సంతానానికి కించిదనారోగ్యం చేయవచ్చును కుటుంబ వ్యవహారాలు బాగానే ఉంటాయి. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు. ★



# మీ చిట్టి తండ్రికి




## జాన్సన్స్* బేబీ ఆయిల్

**పాపాయికి రోజూ ఒళ్లు నలుగుకు నూనె**

కల్తీ లేని, బాగుగా శుద్ధీకరింపబడిన వైట్ ఆయిల్ మరియు లనోలిన్ మిశ్రముచేసి జాన్సన్స్ బేబీ ఆయిల్ తయారైనది. ఇది పాపాయికి చికాకు లేకుండా చేస్తుంది మరియు హాయిని కలిగిస్తుంది. నీళ్లు పోసేముందు పాపాయికి ఎల్లప్పుడూ జాన్సన్స్ బేబీ ఆయిల్‌ను ఒంటికి రాయండి. ఇది కండరములను పుష్టిగా చేయుటలో మరియు ఒళ్లంతా మన్నగా ఉంచుటలో సహాయపడుతుంది. దీనిని తలకు రాస్తే చుండ్రుపట్టదు మరియు తలమీది చర్మము పొరలుతేలకుండా ఉంటుంది. జాన్సన్స్ బేబీ ఆయిల్ పాపాయియొక్క మృదువైన చర్మమునకు వేడి, గాలి యొక్క చెడ్డ పరిణామములనుండి రక్షణ కలిగిస్తుంది.




## జాన్సన్స్* బేబీ షాంపూ

**దీనితో కళ్లు మండనే మండవు**

జాన్సన్స్ బేబీ షాంపూతో పాపాయికి నీళ్లు పోయునపుడు మామూలు సబ్బులు షాంపూలు వాడునపుడువలె కళ్లు మండవు! జాన్సన్స్ బేబీ షాంపూతో జుట్టు మెత్తగా, తేలికైన సువాసనతో ముచ్చట గొలుపుతూ ఉంటుంది.

## ఉచితము!

ఇక్కడ పేర్కొన్న మూడు జాన్సన్స్ తయారుదలలో ఏ రెండిటినైనా కొని దుకాణదారుని రసీదుతో ఇక్కడ చూపబడిన కూపనును జతచేసి, జాన్సన్ అండ్ జాన్సన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, 30 ఫోర్జెట్ స్ట్రీట్, బొంబాయి 26 ఎడ్రసుకు పంపండి. దానికి బదులుగా మీకు ఉపయోగించే ఒక బహుమానము ఉచితముగా పంపబడుతుంది. ఈ అవకాశము 15 వ మే 1965 వరకు మాత్రమే ఉంది.

-------------- జాన్సన్స్ బహుమానపు అవకాశము --------------

పేరు: శ్రీ / శ్రీమతి ____________________

ఎడ్రసు: ____________________

____________________




## జాన్సన్స్* బేబీ లోషన్

**చర్మమునకు అసౌఖ్యము కలగనీయదు**

జాన్సన్స్ బేబీ లోషను చర్మమునకు హాయి నిస్తుంది మరియు ఇది సౌమ్యమైన అంటిసెప్టిక్ గుణమును కలిగిఉంది. ఇది పాపాయి చర్మమును పొరలు కట్టనీయదు మరియు బట్టల వలన అసౌఖ్యమును కలగనీయదు. ఈ లోషనును చర్మము ముడతలుపడే చోట్ల ప్రత్యేకముగా రాయండి. ఎందుకంటె, అటువంటి చోట్ల చర్మము ఎఱ్ఱగా అయి అసౌఖ్యము కలుగుటకు ఎక్కువ అవకాశము లున్నాయి. జాన్సన్స్ బేబీ లోషను చర్మమును ఆరోగ్యవంతముగా ఉంచుతుంది. ఎందుకంటె, చర్మముయొక్క సూక్ష్మ రంధ్రములు మూసుకొని పోకుండా ఉండేలా ఒక పల్చని రక్షక పొరను ఏర్పరుస్తుంది.

**జాన్సన్ అండ్ జాన్సన్**
ఆఫ్ ఇండియా లిమిటెడ్
30, ఫోర్జెట్ స్ట్రీట్, బొంబాయి-26

* ట్రేడ్ మార్క్స్

# అపస్వరం



మూలం త్రివేణి
అనువాదం శర్వాణి

### జ రి గి న క థ

పసితనంలోనే కన్నవారికి దూరమైన మీర, పెదనాన్న కృష్ణయ్యగారింట్లో పెరిగి పెద్దదవుతుంది డాక్టర్ చదవాలని కలలు కంటుంది కానీ ఆ కలలు ఫలించకుండా శాముతో మీర వివాహం జరిగిపోతుంది మనస్సులోని డాక్టరవాలన్న కోర్కె తను యింటర్ ఫస్ట్ క్లాసులో పాసయిందని తెలియగానే బలవత్తరమౌతుంది ఆ కోర్కెను భర్తతో చెప్పినా ఫలితం లేనందున గతాన్ని కొంత మరవచ్చుననే వూహతో పల్లె స్త్రీలకు విద్యాబోధన చేయాలని సంకల్పిస్తుంది కానీ, అదీ నెలరోజులైనా సరిగా నడవక మూలపడుతుంది. మీరను చూడ్డానికొచ్చిన స్నేహితురాళ్లు పల్లె వాతావరణానికి మురిసిపోతారు. పిల్లలంటే తనకున్న అయిష్టాన్ని తెలియబరుస్తుంది మీర కాని పాప పుట్టిన తర్వాత తనకు తెలియకుండానే మాతృసహజమైన వాత్సల్యం ఏర్పడుతుంది వాడిపోయిన శాము, మీరల అనురాగలత వీణ మూలంగా తిరిగి కొత్త చిగుళ్లు తొడుగుతుంది పొద్దుగడవని పల్లె జీవితం ఇప్పుడు క్షణం తీరని విధంగా తయారవుతుంది మీరకు ఆనందాబ్ధిలో ఓలలాడించిన వీణ ఓనాడు అకాలమృత్యువుకి ఆహుతవుతుంది

## 16

మీర తలుపు తెరచింది ఇద్దరూ ఒకరి మొహాలొకరు చూసుకోగానే తలవంచుకున్నారు.

"భోంచేద్దువుగాని పద మీరా"

"నాకాకలి వెయ్యడంలేదు"

"భోంచేసి రెండురోజు లయింతటు."

" .......... "

"ఉపవాసాలుచేసి నువ్వు నన్ను వదిలిపోతావా? ఉపవాసాలు చేసినంతమాత్రాన పాప తిరిగివస్తుందా? నువ్వు కూడా ఇలా ప్రాణాలు పోగొట్టుకోకు మీరా"

"నేనెలాఉంటే మీకేం?"

శాము ఓర్పుతో ఆమెను ఓదార్చటానికి ప్రయత్నించిన కొద్దీ మీర పిచ్చిదానిలా ప్రవర్తించసాగింది శాము బెంగాలుతో అక్కడినుండి వెళ్ళిపోయాడు.

మీరకు ఇంటా బయటా ఎక్కడెక్కడా వీణ జ్ఞాపకాలే బాధించేవి. కూతురి ఆటపాటలూ, అల్లరి, చిలిపితనం, అంతా అంతా ఆమె మనసులో చిరస్మరణీయంగా నిలిచి అవి ముల్లులా ఆమెను బాధించివేస్తోంది.

ఓరోజు భోజనానికి కూర్చున్నపుడు వెంకమ్మగారు బంగాళాదుంపల సాంబారు వడ్డించారు మీర చెవిలో వీణ క్షీణకంఠం వినిపించింది

"అమ్మా నేనూ బంగాళాదుంపల సాంబారు తింటాను" మీర కంచం దూరంగానెట్టి వేరే కంచం తెచ్చుకుని మజ్జిగన్నం కలిపి అదీ తినలేక కన్నీరు కారుస్తూ లేచి వెళ్ళిపోయింది

అయిదేళ్లు ఆమె జీవితాన్ని నందనవనంలా చేసి, ఆమె కటి ఆకాంక్షల నన్నిటినీ మరిపించి సంసారంలో సుఖముందని నమ్మించి, ఆ నమ్మకం దృఢం కాక మునుపే ఆమె జీవితాన్ని అగాధమయిన చీకటిలో ముంచి వెళ్ళిపోయింది వీణ

బొచ్చుకుక్క, కోడి, ఏనుగు బొమ్మలు మూలలో నుండి తొంగి చూసి "మా వీణెక్కడ?" అని అడుగుతున్నట్లనిపించింది. వీణ పరికిణీ, స్వెట్టరు, పైజామా, బనీను అన్నీ ఆమె కంటబడి తూలాల్లా పొడిచేవి తల్లిని కోల్పోయిన అనాథ శిశువుల్లా, వీణలేని, వీణ వస్తువులు అక్కడక్కడా పడి ఏడుస్తున్నాయి కన్నెత్తితే గోడలమీది వీణ ఫోటోలు, "నే నిక్కడే ఉన్నానుసుమీ, నానుండి తప్పించుకోలేవు నువ్వు" అంటున్నట్టుండేవి కళ్ళు మూస్తే వీణ నవ్వు మొహం ఎదుటకువచ్చి నిలచేది కూతురి జ్ఞాపకాలను మాటి మాటికి రెచ్చగొడుతున్న ఆ ఇల్లు, పల్లె, భర్త వీటన్నిటినుండీ దూరంగా పారిపోవాలనిపించే దామెకు ఆహారం చుట్టూ మూగిన చీమల్లాగా తన్ను చుట్టు ముట్టి వేధిస్తున్న జ్ఞాపకాలనుండి తప్పించుకోవడానికోసం తనకు అత్యంత ప్రియమయిన పుస్తకాల ఆసరా పొందాలని చూసింది మీర కాని ప్రతీ పేజీలో, ప్రతీ అక్షరంలో వీణ ముద్దు మొహమే కన్పించేది. అసహాయురాలై సుడిగుండంలో చిక్కుకున్న నావలా తల్లడిల్లింది మీర

పశువుల పాకలో దూడకు గడ్డి తినిపిస్తోంది మీర. అకస్మాత్తుగా రెండునెల్లక్రితం వీణ ఆ దూడతో ఆడుకుంటున్న దృశ్యం గుర్తుకొచ్చింది ఇక ఒక్క నిమిషం కూడా అక్కడ నిలవలేక వంటింట్లోకి వెళ్ళింది. వెంకమ్మగారు వీణ వెండికంచం కత్తిపీట ముందుంచుకుని దోసకాయలు తరుగుతున్నారు మీర లోపలికి రాగానే ఆమెకు కనిపించింది కూతురికంచం. ముళ్లమీద అడుగు పెట్టిన దానిలా బయటికి వచ్చింది. హాల్లో స్టాండుమీద వీణ గులాబి రంగు స్వెటర్ కనిపించింది "ఏం పాపం చేసుకున్నానని నాకీ శిక్ష" అనుకుంటూ గదిలోకివెళ్ళి మంచంమీద కూలబడింది నెలరోజులక్రితం తన ముద్దుల కూతురు, అదేచోట అదేమంచంమీద ఆఖరి శ్వాస తీసిన దృశ్యం కళ్ళముందు నిలిచింది తన మనసులోంచి ఆ దృశ్యాన్ని తొలగించినకొద్దీ అదే దృశ్యం కళ్ళముందు మెదలసాగింది. పలసలా కాగే మానెలా మరిగిపోతోందామె మనసు. కాళ్ళీడ్చుకుంటూవచ్చి వరాండాలో బెంచిమీద కూర్చుంది. బల్లకింద కాలికేదో తగిలినట్లయితే వంగిచూసింది. వీణ బూడ్సులు దుమ్ము తెరకింద పడి ఉన్నాయి. భక్తుల కళ్ళకు ఎక్కడెక్కడా సర్వ వ్యాపితుడయిన భగవంతుడే కనిపించినట్టు, బిడ్డను కోల్పోయిన తల్లి కళ్ళకు ఎక్కడెక్కడా కూతురి ప్రతిరూపమే కనిపిస్తోంది ఆమె కళ్ళలో ఉగ్రుతమయిన కోపపు ఛాయ మెరిసి క్రమేణా ఉన్మాదంగా మారిపోయింది.

మీర మూల మూలలా వెతికి వీణ వస్తువుల నన్నిటినీ పోగు చెయ్యసాగింది పాత వస్తువులన్నీ ఉన్న గదిలోనుండి పెరాంబులేటర్ లాక్కొచ్చింది ఇక వీణ ఆటవస్తువులూ, గుడ్డలు, పుస్తకాలు గోడమీదున్న ఫోటోలు అన్నీ ఒకచోట కుప్పగా పేర్చింది, పెట్టె తెరచి సిల్కు లంగాలు, నెక్లెస్, కమలాల తొలక్కులుతెచ్చి కుప్పమీద పడేసింది ఇంకా ఎక్కడయినా వీణ వస్తువు లున్నాయేమోనని పెద వివి వంటితో నొక్కిపట్టి వెతుకుతున్న మీరను చూసి గాబరా పడ్డారు వెంకమ్మగారు దోసముక్కలు తరిగి ఉంచుకున్న వీణ కంచాన్ని తెచ్చి కుప్పమీద పడెయ్యగానే వెంకమ్మగారు పెరటి తలుపు తెరచి బోరణ్ణి పిలచి,

"బోరా, శామణ్ణ ఎక్కడున్నాడో చూసి తీసుకురా మీర ఏదో పిచ్చి పిచ్చిగా చేసేస్తోందని చెప్పు" అన్నారు

బోరడు జాలితో" అయ్యగోరికి మాత్రం బుద్ధి సరిగ్గా ఉందా? చూత్తున్నాగా ఎటోబోతారు ఎక్కడో కూకుంటారు వందమార్లు పిలిసినా పలకరు" అన్నాడు

"నిజమే శామణ్ణకు సగం పిచ్చయితే మీరకు పూరా పిచ్చిపట్టింది త్వరగా శామణ్ణను తీసుకురా"

బోరడు పరిగెత్తుకుంటూ వెళ్ళాడు ఎక్కడెక్కడో వెతికి శామును తీసుకొచ్చాడు మీర తనలోనే గొణుక్కుంటూ వీణ వస్తువులకోసం వెతుకుతోంది

"వీణదంటూ ఒక్క వస్తువు కూడా ఇక్కడుండకూడదు. వీణే లేనప్పుడు దాని వస్తువులెందుకుండాలి? అన్నిటినీ కాల్చి పారేస్తాను" అంటూ తనలో తానే గొణుక్కుంటోంది

పిచ్చిగా తిరుగుతున్న మీర మొహంలోని దుఃఖోన్మాదాల రుద్రనాట్యాన్ని చూసి దిగులు పట్టుకుంది శాముకు.

వీణ పోయినప్పటినుండి తెగిపోయిన గొలుసులా దూరమయా రిద్దరూ

మీర అగ్గిపెట్టెకోసం వెతకబోగానే శాము ఆమె దగ్గరకొచ్చి మృదువుగా

"మీరా ఏం చేస్తున్నావ్?" అన్నాడు

"వీణ వస్తువులన్నీ కాల్చిపారేస్తాను"

"ఎందుకూ?"

"దాని వస్తువులు ఇక్కడెందుకుండాలి?"

"వద్దుమీరా నీ మనస్సు బాగాలేదు కాస్త నిద్రపోదువుగాని పద"

"ఊహూ " అంటూ అగ్గిపుల్ల వెలిగించింది మీర శాము దాన్ని లాక్కుని దూరంగాపారేసి అగ్గిపెట్టెను కూడా లాక్కున్నాడు

"ఇచ్చేయండి అగ్గిపెట్టిచ్చేయండి నాకు. నా దగ్గరికి రాకండి. నా ఖర్మం వచ్చినట్టు చేసు

అంటూ మీకేం?" అని అరుస్తూ శామును దూరంగా తోసేసింది మీర. శాము ఆమె భుజాలు పట్టుకుని కుదుపుతూ

"తెలివి తెచ్చుకో మీరా, కాస్సేపు నిద్రపో" అంటూ ఆమె వద్దంటున్నా వినకుండా బలవంతంగా తీసికెళ్ళి పక్కమీద పడుకోబెట్టి దగ్గరే కూర్చున్నాడు.

"మీరంతా నా శత్రువులు. మీ వల్లనే నా జీవితం నాశనమయింది" అని వెక్కి వెక్కి ఏడవసాగింది. కన్నీటితో తలగడ తడిసి ముద్దయింది పక్కపెట్టి ఏడ్చి అలసిపోయిన చంటిపిల్లలా ఉంది మీర ఇంతకు మునుపొకమారు ఇలాగే ఏడ్చి నిద్రపోయిన నాని గుర్తుకొచ్చింది శాముకు చనిపోయిన ముద్దుల కూతురి మొహాన్నే గుర్తుకు తెస్తున్న మీర మొహాన్ని అరచేత్తో మృదువుగా

చెయ్యలేక, ఉక్రోషంతో చిక్కుకుని కళ్ళనిండా దుమ్ము కొట్టుకున్న బాటసారిలా దిక్కూ తెన్నూ తెలియక అల్లమటించిపోయింది.

వీణ చనిపోయి రెండు నెలలు గడిచిపోయాయి ఒకరోజు శాము గిత్తలకు నీరు తాగిస్తూ నిలుచున్నాడు. మీర అతడిని వెతుక్కుంటూ వచ్చింది.

చెదరిన జుత్తు, కృశించిన దేహం, మనసులోని వ్యథను స్పష్టంగా కనిపింప చేస్తున్న కళ్ళు .... శాముకు మీరను చూసి జాలివేసింది. "అయ్యో పాపం!" అనుకున్నాడు.

"మీకో విషయంచెప్పాలి. ఏమీ అనుకోరుగదూ?"

శాము మీరవైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"మనం ఈ పల్లె వదిలి వెళ్ళిపోదాం"

ఇద్దరం ఆత్మహత్య చేసుకుందామన్నా శాముకు ఇంత ఆశ్చర్యం కలిగేదికాదు.

"నీ కోర్కెను తీర్చలేను మీరా. ఎన్నో తరాలుగా మావూర్వీకులు నివసించిన ఇంటిని, వంశ పారంపర్యంగా వస్తున్న భూములను వదిలి రాలేను నేను. వాటితో పెనవేసుకున్న నా జీవితాన్ని తెంపుకోలేను. ఈ నేలలోనే నాని విశ్రమించింది. ఎప్పటికయినా ఆ నేలలోనే చిరవిశ్రాంతి తీసుకోవటానికయినా నే నిక్కడ ఉండకతప్పదు."

శాము కంఠంలో దృఢ నిశ్చయం ధ్వనించింది.

ఉప్పెనలా పొంగివస్తున్న మహా ప్రవాహంలో ఈతరానివాడు ఎదురీత ఈదటానికి ప్రయత్నించి, ప్రవాహంతోబాటు కొట్టుకుపోయినట్టుగా ముంచుకొస్తున్న దుఃఖాన్ని ఆపుకోటానికి ప్రయత్నించి, ప్రయత్నించి విఫలురాలయింది మీర.

వీణ పుట్టినప్పటినుండి తనకు నచ్చని పల్లె



నిమిరి నుదుటిమీద చిన్నగా ముద్దెట్టుకుని చప్పుడు చెయ్యకుండా బయటికి వచ్చాడు

తరువాత ఇంకెన్నడూ వీణ వస్తువులు ఆమె కంటబడలేదు రోజు రోజుకూ ఆమెకు జీవితం దుర్భరమనిపించసాగింది. కాళ్ళకు కట్టిన రాయి ఈతరానివాడిని సముద్రంలోపలికి లాగివేసినట్టే, వీణ స్మృతి మీరను దుఃఖ సముద్రంలోకి లాగసాగింది అడుగడుక్కీ వీణను గుర్తుకుతెచ్చే ప్రవేశం, సన్నివేశాలు ఆమె మెదడును తినివేస్తున్నాయి వీణను మర్చిపోవటానికి, వీణలేని జీవితాన్ని గడపటానికి విశ్వప్రయత్నం చేసింది మీర కాని ఆమె మనసులోని అశాంతి ఎక్కువయిందేగాని తగ్గలేదు మరే వ్యాపకమూ లేకపోవటం మూలాన అస్తమానం గడిచిన రోజుల స్మృతులనే నెమరువెయ్యటం అలవాటయింది. మీర తమన్న సన్నివేశంతో ఏమీ

"నేను పల్లెలోనే ఉండిపోతే ఏమయిపోతానో చెప్పలేను చనిపోవచ్చు. పిచ్చిపట్టవచ్చు లేదా ఇల్లు వదిలి పోవచ్చు. నా కోరికను కాదనకండి క్షణ క్షణానికి వీణస్మృతి నన్ను దగ్ధం చేస్తోంది నామీద దయయుంచి రండి"

"పైమారికి వెడితే నువ్వు నానిని మర్చిపోగలవా?"

"ఈ పల్లెలో ఉండగా వీణను మరవటం అసంభవం. ఈ పల్లెలోని మట్టిలో కలిసిపోయింది వీణ ఇక్కడున్నంతవరకూ వీణను మరవలేను నా బిడ్డను మింగిన ఈ పల్లె అంటే నాకు ద్వేషం కొత్తచోటు, కొత్త వాతావరణంలో నా మనసులోని బాధ, దాని వేడి కొంతవరకయినా చల్లబడవచ్చు ఇంతవరకూ మిమ్మల్నేమీ కోరలేదు ఈ కోర్కెను కాదనకండి"

శాము నెమ్మదిగా తల అడ్డంగా వూపాడు.

టూరి వాతావరణాన్ని కూడా ఆనందమయం చేసుకుని జీవితంలో నూతనోత్సాహంపొంది గాలిమేడలు కడుతున్న మీరకు, వీణ చనిపోగానే ఇంకా పల్లెలో ఉండాల్సిన అవసరం కనిపించలేదు పల్లె జీవితానికి భర్తకు, మీరను, అతుక్కుపోయేలా చేసిన ఒకే ఒక కొక్కెం వీణ వూడి పడిపోగానే వీణతోబాటే తన జీవితానికి ముడిపడివున్న మిగిలిన బంధాలను కూడా త్రెంచుకుని ఎందుకు వెళ్ళిపోరాదని ఆలోచించసాగింది మీర భర్తను వదిలిపెట్టిందన్న అపఖ్యాతి తప్పదని తెలిసినా చనిపోయిన బిడ్డ జ్ఞాపకాల తోరణాలతో అనుదినమూ జీవించలేక వ్యధాభారాన్ని భరించలేక, ఉడికిపోతున్న హృదయపు భారాన్ని మొయ్యలేక ఇక ఎప్పటికీ తన కడుపు పండదన్న శూన్యతను ఎదురించలేక పల్లెను వదిలిపెట్టాలన్న నిర్ణయానికి వచ్చింది మీర.

[illegible] గడచి పోతున్నాయి. వేసంగి సెలవులు పూర్తవటానికింకా రెండు వారాలు మాత్రమే ఉన్నాయి మీర హృదయం లోని ఆవేదన, ఆందోళనలకు మితి లేకుండాపోయింది. వారం రోజులుగా శాము మీరలోని పోరాట చిన్న వాలను గమనిస్తూనే ఉన్నాడు రెండు భావాల మధ్య జరుగుతున్న ఘర్షణ ఆమె మొహంలో స్పష్టంగా కనిపిస్తూనే ఉంది.

ఓరోజురాత్రి పడుకునేముందు మీర శాముతో మాట్లాడాలని నిశ్చయించుకుంది ఆమె మొహంలో నిర్ధారం కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది శాము దీపవు వత్తి తగ్గించి మీర దగ్గర కూర్చుని,

"పడుకోవా మీరా?" అన్నాడు.

"నిద్ర రావటంలేదు... మరేమో ."

"ఏమిటో చెప్పు?"

"మీరు నన్ను చేతకాని పిరికిపంద అన్నా ఫరవా లేదు నన్ను అవ్యమానం పీక్కుతింటున్న ఈ జ్ఞాప కాలనుండి తప్పించుకోవాలంటే ఈ పల్లె వదిలి వెళ్ళక తప్పదు. ఇక రెండోది . నా మనసుకు, మెదడుకు ఒక్క నిముషమయినా విశ్రాంతి ఇవ్వ కుండా వేరే వ్యాపకం పెంచుకోవాలి. ఈ రెండూ చెయ్యక తప్పదు నేను "

"అయితే నన్ను వదిలిపెడతావా ?"

"మీకు నేను కావాలంటే మీరూ పల్లె వదిలి రావలసి వస్తుంది మీరు దానికి ఒప్పుకోరని నాకు తెలుసు "

"మీ అసహాయత నాకు తెలియని విషయం కాదు మనిద్దరి మనసులనూ దగ్గరకు తెచ్చిన బాబి ఇక లేడన్నప్పుడు వారి తెగి విడిపోయిన విల్లు కొసల్లాగా మనిద్దరం దూరమయ్యాం ఒకరి కోసం ఒకరు జాలిపడడం తప్ప మరేమీ చెయ్య కుండా ఉన్నాం. కాని పోయిన దుఃఖాన్ని మరి పించటానికి ఇంకో బిడ్డయినా ఉండిఉంటే ...!"

"బిడ్డ ! ఇక ఈ జన్మకా ఆశ లేదు నాకు ఈ పిపిష్ట జీవితానికి, దుఃఖాన్ని మరిపించే, నవ్వించే పాపాయి కూడా లేదు."

శాము తన విషయంలో చూపిస్తున్నసానుభూతికి అర్థమయిపోయింది మీర. మొదట్లో మీర బాగా ప్రవర్తించింది, కావాలనుకున్నప్పుడు లాలించి, విసుక్కున్నప్పుడు వదిలివేసే భర్త ఇలా మాట్లాడ టానికి పూనుకుంది చాలు.

మీర ప్రేమబలంతో ఇద్దరి మనసులనూ మొత్త బడిన ఒకటిగా చేసింది. అప్పుడప్పుడు, ఒక్క సారి విడిపోస్తే వేరయిపోయే ఇసుకరేణువుల్లా మీర, శాము దూరంగా ఉన్నా, దైహిక ఆకర్షణలకు లోనయి దగ్గరయినా, వెంటనే అభిప్రాయ భేదాలతో దూరమయ్యేవారు కాని బాబి పుట్టాక పెరిగింది ప్రేమతో ఇద్దరిలోనూ ఆత్మీయత పెరగ సాగింది. అందమయిన ఇంటిని నిర్మించి దానికి ఆధారస్తంభంగా నిలచింది బాబి ఎప్పుడయితే ఆ ఆధారస్తంభం కూలిపోయిందో అప్పుడే ఇల్లూ

# అపస్వరం

కూలిపోయింది కూలిపోయిన ఇంటిని మళ్ళీ కట్టడం ఇసుకలో ఇల్లుకట్టడం లాంటిదే.

"అయితే ఎక్కడికి వెడదామనుకుంటున్నావ్ ?"

"మైసూరికి వెళ్ళి మెడికల్ కాలేజీలో చేరుదా మనుకుంటున్నా చదువులో పడి వీలయినంతవరకూ గత స్మృతులను మరచగలనేమో అనేదే ఆశ "

శాము మసకవెలుతుర్లో తనముందు కూర్చున్న చిక్కి శల్యమయిన మీరవే తదేకంగా చూడ సాగాడు లోతుకు పోయిన బుగ్గలు, పాలిపోయిన మొహం కడుపులోని దుఃఖాన్నంతా ప్రతిబిం బించే కళ్ళు, నల్లటి జుత్తులో అక్కడక్కడా వెండిలా మెరుస్తున్న తెల్ల వెంట్రుకలు ... దైన్యమే మూర్తీభవించినట్టున్నది మీర శాము హృదయం వ్యథాభరితమైంది జాలితో అతడి హృదయం నీరయింది ఆమెను అక్కున చేర్చు కుని ఓదడిగిపా ఇచ్చేయాలన్న కోర్కె కలిగింది కాని, ఆమెను దగ్గరకు తీసుకునే ధైర్యం కలగ లేదు.

"అలా చేస్తే నీ బాధ ఉపశమిస్తుందా మీరా?"

"ఏమండీ అయ్యరుగారూ! మీ హోటల్‌లో కాఫీ మరీ ఇంత పలచగా చేస్తున్నారెందుకండీ ?

అయ్యరు : మీలాంటి వారు మా కాఫీ నిషాకు తట్టుకో లేక ఎక్కడైనా పడిపోతారని.

చారి (విజయనగరము)

"అలాగే అనుకుంటున్నా."

"మరే మార్గమూ లేదా ?"

"నా కింకేం తోచటంలేదు."

శాము కాస్సేపు మౌనంగా కూర్చున్నాడు.

తను కోరి పెళ్ళాడిన మీర తనను వదిలి వెళ్ళిపో బోతుందని తల్చుకోగానే హృదయం కంపించింది మీరలేని జీవితం శూన్య మనిపించింది మీర నిర్ణ యాన్ని తల్చుకుని కోపం కలిగింది. తను ఏం చేశాడని తనకీ శిక్ష ? ఆమెను ప్రేమిస్తున్నం దుకా ? శాము మనసులో ముల్లు గుచ్చుకున్న ట్టయింది తను ఆమెను ప్రేమించాడా ? కామించాడా ? మొత్తంమీద మీర అతడికి కావల సిన వస్తువు. మీరలాంటి అందమూ, తెలివీ గల అమ్మాయిని భార్యగా పొందినందుకు అత నెంతో సంతోషించాడు వెంకట్రమణయ్యగారు తమ బంగారంలాంటి జమీని తక్కువ ఖరీదుకు అమ్మినప్పుడు కలిగినలాంటి సంతోషం—మీర తనకు కావలసిన వస్తువు. కనుక ఆమె కోర్కె తీర్చటం అసంభవం అనుకున్నాడు

కాని, మరుక్షణంలోనే ప్రాణప్రదమయిన బిడ్డను పోగొట్టుకుని, అనాథలా, పిచ్చిదానిలా పరితపిస్తున్న తన ప్రేతిపాత్రురాలైన భార్య అ

[illegible] పాపం ! కాలేజీలో చదివే రోజుల్లో ఎన్ని కలలు కందో తన భవిష్యత్తును గురించి ! ఇప్పుడు పాప చావుతో క్రుంగిపోయి, దిక్కుతోచక బాధతో విలవిలలాడిపోతూ దైన్యమూర్తిలా ఉన్న తన ముద్దుల భార్యను పల్లెలో ఉండమని నిర్బంధించి జీవచ్ఛవంగా మార్చటానికి ఇష్టపడలేదు శాము.

స్వార్థానికీ, త్యాగానికీ పోరాటం జరిగింది

"మీరా, మైసూరులో మీ పెదనాన్న ఇంట్లో ఉంటం నా కిష్టంలేదు అయన ఎప్పుడైతే నిన్ను నా చేతుల్లో పెట్టారో అపుడే ఆయన బాధ్యత కూడా తీరిపోయింది నువ్వు హాస్టల్లో ఉంటేనే మంచిది. ఏమంటావ్ ?"

"నిజమే. కాని, డబ్బో .... ?"

"నే నున్నాగా—డబ్బు గురించి ఆలోచించకు" తెల్లగా పాలిపోయిన మీర మొహంలోకి, దేహం లోకి ఒక్కసారిగా రక్తం ప్రవహించినట్టయింది. తనంతట తాను భర్తను వదిలి వెళుతున్నా, తన చదువుకు సిద్ధపడుతున్న భర్త హృదయమైశాల్యం ఆమెలోని కోమల భావనలను పైకి లేపింది. ఆమె కళ్ళు చెమర్చాయి.

"నన్ను కాకుండా మరో అమ్మాయిని చేసు కున్నా మీరు సుఖపడేవారు నాలాంటి అతృప్త స్వభావపు పిల్లను కట్టుకున్నందువల్ల మీ జీవితం ఇలా అయింది."

"అలా అనకు మీరా నా జీవితంతోబాటు నీ జీవితం కూడా ముక్కచెక్కలయింది పెళ్ళయి నప్పటినుండి నా కనిపిస్తూనే ఉంది నిన్ను పెళ్ళి చేసుకుని పొరపాటుని చేశానని కుశాగ్రమయిన నీ బుద్ధిని ఎందుకూ పనికిరాకుండా బంధించి నేరం చేశాననిపించేది నాకు. సారవంతమయిన భూమిని పాడుపెడితే గవర్నమెంటేం చేస్తుందో తెలుసా ? అలా చేసినవాడికి జుల్మానా విధిస్తుంది. నేను ఇస్తున్న జుల్మానా అని నా డబ్బు స్వీక రించు. నా అపారమయిన సంపదనుండి నీకు లేశ మాత్రమయినా సంతోషం కలిగితే అంతకన్నా నాకు కావలసిందేమీ లేదు....."

మీర మౌనంగా మోకాలిమీద తల ఆన్చి భర్త మాటలనే వింటోంది ఆ మసక వెలుతురులో ఆమె మొహంలోని భావాలు స్పష్టంగా కనిపించటం లేదు

తనవల్లే భర్త జీవితం నాశనమయిందన్న భావన కలిగిం దామెకు ఒకరినొకరు చేపట్టడంవల్ల ఇద్దరి జీవితాలూ వ్యర్థమయిపోయాయి సామరస్యంలేని సంసారం ఇద్దర్నీ బలితీసుకుంది.

"కాని ఒక్కమాట గుర్తుంచుకో మీరా"

మీర తలెత్తి శామునైపు చూసింది

శాము నిట్టూర్చి అన్నాడు

"నా జాలి మొహాన్ని గుర్తుకుతెచ్చే నీ మొహం అంటే నాకు చాలా యిష్టం"

ఒక్క నిమిషం ఆగి మళ్ళీ అన్నాడు

"నువ్వు కోరుకుంటున్న జీవితం నీకు విసుగని పిస్తే నీ ఇంటి తలుపులు నీకోసం ఎప్పుడూ తెరిచే ఉంటాయి"

అయిపోయింది ★




# వైజ్ఞానిక గాథాశతి

## 16

### డాక్టర్

లైడెన్ సీసాని విద్యుదావేశితము చేసి, కత్తెర దవడలు రెండింటితోనూ పైపొరా, లోపలి పొరా తాకబోతే చటాలున మెరుపు మెరుస్తుంది. తప్‌మని చప్పుడు వినబడుతుంది కూడాను (కత్తెర రింగులకు రబ్బరు పొరలు కప్పాలి లేక పోతే బలమైన షాక్ కొట్టుతుంది) దీన్ని గమనించినవారికి ఆకాశంలోని మెరుపూ, కరకర శబ్దమూ జ్ఞప్తికి వస్తాయి "అదీ ఇదీ ఒకటేనా ?" అన్న ప్రశ్న కలుగుతుంది సోదా చూడడానికి సాహసించిన వైజ్ఞానికుడు బెంజమిన్ ఫ్రాంక్లిన్

విద్యుదావేశాన్ని లోహపు సూదులు హరిస్తాయని ఫ్రాంక్లిను కనుక్కున్నాడు. ధన విద్యుదావేశితమైన గాజుసీసా తిరుగుతోందనుకొండి దాని చేరువని లోహపు దువ్వెన అమరిస్తే దీని మొనలో ఋణ విద్యుత్తు ఎగిరి సీసా విద్యుత్తును తటస్థము (Neutral) చేస్తుంది. ఏతావాతా దువ్వెనకు ధన విద్యుత్తు మిగులుతుంది అంటే దువ్వెన సీసా విద్యుత్తును హరించిందన్నమాటే కదా ? ఈ పద్ధతిలో ఆకాశములో మబ్బులలోని విద్యుత్తును తేవచ్చునని వూహించాడు ఫ్రాంక్లిను.

ఫ్రాంక్లినుకి పరిశోధనశాలలోని మెరుపులూ, ఆకాశంలోని మెరుపులూ ఒకే స్వభావము గలిగినవా అని సందేహము కలిగింది అది తీర్చుకోవాలంటే ఆకాశములోని విద్యుత్తుని భూమిమీదికి తేవాలి పిల్లలు ఎగురవేసే గాలిపటము మబ్బుదాకా ఎగరగలదు ఫ్రాంక్లిను చిరిగిపోయే కాగితముతో కాక సిల్కుగుడ్డతో చేశాడు గాలిపటాన్ని గాలిపటపు నిలువుబద్దీకి పైపైపు తిన్నని లోహపు తీగె అమర్చాడు ఆ తీగె మబ్బుయొక్క విద్యుత్తుని లాగుతుందనీ ఆ విద్యుత్తు దారము వెంబడిని దిగివస్తుందనీ అతని ఆశ అక్కరలేని అల్లరి ఎందుకని ఎవరికీ చెప్పలేదు. వానమబ్బు సమీపిస్తోంది చూచి కొడుకుని కూడా తీసుకువెళ్ళి గాలిపటము ఎగుర వేయించాడు చేతిలోని దారపు కొనకి ఒక సాదాగాటి సిల్కు ముక్క కట్టేడు, దాని రెండో కొసని తామున్న కుటీర స్తంభానికి కట్టేడు. ఒక వేళ ఆకాశ విద్యుత్తు గాలిపటపు దారము వెంట దిగివచ్చినా సిల్కు విద్యుద్వాహకము కాకపోవడము వల్ల, సిల్కుముక్క మొదటి కొస దాకానే వస్తుందని, అక్కడ ఒక తాళముచెవిని కూడా కట్టి, "ఆ తాళము చెవి కొన దగ్గరకు వేళ్ళ కణుపుల వెనుక భాగాన్ని తీసుకువెళ్ళితే—పరిశోధనశాలలో విద్యుదావేశిత లోహగోళము దగ్గరకు వేలి కణుపును తీసుకువెళ్ళినప్పుడు వలెనే మెరుపు కొట్టుతుంది" అని ఫ్రాంక్లిను వూహ ఎన్నిమారులు ఇలా సోదా చూసినా, మెరుపు కొట్టలేదు ఇంతలో చినుకులు పడి, గాలిపటపు దారము తడిసి విద్యుద్వాహకమైనది మేఘాల విద్యుత్తు దారమువెంట రావడముతో దారానికి చుట్టూ నూగులాగున్న పోగులు విద్యుదావేశితములై ఒకదాన్ని ఒకటి వికర్షించి నిక్కబొడిచినట్లు నిలబడ్డాయి. అది చూచి ఫ్రాంక్లిను తాళముచెవి దగ్గర వేలి కణుపు పెట్టాడు చరుక్కున మెరుపు తగిలింది. దిగివచ్చిందన్నమాట మేఘ విద్యుచ్ఛక్తి ! ఆ తాళముచెవి కొనకి గాజు కడ్డీని తీసుకువెళ్ళి దాన్ని విద్యుదావేశితము చేశాడు సామాన్యంగా పరిశోధనశాలలో చేసే వికర్షక ప్రయోగాలు చేశాడు లైడెన్ సీసాలో మేఘ విద్యుత్తు నింపేడు దాని మెరుపుతో సారా దీపము వెలిగించాడు రంగుల్ని వెలిపెట్టు చేయించాడు మేఘ విద్యుత్తూ భూమి మీది ఘర్షణ విద్యుత్తూ ఒక్కటే అని నిరూపించాడు మేఘ విద్యుత్తు నీటి ఆవిరి పైకి లేచేటప్పుడు గాలి రాపిడివల్ల విద్యుదావేశితమైన మబ్బు విద్యుత్తు, పరిమాణానే పెద్ద.

మెరుపూ, పిడుగూ మెరుపులు మాత్రమే అని తెలిసింది పిడుగు భూమికీ మేఘానికీ నడాని మెరిసిన మెరుపు గాలిపటానికి పైన బిగించిన తీగద్వారా భూమికి దిగివచ్చే ఎత్తయిన భవనాలూ గోపురాలూ మీద బిగించిన లోహపుకడ్డీ నుంచి కూడా విద్యుత్తు దిగుతుందని వూహించి ఫ్రాంక్లిను తన పరిశోధనశాలమీద లోహపుకడ్డీ బిగించాడు. అందువల్ల వానమబ్బు నుంచి పిడుగుగా కాక ప్రవాహముగా విద్యుత్తు దిగిపోయి భవనాన్ని పిడుగు దెబ్బనుండి రక్షించడము జరిగింది. ఫ్రాన్సులో కూడా ఫ్రాంక్లిను ప్రయోగమూ, భవనాలమీద పిడుగు తీగెలు అమర్చడమూ, చేశారు

మేఘ విద్యుత్తుని దింపి, ప్రయోగాలు చెయ్య యత్నించిన సార్విలేయను ఎట్లాని మెరుపుకొట్టి —అనగా పిడుగుపడి— చచ్చిపోయాడు మేఘ విద్యుత్తుచేత— అనగా పిడుగుచేత— ఉపయోగకరమైన పని చేయించే యత్నము ఎవరూ చేసినట్టు లేదు. గొప్ప ఉష్ణోగ్రత పుట్టుతుంది క్షణకాలంలో దీనికి తోడు ఒత్తిడి కూడా కలిగించగలిగితే—వజ్రాల తయారీ సాధ్యమవుతుందా ? ★

# సాయంకాలం ఫలహారాలు

## గోధుమ గవ్వలు

అరవీశె గోధుమపిండి, పావు వీశె మంచినూనె కాస్త జీలకర్ర, పొడి కారము, నేతిగిన్నెడు నెయ్యి, కొద్దిగా ఉప్పు.

ముందుగా కాచిన నీళ్లలో సరిపడ్డ ఉప్పువేసి కరగనివ్వాలి. తర్వాత గోధుమపిండిని బాగా జల్లించి పళ్లెములో పోసి గిన్నెడు నెయ్యి కరగబెట్టి పిండిలో పోసి కరిగించిన ఉప్పు నీళ్ళ పిండి పోసి పూరీల పిండిలాగ గట్టిగా కలిపి ఒక గంట నాననివ్వాలి ఇంట్లో గవ్వలు చేసే బల్ల ఉంటే సరి లేకపోతే పాత తుంగచాప ఉంటే దానిలో ఉంచి ఒక అరడుగు పొడవు, వెడల్పుగల ముక్క కత్తిరించి దుమ్ములేకుండా కడిగి శుభ్రంగా ఆర నివ్వాలి. తర్వాత కాస్త నూనె రాస్తూ కలిపి ఉంచిన గోధుమ ముద్దలోంచి కుంకుడు గింజంత ముద్దచేసి చేతి బొటనవ్రేలితో పట్టుకుని చాప మీద పామాలి. వ్రేలి వెంబడే రౌండుగా చుట్టు కుంటుంది. తీసి విడిగా పెట్టాలి. ఈవిధంగా పిండి అంతా చేసి విడిగా పెట్టాలి పొయ్యిమీద బాణలి పెట్టి నూనె వేసి కాగిన తర్వాత గవ్వలు కొద్దికొద్దిగా వేసి తొరగా వేగగానే చిల్లుల గరిటతో తీసెయ్యాలి అన్నీ వండిన తర్వాత, కాస్త పొడి కారము, జీలకర్ర పొడివేసి గవ్వలన్నీ నాలుగు వైపులా కలిపి అయిదు నిమిషాలు ఉంచి, చల్లారినాక డబ్బాలో పోసి మూత పెట్టేటట్లయితే ఇరవై రోజుల వరకు బాగుంటాయి.

## సజ్జవడలు

కావలసిన సామానులు :—

2 శేర్లు సజ్జలు

5 పలాల పచ్చిమిర్చి

తగినంత ఉప్పు

సజ్జలు రాళ్ళు, మట్టిపెళ్లలు ఏమీ లేకుండా శుభ్రం చేయాలి. అవి రోటిలో పోసి తేలికగా దంచాలి. దంచిన వాటిని చేటలో పోసి చెరిగితే పొట్టు అంతా పోతుంది తెల్లని గుడ్డ పరచి, తిరగలి వేసి, ఈ సజ్జలని మెత్తగా విసురుకోవాలి. ఈ విసిరిన పిండిలో తగుమాత్రపు ఉప్పు వేసి, తగినంత నీరుపోసి గట్టిగా ఉండేటట్లు ఒక పాత్రలో తడిపి పెట్టాలి పది నిముషాలు అయిన పిదప ఈ పిండిని రోటిలో వేసి బాగా దంచాలి. గట్టిగా ముద్దలా వస్తుంది. పచ్చిమిర్చి సన్నగా తరిగి ఈ పిండిలో కలపాలి.

బాణలి పొయ్యిమీద పెట్టి డాల్డాగాని, నూనె గాని పోసి బాగా కాగనిచ్చి పిండిని నిమ్మకాయంత ఉండ చేసుకుని చేతితో వడమాదిరిగా చేసి బాణ లిలో వెయ్యాలి రెండు ప్రక్కల ఎర్రగా వేగాక తీసి పళ్లెములో పెట్టుకోవాలి కారం ఎక్కువ కావలసినవారు కాసిన్ని పచ్చిమిర్చి ఎక్కువ వేసుకో వచ్చును.

## బీరకాయ బజ్జీలు

కావలసిన సామానులు :—

శనగపిండి ½ వీశ.

బీరకాయలు 4. పెద్దవి కాక, చిన్నవికాక సమానంగా ఉండాలి

డాల్డా ½ సోను.

కొద్దిగ అల్లం, జీలకర్ర, గసగసాలు, పచ్చి మిర్చి 15.

బీరకాయపైన చెక్కుతీసి పల్చగా చక్రాల మాదిరి తరుగుకోవాలి. ముందుగా గసగసాలు రోట్లో కొద్దిగా నూరి, తరువాత అల్లం, జీల కర్ర, పచ్చిమిర్చి, తగినంత ఉప్పు అన్నీ వేసి, మెత్తగా నీళ్లుపోసి నూరాలి. నూరిన ముద్దను స్టీల్ గిన్నెలోకి తీసుకోవాలి. ఒక వెడల్పాటి గిన్నెలో శనగపిండి వేసి, చిటికెడు సోడా వేసి నూరి ఉంచుకున్న ముద్దను కూడా వేసి బజ్జీల పిండి మాదిరిగా కలుపుకోవాలి.

పొయ్యిమీద బాణలిమూకుడు ఉంచి, డాల్డా పోసి కాగేక బీరకాయముక్కలు పిండిలో ముంచి డాల్డాలో వేయాలి ఎర్రగా వేగాక ఒక పళ్ళెంను లోకి తీసుకోవాలి ఇవి వేడిమీద తింటే చాలా రుచిగా ఉంటాయి వంకాయ బజ్జీలు కూడా యిట్లాగే వండుకోవచ్చు.

## చక్లి

ఇవి జంతికల మాదిరి మొరమొర లాడుతూ చాలా రుచిగా ఉంటాయి మహారాష్ట్రులు తరుచు వీటిని సర్వే చేస్తుంటారు.

1 కప్పు పెసరపప్పు, 1 కప్పు శనగపప్పు, 1 కప్పు బియ్యం, కొంచెం మినపప్పు, కొంచెం గోధుమలు, కొంచెం ధనియాలు, జీలకర్ర, ఉప్పు, కారంగుండ, 3 కప్పుల నూనె లేక డాల్డా, కొంచెం నువ్వులు ఈ పప్పులు, ధనియాలు, జీల కర్ర, బియ్యం, గోధుమలు వేరువేరుగా కొంచెంగా సన్నని సెగమీద వేయించాలి తర్వాత తిరగట్లో వేసి మెత్తగా విసురుకుని, నువ్వుపప్పు, కారం, ఉప్పు, కొంచెం మరుగుతున్న నూనె వేసి కలిపి జంతికల గొట్టంతో పువ్వుమాదిరి మరో రకం బిళ్ల ఉంటుంది దానితో మరుగుతున్న నూనెలో పిండి వేయించుకుంటే కాస్త వలయంగా కోన్ షేప్సులో బాగా వస్తాయి ఎన్నాళ్లయినా ఉంటాయి. ఇది పిల్లలు చాలా ఆప్యాయంగా తింటారు. జంతికల కంటె ఎక్కువ రుచిగా ఉంటాయి

## మైసూర్ బోండా

కావలసిన సామానులు —

బంగాళదుంపలు అరవీశె.

శనగపిండి సవాశేరు

మంచినూనె సవాశేరు.

బియ్యంపిండి 1 గిద్ద

తగినంత పోపు సామాను, పచ్చి మిర్చి, అల్లం, కరివేపాకు.

బంగాళదుంపలు మెత్తగా ఉడికించి నీళ్లన్నీ వార్చి పై పొట్టు తీసి దుంపలు మెత్తగా అయేలా చేత్తో చిదిపి ఓ పక్క ఉంచాలి తగినన్ని మిర్చి, అల్లం సన్నగా తరిగి మరో పక్క ఉంచుకోవాలి. నిప్పుమీద కూరగిన్నె ఉంచి దానిలో తగిన నూనె వేసి కాగిన తర్వాత శెనగపప్పు, మినపప్పు, జీడి పప్పు, మెంతులు, ఆవాలు, జీలకర్ర, ఇంగువ వేసి వేగిన తర్వాత, పచ్చిమిర్చి, అల్లం ముక్కలు, కరివేపాకు వేసి ఉప్మా పోపులా చేసి బంగాళదుంప కూర పోపులో వేసి, తగినంత ఉప్పు వేసి కలియ బెట్టి నిప్పు సెగను రెండు నిముషములుంచి దించి చల్లారేక చిన్న నిమ్మకాయంత ఉండలుచేసి అన్నీ స్టీలు పళ్లెంలో సిద్ధం చేసుకోవాలి ఈ కూరలో ఇష్టమైనవారు తగినంత నిమ్మరసం కూడా వాడుకోవచ్చు. సెనగపిండి, బియ్యంపిండి శుభ్ర ముగా జల్లించి తగినంత ఉప్పూ, కారం వేసి మన బజ్జీల పిండి మాదిరి నీళ్లతో కలపాలి బాణలిలో నూనె పోసి బాగా కాగిన తర్వాత బంగాళదుంప ఉండ ఈ బజ్జీ పిండిలో ముంచి నూనెలో బాణలి పట్టినన్ని వేస్తూ రెండు ప్రక్కలా బాగా వేయించి తీసి, వేరే స్టీల్ పాత్రలో ఉంచాలి ఇవి ఆరోజుకి మాత్రమే బాగుంటాయి మరునాటికి నిల్వ ఉండవు.

—వి. భూమాదేవి. ★



# మతిచలించిన మతాచార్యుడు

## నార్మన్ రోథామ్

"కుటిల వర్తనుడన్న నిందమోపి అతన్ని కోర్టు కీడ్చగానే భౌతికంగా తప్ప మిగిలిన అన్నివిధాలా అతను మరణించాడనే చెప్పవచ్చు ఈ అభియోగం అతనిపై తీవ్రమైన దెబ్బతీసింది దేశాన్నంతటినీ సంచలనపూరితం కావించిన ఆ కోర్టు దృశ్యాలు పదే పదే గుర్తుకువచ్చి అతని మానసిక ప్రవృత్తిపై కనపడని గాయాన్ని చేసినయి అసలు నన్ను తప్ప వేరెవ్వర్నీ పట్టించుకోలేదతను" అంటూ శ్రీమతి ఇవ్‌లిన్ వేక్‌ఫోర్డ్ తన భర్తని బర్మింగ్ (కెంట్) మెంటల్ హాస్పిటల్‌కి తీసికెళ్లగానే బావురుమన్నది

ఆర్చెడియాకన్ వేక్‌ఫోర్డ్ పదుగురిలో పేరెన్నికగన్న మతబోధకుడు అంతేగాకుండా మత విషయాల నెన్నింటినో గ్రంథరూపంలో రచించిన గ్రంథకర్త అదీగాక లింకన్ కాథెడ్రల్‌లో మతాచార్యుడు ఇలాంటి సదాచార పరాయణుడు 1920 లో పీటర్‌బర్గ్‌లోని బుల్ హొటల్‌లో రెండు రోజులు వరుసంతో ఉన్న అందమైన వో అమ్మాయితో ప్రేమకలాపాలను జరిపాడన్న నింద నారోపించడం జరిగింది

ఫిబ్రవరి, 1921 లో మతసంబంధమైన న్యాయస్థానం ఈ పుకార్లను ఆరా తీయటానికి నిశ్చయించింది సదాచార పరాయణత్వమనే ముసుగులో దాగిన ఆర్చెడియాకన్ ఆ అమ్మాయితో హొటల్‌లో గడిపినట్లు సాక్ష్యాలు కొల్లలుగా ఉన్నయ్ రెండుసార్లు అతనా హొటల్‌కి వచ్చి 'డబుల్‌రూం' తీసుకొన్నాడనీ, రెండుసార్లూ అదే అమ్మాయితో వచ్చాడని బుల్ హొటల్ మేనేజర్ చెప్పాడు తానే వాళ్లకి భోజనం వడ్డించాననీ, అంతేగాకుండా వాళ్ల గదిలోని పడకలపై నైట్ గౌన్లు, పైజామాలు పడి ఉండటం గమనించాననీ సాక్ష్యం యిచ్చింది హొటల్ మేనేజర్ భార్య పనికత్తె సాక్ష్యం చెప్తూ తనే వాళ్లిద్దర్నీ పైకి తీసికెళ్లి నిప్పు రాజేసి చలి కాచుకునేందు కేర్పాటు చేశానని చెప్పింది

ఆ హొటల్ రిజిష్టర్‌లో 'జె వేక్‌ఫోర్డ్— అతని భార్య' అని ఉంది

ఆ దస్తూరి తనదే కానీ 'అతని భార్య' అన్నది మాత్రం కావాలని ఎవరో చేర్చిందని ఆర్చెడియాకన్ వాదన. కోర్టుకి అంతుబట్టని ఆ యువతి ఎవరు ? పీటర్‌బర్గ్ కాథెడ్రల్ చుట్టూ ఆ అమ్మాయి తిరుగుతుండగా ఆర్చెడియాకన్ ఆమెను కలుసుకున్నాడని తెల్సుకున్నారు

"నే నామెను చర్చి నడుమభాగంలో చూశాను ఆమె నాకు పూర్తిగా కొత్త మతవిషయాల్ని గురించి అడిగింది తర్వాత చర్చిలోని వాద్య బృందం వైపు చూస్తూ నిల్చుంది" అని చెప్పాడు ఆర్చెడియాకన్.

హొటల్ విషయం అడిగినప్పుడు "నే నక్కడికి ఒంటరిగానే వెళ్లాను. ఏకాంతంగానే గడిపాను గానీ ప్రక్కనే కాంత లేదు" అని సమాధానం చెప్పాడు

"మరందులో నీ వొక్కడివే గడిపితే హొటల్ రిజిష్టర్‌లో యిద్దరికీ భోజనాలూ వగైరా లెక్క కట్టి ఉన్నయ్యే, దానికేమి సమాధానం చెప్తావు ? ఆ రిజిష్టర్‌లో నీవు యిద్దరికీ కలిపి 4 పౌన్లు, 1షిల్లింగ్, 6 పెన్నీలు చెల్లించినట్లుంది గదా ?" అనడిగారు

"నేను రెండు పౌన్లు, రెండు షిల్లింగులకన్నా ఎక్కువ ఏ పరిస్థితిలోనూ చెల్లించలేదు" అని చెప్పాడు ఆర్చెడియాకన్ దృఢంగా

ఈ సాక్ష్యాలన్నింటినీ పరిశీలించి కోర్టువారు ఆర్చెడియాకన్ దోషి అని నిర్ణయించారు.

కోర్టువారు ఆవిధంగా తమ తీర్పు నిచ్చినప్పటికీ ఆర్చెడియాకన్ నిరపరాధన్న, నిజాన్ని వేలమంది ప్రజలు నమ్మారు వారందరూ చందాలు వేసుకుని 3,000 పౌన్లు సేకరించి ప్రివీ కౌన్సిల్‌కి అపీల్ చేయించారు

అక్కడి న్యాయవిచారణ సంఘం ఈ అభియోగాన్ని గూర్చి ఏడు రోజులపాటు చర్చించింది

తనపై ఉన్న కక్షకొద్దీ యిద్దరు మతాచార్యులు ఈ నిందని తనపై మోపారని, అందులో ఒకతను తన బావమరదేనని చెప్పాడు ఆర్చెడియాకన్

"ఈ నిందని గూర్చి మీరు మీ చెల్లెలితో చెప్పారా ?" అని ప్రశ్నించాడు ఆర్చెడియాకన్ తరఫున మాట్లాడుతూ సర్ ఎడ్వర్డ్ కార్సన్

"చెప్పాను" సమాధానం చెప్పాడు ఆర్చెడియాకన్

"అతన్ని వదిలేయమని మీరామెకు సలహా యిచ్చారా ?"

"ఇచ్చాను"

ఆర్చెడియాకన్ బావమరదికోసం ఇంకొక మతాచార్యుడు బుల్ హొటల్‌నుంచి లెక్కల్ని తీసుకొచ్చాడన్న విషయాన్ని కూడా బయటపెట్టాడు అంతేగాకుండా వో డిటెక్టివ్‌ని అతని సహాయార్థం పంపాడన్న సంగతి కూడా బయటపడింది

న్యాయాధికారి లార్డ్ బర్కెన్‌హెడ్ తన సందేహాన్ని వివరిస్తూ—సాక్ష్యాలూ, హొటల్‌కి సంబంధించిన ఉద్యోగులూ ఆర్చెడియాకన్‌తో వ్యక్తిగతంగా ఏ సంబంధమూ లేనివాళ్ళు అందువల్ల వాళ్లు చెప్పింది అబద్ధమనీ, లంచం తీసుకున్నారనే విషయాలు నమ్మటానికి వీల్లేదన్నాడు

విచారణ సంఘం ఆర్చెడియాకన్ దోషని నిర్ణయించింది

అందువల్ల ఆర్చెడియాకన్ పవిత్రతకు చిహ్నమైన వస్త్రధారణకేమాత్రం భంగం కలగకపోయినా దాన్ని అంతటితో వదిలిపెట్టదల్చుకోలేదు తన నిర్దోషిత్వాన్ని చాటే ఉపన్యాసాలిస్తూ పర్యటనలు చేయటం మొదలెట్టాడు ఈ రకమైన ప్రచారానికి సంబంధించిన వో చలనచిత్రంలో అతను తన భార్యతోబాటు పాల్గొన్నాడు. ఆ చిత్రం పేరు "విచిత్రమైన వేక్‌ఫోర్డ్ విచారణ."

దీని కంతటికీ మూలకారణమైన ఆ అజ్ఞాత అతివ ఎవరో మాత్రం అంతు దొరకలేదు. ఆమె ఎవరో తెల్సుకోడానికి చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థమయిపోయినయి. చర్చినుంచి తనను బయటి కీడ్చటానికి జరిగిన కుట్ర అని వాపోయాడు ఆర్చెడియాకన్.

అక్కడ్నుంచి శ్రీమతి వేక్‌ఫోర్డ్ ఉదంతం మొదలయింది ఆమె దాన్ని "ఏడు సంవత్సరాల నరకం" గా వర్ణించింది అది 1930 లో ఆమె భర్త చనిపోవటానికి ముందు.

కొన్ని సంవత్సరాలు ఆమె లండన్‌లో "సెల్పు ఉమన్" గా పనిచేసింది. ఆమె భర్త మనః ప్రవృత్తి దెబ్బతినగానే అతనికి సేవచేయటానికి ఉద్యోగం మానేసి యింటివద్ద ఉండాల్సి వచ్చింది

ఆర్చెడియాకన్ వేక్‌ఫోర్డ్ అర్ధరాత్రి లేచి అదే ప్రాతఃకాలమని క్షవరం చేసుకోవటం ప్రారంభించేవాడు తమ కుటీరం నుంచి ఉన్నట్లుండి పర్వతాలవైపు వెళ్లిపోయేవాడు— తానేదో పెద్ద విజయయాత్రకి వెళ్తున్నట్లుగా భావిస్తూ ఏళ్ల క్రిందట చనిపోయినవారి పేర ఎన్నో ఉత్తరాలు వ్రాస్తుండేవాడు తనలో తాను పెద్దగా మాట్లాడుతున్న అతన్ని బజార్లో చూసిన బడిపిల్లలు భయపడి పారిపోయేవారు

క్రమక్రమంగా తన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని కూడా గమనించలేని అంత్యస్థితికి వచ్చాడు ఆర్చెడియాకన్

ఇదిలా ఉండగా శ్రీమతి వేక్‌ఫోర్డ్ దారిద్ర్యంతో కృంగిపోసాగింది ఆర్థిక అవసరాల్ని తట్టుకొనే నిమిత్తం మొదట్లో నూలు వడకటం, తర్వాత పిల్లుల్ని పెంచటం, ఆతర్వాత కాగితం పూలని తయారుచేయటం వృత్తిగా పెట్టుకుని కాలం గడపటం ప్రారంభించింది

"ఏదోవిధంగా మేము అదేమాదిరిగా ఉన్నా ఎంతో సంతోషించేదాన్ని, ప్రపంచానికి కృతజ్ఞతని తెలుపుకునేదాన్ని, కానీ ఆ కాస్త దయాగుణం కూడా ఈ లోకంలో కరువైపోయింది" అంటూ నిలపించింది, మతిభ్రమణంతో ఆమె భర్త మరణించిన తర్వాత

కాలచక్రం గిరగిరా తిరిగిపోయింది. సంవత్సరాలు చకచకా సాగిపోయినయ్ కానీ ఆర్చెడియాకన్ ఆవిధంగా తయారవటానికి కారణమైన ఆ రహస్యం మాత్రం ఎవరికీ అంతుబట్టలేదు

"కాథెడ్రల్‌లో అతనితో మాట్లాడిన ఆ అమ్మాయి ఏది ? ఆమె చెప్పే ఒక్కమాట చాలు ఆర్చెడియాకన్ నిర్దోషని నిరూపించటానికి" అని చెప్పే లార్డ్ బర్కెన్‌హెడ్ పలుకులకి బదులు చెప్పినవారే లేకపోయారు. (సమాప్తం) ★

# ఆఫీసర్తో కంపెనీ

ప్రసాద్



ఆఫీస్‌లో కూర్చుని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు ప్రసాద్.

అంత డబ్బెలా వస్తుందిప్పుడు?!

నాలుగు రోజుల క్యాంపే అందులోనూ తన ఫీసర్‌గారు కూడా వస్తున్నారు ఆ నాలుగు జులకు కనీసంగా పాతిక రూపాయలు కావాలే!

వెళ్ళడం మానుకుందా మనుకున్నా వీలుపడదు! లా ముఖ్యమైన క్యాంప్! అందులో డివిజనల్ ఫీస్‌నుండి ఉత్తరం వచ్చింది!

అలా అని వాళ్లేమన్నా అడ్వాన్స్ ఇస్తారా? గాల్సొలేవు పొమ్మంటారు!

నువ్వు చచ్చినాసరే కానీ, క్యాంపు మాత్రం వ్వనిసరి అని కూడా అంటారు!

దీర్ఘంగా నిట్టూర్చాడు ప్రసాద్

పోనీ పాపం గవర్నమెంటు రూల్స్, రెగ్యు షన్స్ బోలెడుంటాయి డబ్బు లివ్వడానికి!

కానీ, ఆనంద్‌గాడికేమొచ్చింది?!

వారం రోజులలో ఇచ్చేస్తాను అని తీసుకున్నాడు డిగితే ఇదిగో అన్నాడు, అదుగో అన్నాడు ఇంత రకూ ఇవ్వలేదు

అన్ని అబద్ధాలాడాడు! వెధవ అబద్ధాలూ హూ! అబద్ధం చెప్పినా నమ్మేటట్టుండాలి!

ఆఫీసర్ అడిగాడట, అందులో అర్ధరాత్రి ట రూమ్‌నుండి మైలు దూరం నడిచివచ్చి దపోతున్న ఆఫీసర్‌ను లేపి మరీ అడిగాడట!

అమ్మ! ఎలాంటి కోత కోశాడు?!

వీడికా అంత ధైర్యం?!

"సరే! నిన్నటివరకూ తప్పించుకున్నాడు, ఇవేళ లా తప్పించుకుంటాడో చూస్తాను!"

వాడి అంతు ఇవాళ తేల్చుకుంటాను!

వాడి డొక్క చించి, డోలుకట్టి అప్పైన ు డమా వాయిస్తాను వాడిముందే .

కసిగా పెదవులు బిగపట్టి, తోటి సూపర్ జర్ ఆనంద్ గురించి అనుకున్నాడు ప్రసాద్

ప్రసాద్ తెలుగువాడు ఉద్యోగం ఉన్న రాష్ట్రంలో రక్క, ఉత్తర హిందూస్థానంలో ఉన్న ఆ రాష్ట్ర కి తరలి వెళ్ళాడు.

ఆనంద్ ఫలానా, ఆ రాష్ట్రానికే చెందినవాడు.

ప్రసాద్ ఆ ఆఫీసులోచేరి ఇంకా మూడు లు నిండలేదు!

కాని విద్యుక్తధర్మం నెరవేర్చడం కోసం ఉద్యో లో చేరిన మరుసటి రోజునుండే ఒక జిల్లా ంతటా పర్యటించ నారంభించాడు క్యాంపులు నుకుని.

"అయినా నేనంటే వీళ్ళ కెందు కంత ఇది?" నుకున్నాడు ప్రసాద్

అతను ఆఫీసులో చేరటానికి వచ్చిన రోజున న్న గంద్రగోళం చెలరేగటానికి కారకుడయ్యాడు సాద్!

జాయినవాల్సిన రోజున దర్జాగా ఆఫీసులో వేశించాడు ప్రసాద్, తను చేరవలసిన ఆఫీస్ వేనని నిర్ధారణ చేసుకున్న తర్వాత.

ఎదురుగా కుర్చీలో కూచుని కిళ్ళీ నములుతూ, ర్ధ నిమీలిత నేత్రుడై కూర్చున్న ఒక యువ డు ఆ అలికిడి వినగానే కళ్ళు తెరిచాడు

తనుకేం పట్టనట్టు, మూలలనున్న ఐదారు గురు కుర్రవాళ్ళు, వాళ్ళ మానాన వాళ్ళు పని చేసుకుంటున్నారు

ఆ యువకుడిని 'విష్' చేశాడు ప్రసాద్— ఇంగ్లీష్‌లో.

ప్రతి నమస్కారంచేసి ప్రశ్నార్థకంగా చూశాడా యువకుడు

ఇంగ్లీషులో దడ దడా ప్రారంభించాడు ప్రసాద్!

"నా పేరు ప్రసాద్. ఆంధ్రప్రదేశ్‌నుండి వచ్చాను నా కిక్కడ ఉద్యోగం దొరికింది చేర టానికి వచ్చా నిప్పుడు" అన్నాడు రెండు చేతులూ జేబులో పెట్టుకుని.

ఆ మాటలను అర్థం చేసుకోవడానికి ప్రయ త్నిస్తున్నా డతను, ఎగా దిగా ప్రసాద్‌వంక చూస్తూ.

ఈలోగా చుట్టూ కలియచూశాడు ప్రసాద్.

పని చేసుకుంటున్న వాళ్ళందరూ తలెత్తి ఇతనివంకే చూస్తున్నారు!

వాళ్ళ తలలపైగా కన్పిస్తున్న నేమ్ బోర్డుల వంకకుచూసి, వాళ్ళందరూ క్లర్కులని గ్రహిం చాడు ప్రసాద్.

"ఈ క్లర్కుగాళ్ళతో నాకేం పని" అనుకు న్నాడు ప్రసాద్, వాళ్ళ నెలా పలుకరించాలో తోచక! ఆ తర్వాత ఎదురుగా, గోడపైన బోర్డు చూశాడు

"సదాశివరావ్ గోపాల్‌రావ్.. ."

"సబ్ డివిజనల్ క్లర్క్" అని పేరు, పదవి కూడా కన్పించాయి

అబ్బా యస్. డి. సీ నా! ఐతే కనీసం గ్రాడ్యు యేట్ అయినా అవాలి!

ఐతే ఇదేమిటి చెప్మా? నా మాటల నర్థం చేసు కుంటానికి ఇంతసేపు చేశాడు? తన ఇంగ్లీష్ అంత గొప్పగా ఉంది కాబోలు! లేక ఎవడురా వీడు? ఇంత దర్జాగా నిలబడ్డాడు, వీడితో మాట్లా డేదేమిటి పొమ్మనుకుంటున్నాడా?" అనుకున్నాడు యిరవై ఏళ్ళ ప్రసాద్.

ఇంతలో సదాశివరావ్..... ఇత్యాదిగా పేర్లు కలిగి వున్న యువకుడు.

"డు యు నో లోకల్ లాంగ్వేజ్" అని అడి గాడు

"ఊహూ!" అన్నాడు ప్రసాద్.

"హిందీ?" ప్రశ్నార్థకంగా అడిగాడు సదాశివ రావ్

"థోడా థోడా" (కొద్ది కొద్దిగా) అన్నాడు ప్రసాద్ తన పాండిత్యమంతా ఉపయోగించి,

"వీళ్ళకు ఇంగ్లీష్‌రాదు! మీరెలా ఉద్యోగం చేస్తారు?" అన్నా డతను

"సోహోన్! అమాత్రం చెయ్యలేనుటా" అను కుని, తేలిగ్గా నవ్వేశాడు ప్రసాద్

"సరే! మీ పేరేమిటి?" అన్నా డతను.

"ప్రసాద్" అన్నాడు ప్రసాద్ మహా ఠీవిగా తలెత్తి

అతను కొర కొరా చూసి, "మీ ఇంటిపేరు కాదు నే నడుగుతున్నది! మీ పేరు" అన్నాడు తీవ్రంగా

ఉత్తర హిందూ దేశమంతటా ఇంటిపేరు తోనే పిలుచుకుంటారు.

"నాపేరే చెప్తున్నది" అంతకన్నా తీవ్రంగా అన్నాడు ప్రసాద్

"ఐతే మీ ఇంటిపేరేమిటి?" విచిత్రమైన జంతువును చూసినట్లు చూస్తూ, బోలెడాశ్చర్యం ప్రకటించాడు సదాశివరావ్

అది చెప్పాడు ప్రసాద్ అంతటితో ఆగకుండా తమ పేర్లకూ, వాళ్ళ పేర్లకూ ఉండే తేడా కూడా చెప్పేశాడు మళ్ళీ మళ్ళీ ఏ మడుగుతాడులే అని జాలి పడుతూ!

అతని కీ వార్త ఎవరితోనన్నా చెప్పకపోతే కడు పుబ్బిపోతుందేమో నన్పించినట్టుంది—

"విజయ్! ఉస్ కా సర్ నేమ్ పహలా ఆతీహై!" అన్నాడు, మూలనున్న ఒక కుర్రవాడితో, గార బట్టిన పదహారు పళ్ళను మాత్రం బయటకు తీసి

"హిహ్హిహ్హి" అంటూ నవ్వాడు ఫలానా విజయ్!

నిముషాలమీద ఆ వార్త, ఆఫీస్ అంతటా ఒకరినుండి మరొకరివద్దకు రాకెట్‌లా దూసుకు పోయింది

ఆ వార్త తెలియగానే, ఒకొక్కడూ వచ్చి తొంగి చూస్తున్నాడు!

ప్రత్యక్షంగా తెలుసుకోవాలనే ఆతురతతో "కౌన్" అంటున్నారు

విసుగు లేకుండా వీళ్లు చెప్తున్నారు "తెలుంగ వాలా" అని!

మండిపడ్డాడు ప్రసాద్!

"తుమ్‌కు మాలుమ్ నై హై క్యా? మేరా మదర్‌టంగ్ తెలుగుహై! తేలుంగునై" అన్నాడు. కఠినంగా (నీకు తెలియదా? నా మాతృభాష తెలుగు, తేలుంగుకాదు)

ఒక్కక్షణం తెల్లబోయా డతను.

"క్యా! క్యా!" దీర్ఘాలు వినిపించినయ్ మూల నుండి!

"తెలుగుట! తేలుంగుకాదట" బదులిచ్చాడు సదాశివరావ్

కొద్ది సేపట్లో ఆ కలకలం అణిగింది

"ఆఫీసర్ లేడా?" అన్నాడు ప్రసాద్! ఉంటే నువ్విలా ఎందుకు కూర్చుంటావులే అనుకుంటూ.

"నో! హి విల్ కేమ్ ఇన్ హాఫ్ అవర్" అన్నా డతను నవ్వుతూ

"అబ్బ! అమ్మ! చంపావు కదరా నాయనా జవానీ కాన్నీ!" అనుకుని, "ఆహా! ఆంగ్ల భాషా! నీకెంత గతి పట్టింది తల్లీ" అని వాపోయాడు ప్రసాద్ కొంతసేపు తరువాత తెప్పరిల్లి,

"మిస్టర్, మీరేం చదివారు?" మృదువుగా అడిగాడు ప్రసాద్

"పి యూ సీ పాస్ అయ్యాను" సగర్వంగా బదు లిచ్చా డతను

"ఓహో! బాగుంది! వెరీ నైస్" అన్నాడు ప్రసాద్

"మీరో" అన్నాడతను

"బి యస్సీ సగంలో ఆపి, డిప్లొమా పాసై నాను" ముక్తసరిగా చెప్పాడు ప్రసాద్

"అక్కడ మీకు ఉద్యోగం దొరకలేదా? ఇక్కడ కొచ్చారు" అన్నా డతను సరిగా కూర్చుని

"అబ్బే అది కాదండీ! మీ రాష్ట్రాన్ని కొద్దిగా ఉద్ధరిద్దామని వచ్చాను" తన విట్టుకు తనే పెద్దగా నవ్వుతూ అన్నాడు ప్రసాద్.

# ఆఫీసర్‌తో క్యాంప్‌కి

కాలకొలా చూశా దశమి
కాలకలం, గుసగుసలు వ్యాపించినయ్ చుట్టూతా.
ఇంతలో ఆఫీసర్‌గారొచ్చారు

సదాశివరావ్ ప్రసాద్‌ను వెంట పెట్టుకెళ్ళి ఆఫీసర్‌కి తెలియబరిచి "ఇతను మన ఆఫీస్లో కొత్తగా ఉద్యోగంలో చేరడానికి వచ్చాడట" అన్నాడు.

విన్నగా నవ్వాడు ప్రసాద్

వగలబడి నవ్వేశాడు ఆఫీసర్!

తెల్లబోయాడు సదాశివరావ్!!

జాయినింగ్ రిపోర్టు ఇచ్చిన తర్వాత ఆ ఉప మండలం క్రిందనున్న రెండు జిల్లాలలో—ఆ పట్టణం ఉన్న జిల్లా కాక రెండవ జిల్లా ప్రసాద్ కప్పగించా డాయన.

ఆయనకు సుమారు ముప్పై అయిదేళ్ళుంటాయి. ఆయనా డిప్లమానే పాసైయ్యాడు.

"ఏకేమైనా సందేహం లొస్తే నన్నడగటానికి సందేహించకు! నీ కెల్లప్పుడూ నేను సహాయ పడతాను" అన్నా డాయన, ఫైల్సు నప్పచెపుతూ

ఆయన కళ్ళల్లో కప్పించే మంచితనాన్నర్థం చేసుకుని సంబరపడిపోయాడు ప్రసాద్

మొదట్లో అలా ఉన్నా, తర్వాత అందరూ అలానే సహాయపడ్డారు. ఈ ఆనంద్ ఒక్కడు తప్ప!

"సరేకానీ ఈ క్యాంపెలా పూర్తిచేయటం?" ఆ ఆలోచనలతో మంచి తేరుకుని అనుకున్నాడు ప్రసాద్

మొదట్లో ఒంటరిగానే వెళ్ళేవాడు, ఇప్పుడు మాత్రం ఈయనతోడు వస్తున్నాడు స్వంత కార్లో ఆ క్యాంప్‌కు కారణం—

ఇద్దరు ముఖ్యవ్యక్తులొస్తున్నారక్కడకు, దేనికో ప్రారంభోత్సవం చెయ్యడానికి వారికైతే గెస్ట్ హౌస్ సరిపోతుంది కానీ వారి సెక్రటరీలు, మొదలైన వారికో? వూరేమో చాలా చిన్నది వారికి బస కల్పించడానికి వీల్లేని స్థితిలో ఉంది తప్పనిసరిగా డేరాలు వెయ్యాలి సొచ్చింది

అదంతా ఇంకో డిపార్ట్‌మెంట్ వాళ్ళు చూసుకున్నారు.

ఆ డేరాలకు టెంపొరరీ లైటింగ్ ఇవ్వాలి అదేదో చేస్తాడు బాగానే ఉంది. అక్కడ ఉండాల్సిన మూడు రోజుల ఖర్చో?!

పిట్టాపుర్వాడు, బారెడు పొడుగున ప్రసాద్. డబ్బు లేదనే బాధకొద్దీ.

అసలు తనవద్ద డబ్బులుండేవే!

కానీ ఈ ఆనంద్ వారం రోజుల క్రితం డబ్బు అడిగాడు ఇంకొకతనికోసం. అతను తిరిగి రెండు నెలల్లో ఇస్తాడట! "ఉన్నాయికానీ నా కింకో వారంలో పెద్ద క్యాంప్ ఉంది" అన్నాడు ప్రసాద్.

ఆమాట వినగానే వాళ్ళిద్దరూ ఏదో మాట్లాడుకున్నారు, హిందీలో

ఒకటి రెండు మాటలు అర్థం అయినా, వాళ్ళు చెప్పుకొనే దేమిటో అంతు పట్టలేదు. ప్రసాద్‌కు. కాస్సేపటికి ఆనంద్ వచ్చా డతని వద్దకు.

"చూడు ప్రసాద్! నువ్వా డబ్బు ఇతని కిచ్చెయ్యి మన ఆఫీసర్ నడిగి, క్యాంపనాటికి సర్దేస్తాం" అన్నాడు.

'సరే ఇందులో పోయే దేమిటిలే!' అనుకుని డబ్బు ఇచ్చేశాడు ప్రసాద్.

నిన్నా మొన్నా కూడా తను ఆనంద్ నడిగాడు డబ్బు విషయమై.

ఇదిగో ఆఫీసర్ నడుగుతా నన్నాడు, ఇదుగో అడిగేశా నన్నాడు, అడిగితే ఆయన కాస్తాగమన్నా డన్నాడు, ఇంకేదో అనవసరమైన చెత్తంతా అన్నాడు

కానీ అవసరమైన డబ్బివ్వడే!

నిన్న పొద్దున వాళ్ళ రూమ్ కెళ్ళి అడిగితే "రాత్రి వెళ్ళి ఆఫీసరు నడిగాను నే వెళ్ళేసరికి నిద్ర పోతున్నా డాయన, ఐనా లేపి అడిగాను లేవన్నాడు ఇంక నన్నేం చెయ్యమంటావ్" అన్నాడు

"ఇలా అంటున్నానని యే మనుకోకు ఆనంద్, ఎలాగైనా సరే, ఎక్కడైనా సరే, నువ్వే చూసి తీరాలి" అని వచ్చేశాడు తను

మొండిచెయ్యి చూపద్దా మనుకుంటున్నాడు! హు! తనా వదనిచ్చేది ?

"కృష్ణకుమార్" కేక వినిపించిందాఫీసర్‌గారి రూమ్‌లో నుండి.

అసలు పేరు కృష్ణప్రసాద్ అయినా ఆ పేరుతో ఆఫీసర్ తన్ని పిలవడు.

"యస్సార్" అంటూ లోపలకు దూసుకుపోయాడు ప్రసాద్

"వెళ్ళడానికి తయారుగా ఉన్నావా ?" అన్నా డాయన.

"యస్సార్" అన్నాడు ప్రసాద్.

"ఇంకో అరగంటలో బయలుదేరదాం! అన్నట్టు మనకు సామాను తక్కువౌతుందేమోనే" అన్నా డాయన.

"ఔను సార్ ! తక్కువైనా, కాకపోయినా, కొంత దగ్గర ఉంటే మంచిది కద సార్ ! వెళ్ళే దారిలో మన కంట్రాక్టరువద్ద తీసుకొందామండి" అన్నాడు ప్రసాద్.

"ఏమేం కావాలో ముందే ఫోన్‌చేసి చెప్పు. త్వరగా మన గేట్ కారుపై సర్దించు" అన్నా డాయన.

"యస్సార్" అంటూ ఆగిపోయాడు.

ప్రశ్నార్థకంగా చూశా డాయన.

"ఆనంద్ మిమ్మల్ని డబ్బు అడిగాడా ?" నసుగుతూ అన్నాడు ప్రసాద్.

"ఎప్పుడు ?"

"మొన్న రాత్రి అడిగానని చెప్పాడు" అన్నాడు ప్రసాద్

"లేదు ! ఏం కథ ?"

"వారంరోజుల క్రితం తీసుకున్నాడుసార్, క్యాంప్‌కు వెళ్ళేటప్పుడు యిస్తానని ఇంతవరకూ యివ్వలేదు నావద్ద డబ్బులు లేవు !" అన్నా డాయన ఏమంటాడోనని భయపడుతూ ప్రసాద్.

"డబ్బులకోసం బెంగపడకు ! అతని కింకెప్పుడూ యివ్వకు" అన్నా డాయన.

"థాంక్యూ సార్ ! అలాగే" అంటూ బయట పడ్డాడు ప్రసాద్.

"హలో ప్రసాద్ గుడ్‌మార్నింగ్" తల 45° డిగ్రీలు ప్రక్కకు తిప్పి, సూటిగా ప్రసాద్ వంకకే చూస్తూ ప్రవేశించా డానంద్.

"గుడ్‌మార్నింగ్" ముక్తసరిగా అని "డబ్బు లేవి ?" అన్నాడు ప్రసాద్.

పది రూపాయ లిచ్చాడు ప్రసాద్‌కు "అన్నట్టు మీకు సామాను సరిపోతుందా ?" అంటూ ఆనంద్.

"ఉహూ ! కంట్రాక్టరువద్ద తీసుకుంటాం దారిలో సరేకానీ, ఈ క్యాంప్‌కు పది రూపాయలు సరిపోతాయా ?" అన్నాడు ప్రసాద్

"ఉహూ ! కంట్రాక్టరుకు నేను ఫోన్ చేశాను. నీ కింకో పదిహేను యిస్తాడు మొత్తం పాతికా అతనికి నీవే జీతాల్లో యిచ్చెయ్యి" అన్నా డానంద్.

నిర్ఘాంతపోయాడు ప్రసాద్

తేరుకుని, "అదేమిటి, నువ్వే యివ్వాలి నాకు పాతిక రూపాయలూ" అన్నాడు ప్రసాద్.

"నువ్వెవరికైతే డబ్బులిచ్చావో అతనే కిస్తాడు! అది మీ లెక్క నాకేం తెలియదు" అన్నా డానంద్.

కోపం పరాకాష్ఠ కంటింది ప్రసాద్‌కు



"తెలిసిందా! ఆ డబ్బు నువ్వే యిచ్చేశావని! నువ్వే యిస్తానన్నావు! కంట్రాక్టరువద్ద నేను తీసుకునే సమోసా కానీ, యీ పది కానీ, అతనికి నే నివ్వను! నువ్వే చూసుకో అ.." వస్తున్న ఆఫీసర్‌ను చూసి కోపాన్ని, మాటలనీ దిగమింగాడు ప్రసాద్ లోపలకు వెళ్ళాడు ఆనంద్.

*　*　*

"బయలుదేరుదాం" అంటూ డ్రైవింగ్ సీట్లో కూర్చున్నా డాయన.

వాళ్ళిద్దర్నీ, మరో యిద్దరు వైర్‌మన్లని తీసుకుంటూ కారు దూడుచ్చుకుంది

దారిలో కంట్రాక్టరు వద్ద కారు ఆపి ఆఫీసరు.

పరుగెత్తుకుంటూ వచ్చాడా కంట్రాక్టరు "నమస్తే సాహెబ్! నమస్కార్ ఛోటా సాహెబ్!" అంటూ.

లోపలకు పోయిన తర్వాత, సమా చిచ్చాడు, టిప్సు రాసుకున్నాడు, కానీ డబ్బు లివ్వడే!

ఇంతలో ఆనంద్ పంపిన మరో వైర్‌మన్ పుండరీక్ వాచ్చాడు, మరో పనిమీద

"పుండరీక్, ఆనంద్ నిజంగా ఫోన్ చేశాడా?" అన్నాడు ప్రసాద్ హిందీని ఖూనీచేస్తూ.

"చేశాడు సాబ్" అన్నాడు పుండరీక్

"మరి యితను డబ్బివ్వలేదే!" అన్నాడు ప్రసాద్.

తెల్లబోయా డతను "యివ్వలేదా?" అంటూ. ఏదో చెప్పబోయాడు ప్రసాద్

"కృష్ణకుమార్!" కేక వినిపించింది, కారు లోపలనుండే

పరుగెత్తాడు ప్రసాద్.

పట్నం దాటిన తర్వాత స్పీడోమీటరులో ముల్లు నలభై-ఐదు—యాభై మధ్య తిరుగ నారంభించింది

"మిస్టర్ కృష్ణ.. సారీ రేమిటి? కృష్ణ... కృష్ణమూర్తి సిగరెట్" అన్నా డాయన

డాష్ బోర్డులోనుంచి టిన్ను తీసి యిచ్చాడు ప్రసాద్.

"యూటూ!" అంటూ సిగరెట్ వెలిగించు కున్నాడాయన.

"థాంక్యూసార్" అంటూ తనూ ఆపనే చేశాడు ప్రసాద్

"కృష్ణారావ్! ఏమన్నాడానంద్?" అడిగాడు ఆఫీసర్

జరిగింది చెప్పాడు ప్రసాద్.

"ఆనంద్ ఈజ్ ది బిగ్గెస్ట్ ఫూల్ యిన్‌వర్ ఆఫీస్ అతని చెప్పుడూ నమ్మకు నాకు పంచ త్సరం అనుభవం ఉందతనితో" అన్నాడాయన నవ్వుతూ.

ముసిముసిగా నవ్వాడు ప్రసాద్

'ఇతను నిజంగానే ఎగ్గొట్టేటట్టున్నాడే' పళ్ళు కొరుక్కుంటూ అనుకున్నాడు ప్రసాద్

"ఎంత నాటకమాడాడు? చివరకు మొండి చెయ్యి చూపించాడుగా" ప్రసాద్ కళ్ళెర్ర బడ్డాయి

"ఎలా అతని తిక్క కుదర్చడం? అడుగుదా మన్నా దాటి వచ్చేశానే!"

"కృష్ణప్రసాద్" అని పిలవా డాఫీసర్,

"అరె జన్మ తిరియించేవే! అఫీసరు పేరుపెట్టి పిలవాడు" పోలెడు ఆనందిస్తూ, ఆయన వైపుకు తిరిగాడు ప్రసాద్.

"కృష్ణకుమార్! నీకు పెళ్ళయిందా?" అన్నా డాయన.

నీరసించిపోయాడు ప్రసాద్ "తుస్సున ఎగుర గొట్టాడే నా ఆనందాన్నంతా!" అనుకున్నాడు.

"ఇంకా లేదుసార్! ఐనా ఇప్పుడే, ఏం తొందర సార్ పెళ్ళికి?" సిగ్గుపడుతూ అన్నాడు ప్రసాద్

"నీ కెన్నేళ్ళు?" అన్నాడాయన

"ఇంకో పది రోజుల్లో యిరవయ్ నిండి, యిర వయ్ ఒకటి వస్తుంది సార్" అన్నాడు ప్రసాద్

"నాకు నీ వయస్సులో మొదటి కూతురు పుట్టింది తెలుసా!" సగర్వంగా అన్నాడాయన

"మీ చదువు త్వరగా పూర్తయి ఉంటుంది" అన్నాడు ప్రసాద్.

"ఏంకాదు! అప్పటికి నే నింకా ఫైనలియర్ లోనే ఉన్నాను" అన్నా డాయన

"ఓహో! బాగుంది" నవ్వాడు ప్రసాద్.

పంతులమ్మ: "ఆవుపాలకన్న తల్లి పాలు శ్రేష్టము" ఎందు చేతనో కారణాలు ఊహించి వ్రాయండి?

ఒకపిల్ల రాసిన జవాబు: 1. డబ్బుఖర్చు లేదు 2. పాడైపోయిన పాలు తాగడమనే భయం లేదు 3. పాలబుడ్డి క్రిందపడి పగిలి పోతుందనే కంగారు లేదు. 4. పిల్లి తాగెయ్యలేదు.

వనజ (తాడేపల్లిగూడెం)

కాస్సేపు నిశ్శబ్దం.

"చూడు కిషన్‌లాల్ నువ్వో మోటార్ సైకిల్ కొనుక్కోరాదూ? క్యాంప్‌లకు సర్దాగా వెళ్ళి రావచ్చు" అన్నా డాయన

"దానిమీద బయలుదేరితే, నేను సీటుమీద నిలుస్తానా సార్!" అన్నాడు, ఐదడుగుల ఏడంగు ళాల యెత్తు, మాటవది పౌన్ల బరువూ గల్గిన ప్రసాద్

పగలబడి నవ్వా డాయన.

"ఏం కాదులే కొనెయ్యి" అన్నాడాయన.

"అలాగే సార్" అన్నాడు ప్రసాద్.

ట్రాన్సిస్టరు అందించి, "వివిధ భారతి పెట్టు" అన్నా డాయన

అలని చేస్తూవుండగా, మధ్యలో తెలుగు మాటలు తగిలాయి ఆత్రుతతో ఆగాడు ప్రసాద్

"ఏ భాష అది?" అన్నా డాఫీసరు

"తెలుగు సార్! తెలుగు" మూడు నెలల తర్వాత తెలుగుమాట విన్నందుకు ఉప్పొంగిపోతూ సగర్వంగా అన్నాడు ప్రసాద్

కాస్సేపు విన్నా డిమాత్రం అర్థంకాకపోయి నకు అదే చెప్పాడు ప్రసాద్‌తో.

"మా భాష 'ఇటాలియన్ ఆఫ్ ది యీస్ట్' సార్! అంత మధురమైన భాష! పూరికే విని ఆనం దించవచ్చు సార్" అన్నాడు ప్రసాద్, వింటూ తను ఆనందిస్తున్నాడు కాబట్టి.

"అలాగా!" నవ్వేసి, ఏదో చెప్పబోతున్న వాడల్లా ఆగి కారుకు సడెన్ బ్రేక్ వేశాడాయన, ఎవరో కారు కడ్డం రావడంతో.

ముందుకు తూలి, అటువైపు చూశాడు ప్రసాద్ మళ్ళీ కారు సాగింది "క్యారే.. సాలా.." అనే ఆఫీసర్ తిట్లమధ్య

పకపకా నవ్వేశాడు ప్రసాద్ ఆయన కోపానికి కోపం మరచి శృతి కలిపాడాయన.

ఒంటిగంట కొడుతుండగా, మరో వూరు చేరారు రెస్ట్ హౌస్ చేరి వైర్‌మన్ల నిద్దర్నీ భోజనానికి పంపేశాడాయన. ప్రసాద్‌కు ఆత్మా రాము డఘోషిస్తున్నాడు, ఆకలితో కాని ఆయ నొక్కడినీ కూర్చోపెట్టి, తనెలా వెళ్తాడు?

"నే నింటి దగ్గరే భోంచేశాను! నీ సంగతో" అన్నాడాయన

'అన్యాయంగా నన్ను మాడ్చేశారు' అనుకుని, "నేనుకూడా నండి" మొహమాటంకొద్దీ అన్నాడు ప్రసాద్

"కాసిని పళ్ళేమన్నా తిందామా? బాగున్నట్టున్నయ్!" అన్నాడాయన ఎదురుగా ఉన్న పళ్ళ దుకాణంలోకి తీక్షణంగా చూస్తూ.

"బతికించారు!" అనుకుని, ప్యూన్ నొకడిని ఆ పనిమీద పంపాడు ప్రసాద్

"కృష్ణకుమార్! ఇంతకీ నీ పెళ్ళెప్పుడు?" నవ్వుతూ అడిగాడాయన

ఉలిక్కిపడ్డాడు ప్రసాద్, "పెళ్ళంటే ఉంది నకు మహా సరదానే" అనుకుంటూ.

"సెలవు దొరకదు కదండీ! లేకపోతే చేసుకునే వాడినే" అన్నాడు ప్రసాద్

"పెళ్ళి చేసుకుంటాను, పదిరోజులు సెలవు కావాలి అని నువ్వప్లయి చెయ్యి, గ్రేస్ పీరియడ్ యిరవయ్ రోజులు కలిపి, మొత్తం నెలరోజుల సెలవు నే నిస్తాను. వెళ్తావా?" అన్నాడాయన.

"అలా నెల రోజులు సెలవు యిచ్చేటట్లయితే యిప్పుడే యివ్వండిసార్! వెళ్ళి, పది రోజుల్లో పెళ్ళి చేసుకుంటాను" అన్నాడు ప్రసాద్.

"ఆహా, వద్దు! ముందు క్యాంప్‌కు పద" నవ్వేస్తూ అన్నాడాయన

"అమ్మ! ఇంక పెళ్ళి సంగతి యెత్తడాయన" అనుకున్నాడు ప్రసాద్.

మూడు దాటుతూండగా, చేరవలసిన వూరు చేరారు

అక్కడ అంతా సిద్ధంగా ఉన్నది. రెస్ట్ హౌస్ ఆవరణలో డేరాలెత్తేసి ఉన్నాయి.

"ఇంకా మాపని మిగిలి ఉంది" అన్నా డాఫీసరు.

వెంటనే పని ప్రారంభించారు లాంఛనంగా ఎలక్ట్రిసిటీ బోర్డువాళ్ళ వద్ద పర్మిషన్ తీసుకుని వైరింగ్ ప్రారంభించారు, డేరాలో

హడావిడి చేస్తూ, పనిని పర్యవేక్షిస్తున్నాడు ప్రసాద్

ఇంతలో ఆఫీసర్ వచ్చాడక్కడికి.

"మనం తెచ్చిన సామాను చాలనట్లు ఉంది! మన మనుకున్న వాటికంటే రెండు మూడు జేరా ఎక్కువవుతున్నాయి'' అన్నాడాయన.

ఇద్దరూ కలసి లెక్కపెట్టారు .. చాలదనే తేల్చుకున్నారు.

"సరే! ఆనంద్‌కు సామానూ, మనిషినీ వెంట పెట్టుకు రమ్మని ఫోన్ చేస్తాను'' అంటూ ఆపని మీద బయలుదేరాడాయన

## ఆఫీసర్ తో కాంప్ క్షి

ఎగిరి గంతేశాడు ప్రసాద్. "రానీ, అతని తిక్క కుదురుస్తాను'' అనుకున్నాడు, మళ్ళీ నొకదానిని భుజంపై పెట్టుకుని రంగారావు ఫోజులో.

* * *

మర్నాడు మధ్యాహ్నం పన్నెండయింది. ఇంకా భోజనానికి రెండు గంటలన్నా తీసుకుంటుంది. ఆకలి మండిపోతోంది, ప్రసాద్‌కు.

భవతిం వైరింగ్ జరుగుతున్నది. దానిని పర్య వేక్షించాలి, తప్పనిసరిగా.

సిగరెట్ మీద సిగరెట్ కాలుస్తూ—

ఆకలితో, భోజనానికి ఇంకా చాలాసేపాగాలనే





అన్నిచోట్ల దొరకును







అమృతాంజన్
లిమిటెడ్ వారి
గ్రైప్ మిక్స్చర్

తయారీ:
అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు-4

FDS AGM 472 TE

కోపంతో, గంతులేస్తున్నట్టుగా అటూ యిటూ తిరుగుతూ—

తేనెటీగల మాదిరిగా, వంచిన తల ఎత్తకుండా పనిచేస్తున్న, చిన్నా, పెద్ద వ్యక్తుల మధ్య, దడదడా ఇంగ్లీషులోనూ, ఖూనీచేస్తూ హిందీలోనూ మాట్లాడుతూ, వీలైనంత కలకలం సృష్టించడానికి శాయశక్తులా కృషిచేస్తున్నాడు ప్రసాద్

అప్పుడే ఫోంచేసి, పని ఎలా సాగుతోందో చూడటానికి వచ్చాడా హడావిడికి మూలకారకుడైన వ్యక్తి— ప్రేవ్ మని తేపుతూ—

కడుపు మండిపోయింది ప్రసాద్‌కు.

డేరాలోపలకు వచ్చాడాయన

సిగరెట్ వెలిగించి, పొగ్గా పొగ వదిలాడు ప్రసాద్

ఆయన తనవైపు చూస్తుండడం గమనించి, కాలుమీద కాలు వేసుకుని, మధ్య మధ్య సిగరెట్ పీలుస్తూ అరవనారంభించాడు ప్రసాద్

"ఆ వైర్ పొడుగెక్కువైంది తగ్గించు" అన్నాడు— "ఆ స్విచ్ అక్కడ బిగించడమేమిటి? తీసెయ్" అన్నాడు— అదన్నాడు, యిదన్నాడు, ఆఖరికి, "క్యా బేకార్ కామ్‌కియా తుమ్!" అన్నాడు పక్కకు చూస్తూ

అర్థం చేసుకున్నాడు కాబోలు, 'చలా! చలా!' అంటూ నిష్క్రమించాడాయన.

ఒంటిగంటయింది—

ఆనంద్ వస్తూ కన్పించాడు, పుండరీక్‌ను వెంట పెట్టుకుని—

"ఆహా వచ్చావూ! రా నాయనా, నీ కోసమే ఎదురుచూస్తున్నాను" వెటకారంగా అనుకున్నాడు ప్రసాద్

వచ్చిన దగ్గరనుండీ క్షణకాలం వృధా చెయ్యకుండా తిరిగేస్తున్నాడానంద్. ప్రక్కనే ఎవరో వకరుంటున్నారు, ఎల్లవేళలా

"అలా ఉంటే ఎలా అడగడం ?!"

ఎంతైనా తోటి సూపర్‌వైజర్! అతని పరువు నలుగురిలో— అందులో తమకింద పని చేసేవాళ్ల మధ్య— తీసివెయ్యడం— ఏమాత్రం బాగుండదు

ఇతని వరుస చూస్తుంటే, యిలాగే తనని తప్పించుకు తిరిగేటట్టున్నాడు!

'ఎలా యితని తిక్క కుదర్చడం?' కసిగా ఆలోచిస్తున్నాడు ప్రసాద్

"కృష్ణకుమార్" అంత దూరాన నుంచుని కేక పెట్టాడు ఆఫీసర్

"ఇక్కడో 'మెర్క్యురీ లాంప్' పెట్టించు" అంటూ వెళ్లిపోయాడాయన

"పుండరీక్ ఓ పుండరీక్" అంటూ అతన్ని కేకలుపెట్టి, గాభరాగా తన వద్దకు వచ్చిన పుండరీక్‌కా పని పురమాయించాడు ప్రసాద్.

ఆపని ప్రారంభించాడు పుండరీక్

"ఇటు చూడు! ఆరోజున కంట్రాక్టర్ డబ్బెందుకివ్వలేదుట?" అన్నాడు ప్రసాద్.

"ఆనంద్‌సాబ్ మళ్లీ ఫోన్ చేశాడట సాబ్, యివ్వవద్దని" అన్నాడతను

"హారినీ! ఎంతపని చేశావ్" ఆశ్చర్యపడుతూ అనుకున్నాడు ప్రసాద్.

"ఐనా యితనికి బుర్ర ఉంది! ఎగ్గొట్టటానికి వీలుగా అన్ని పనులూ చేసుకుంటున్నాడు" బోలెడు ఆశ్చర్యంతో అనుకున్నాడు ప్రసాద్.

బుర్ర ఉన్నవాడు, మరో బుర్ర ఉన్న వాడిని గుర్తించడంలో స్వారశ్యం ఉంది

అలాంటి స్వారశ్యాన్నే ప్రసాద్ కనపరిచాడు

"సరే కానీ! నాకామాత్రం బుర్ర లేదనుకున్నాడా లేక అడగటానికి నోరు లేదనుకున్నాడా? ఆమాత్రం అతని 'పని' చెప్పలేక పోతానా!" కసిగా పళ్లు కొరుకుతూ అనుకున్నాడు ప్రసాద్

ఆ సాయంత్రానికి పనులన్నీ పూర్తయినాయి

తుది మెరుగులు దిద్ది, అన్నీ సరిగా ఉన్నాయో లేదో పరీక్షచేసి చూశాడు ప్రసాద్ ఏ లోపమూ లేకుండా వెలుగుతున్నాయి

రాత్రి తొమ్మిది గంటలకు భోంచేసి, తిరిగ్గా కూర్చున్నారు ముగ్గురూ, తమకు కేటాయించబడిన ఆరూ 'యింటూ' ఆరూ అడుగుల డేరాలో

చలిగాలి ఉధృతంగా వీస్తున్నది.

టెంపరేచర్ బిలో నార్మల్‌కు పడిపోయింది

డేరా తలుపులు మూసి, స్వెట్టర్లు తొడిగి, మఫ్లర్లు బిగించి, అదీ చాలక రగ్గు ముసుగు పెట్టుకున్నారు ముగ్గురూ

ట్రాన్సిస్టర్ పెట్టి, సిగరెట్లతో మేఘాలు సృష్టిస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు

కాలం వాళ్లకు తెలియకుండానే గడచిపోతున్నది

దాదాపు పదిన్నరయింది తెల్లవారుఝామున రావాల్సినవాళ్లు వచ్చేస్తారు

అకస్మాత్తుగా పాలో మని కేకలు, గందరగోళం ముగ్గురి కర్ణరంధ్రాలు భేదిస్తూ విన్పించాయి

"ఏమి టేమిటి?" ముగ్గురూ ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు

దడదడమని అడుగుల చప్పుడు.

"కృష్ణకుమార్! యిది అడవి ప్రాంతం పుట్టి వచ్చి ఉంటుంది! అందుకే యీ గందరగోళమంతా" అన్నాడు ఆఫీసరు, ప్రసాద్‌ను భయపెట్టటానికి

ఆయన ముఖంలో చిరునవ్వు దాచినా దాగలేదు! స్వల్పంగా తొంగిచూసింది

రగ్గవతల పారేశాడు ప్రసాద్. చొక్కా చేతులు మడిచాడు రొమ్ము విరుచుకుంటూ లేచి నిలబడ్డాడు

"ఆయ్! వస్తుందిగా! దాని తడాఖా చూపిస్తాను" అంటూ దడదడా బయటకు నడిచాడు ప్రసాద్

"సాబ్! రెస్ట్ హవుస్ కాంప్ సెట్ బంద్ హోగయా!" అంటూ ఎదురైనా ఢోకతను

"సార్! పులికాదు కానీ, పులిలాంటి ఆపదే!" అంటూ లోపలికి పోయాడు ప్రసాద్.

ప్రశ్నార్థకంగా చూశా డాఫీసరు.

అంతా చెప్పాడు వొచ్చినతను

రెస్ట్ హవుస్‌లో నీళ్ల కాధారం ఆ పంపింగ్ సెట్టే! అది కాస్తా తలాయించింది, పని చెయ్యకుండా టాంక్‌లో నీళ్లు అయిపోవచ్చాయి.

దడదడమని కాళ్లు తొక్కుకుంటూ, వైర్‌మన్లని లేపి, ఆరుగురూ పంప్ హవుస్‌కి పరుగెత్తారాచీకటిలో, చలిలో, రెండు ఫర్లాంగుల దూరం.

అక్కడి పరిస్థితినిపట్టి మోటార్‌కూ, పంపుకూ మధ్య ఉన్న ఇరవయ్ అడుగుల పైప్‌నే మార్చివేయాలన్నారు, మోటార్‌ను బాగుచెయ్యడం కాక

అది, రేపు మధ్యాహ్నం పన్నెండు గంటలలోగా పూర్తికావడం అసాధ్యం, అసంభవం అని చెప్పారు.



నన్నెప్పుడూ ఆలస్యం అంటారుకదూ? చూడండి అప్పుడే ఎన్ని చీరలు సెలెక్టు చేసేశానో!



## పుష్పము మీ అదృష్టం చెప్పగలదు

మీ భవిష్యత్తులో ఏమి జరుగబోవునదిన్నీ,మీ సరియైన చర్యను గురించిన్నీ మీరు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టుకార్డుపైన మీకు ఇష్టమగు ఒక పుష్పము పేరున్నూ, మీరు వ్రాయు తేదీ, వేళవివరములున్నూ, మీ సరియైన విరునామాయున్నూ వెంటనే వ్రాసిపంపండి. జ్యోతిషశాస్త్రములోని రహస్య గణితము మూలముగామేము గుణించి, మీరు కార్డు వ్రాసినతేదీ లగాయతు 12 మాసములలోను మీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవిత మార్గము,ఏ వ్యవహారములోమీకు జయము కలుగునో, ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు,మార్పులు,ఆరోగ్యవిషయము, పరదేశగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, విధినిక్షేపములు, లాటరీ, అకస్మా ద్రవ్యలాభము మొదలగువానిని గురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు.1.25న. పై. లకు మాత్రము వి. పి. గా పంపగలము. (వి. పి. ఛార్జీలు ప్రత్యేకం ).దుష్టగ్రహములేవైనా ఉన్నయెడల శాంతిచేయు విధానం కూడా తెలుపగలము. వివరములు మా పూచీపైనపంపబడును మేము పంపిన ఫోగట్టా మీకు తృప్తిగా లేనిఎడల పైకము వాపసు చేయబడును. ఒకసారి పరీక్షించండి. అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

PT. DEV DUTT SHASTRI, RAJ JYOTHISHI (A.W.P)
P. B. 86, JULLUNDUR CITY



## ఉచితము



ఆశ్చర్యకరమైన తక్కువ ధరలకు మిక్కిలి అందమైన చేనేత చీరలు. ఒక చీర రు. 8/50 (అసలు ధర రు. 12/—). 2 చీరలు రు 16/—. 3 చీరలు రు. 24/—. పోస్టేజి ఉచితం. డీలక్సు రకం ఒక చీర రు 12/50 2 చీరలు రు. 24/—. 3 చీరలు రు. 35/— పోస్టేజి ఉచితం స్పెషల్ రకం ఒక చీర రు. 16/—. 2 చీరలు రు. 30/— 3 చీరలు రు. 42/— పోస్టేజి ఉచితం. ఏదైన 3 చీరలు కొనిన యియర్‌టాప్స్ ఉచితం అందమైన షర్టుగుడ్డ పీసు రు. 7/50. 2 పీసులు రు. 14/—. 3 పీసులు రు 20/— పోస్టేజి ఉచితం. కొద్ది స్టాకు గలదు. ఆర్డరు వెంటనే పంపండి. అడ్రసు యింగ్లీషులో వ్రాయవలెను.

THE ROYAL STORES (APTW),
Post Box No. 1774, Delhi—6.



## నిరాశ చెందవద్దు

దాంపత్య జీవితంలోని బలహీనత గూర్చి మీరు చింతపడవద్దు



## జీవన స్పెషల్

రుచియైన ఆయుర్వేద టానిక్ ఉత్తమ గుణములు గలది కోల్పోయిన శక్తిని చేకూర్చి మీ దాంపత్య జీవితాన్ని ఆనందమయం చేస్తుంది స్త్రీలు ప్రసవానంతరం "జీవన స్పెషల్" సేవించిన, యౌవనములుగా నుందురు

**ఎక్కువ ఫలితానికి**

పాలు వాడటం మంచిది — కావలసినంత దేహ వ్యాయామము చేయవలెను — గ్రుడ్లు వాడరాదు

**ముఖ్య గమనిక** జీవన స్పెషల్ మీ దేహాన్ని తొందరగా పోషించు శక్తిగలదికాబట్టి మూడువారములు సేవించిన తర్వాతఒక వారం రోజులు మానివేయుట చాల అవసరం లేనియెడల లావై పోదురు. లేక దాంపత్య వాంఛ అధికమగును ఆరోగ్యం, బలంచేకూరిన వెంటనే మానివేయవలెను ఆరోగ్యవంతులు, పెళ్ళికానివారు "జీవన స్పెషల్" ఉపయోగించరాదు

450 గ్రాముల ప్యాకింగ్‌లో లభించును ధర రు 10/— ప్యాకింగ్ & పోస్టేజి అదనం సగం ధర ముందుగా పంపవలెను మిగత ధరకు వి పి పి ద్వారా పంపబడును విదేశ మరియు మిలిటరీ ఆర్డర్లతో పాటు రు 13/— పంపవలెను ఉత్తరములు ఇంగ్లీషులో వ్రాయవలెను

*Orders to* : **Jeevamritham Oushadha Sala,**
CALICUT 1. (S. India)
Chief Physician Dr. K N RAMDASS Phone. 3607 & 2419


# ఆఫీసర్‌తో కాంప్‌కి

తెల్లమొగం వేసారందరూ.

ఇంక చేసేదేమీ లేదు, ఏదో ఒక వాన్‌లో నీళ్ళు తేవడం మినహా !

ఐదు నిముషాలలో వాన్ ఒకటి పరుగులు తీసిందా పనిమీద.

అరుగురూ డేరాలవైపు బయలుదేరారు

ఆఫీసర్‌గారు ప్రారంభించారు ఇద్దరు ప్రముఖ వ్యక్తు లొక సభకు వచ్చిన సంగతీ, ఆ సభకు కావలసిన ఎలక్ట్రికల్ సదుపాయాలన్నీ తను దగ్గరుండి చేయించిన సంగతీ, ఇంకో అయిదు నిముషాలలో సభ ప్రారంభం కానున్న దనగా ఎలక్ట్రిసిటీ ఫెయిలయిన సంగతీ—చెప్పారు

అప్పుడు తన గుండె యెలా గుబేల్మందో, వీలైనంత తేలిక మాటలలో వర్ణించారు తను చేసేదేమీ లేక, మోటార్—జనరేటర్ పెట్టను ఎంతసేపట్లో తెచ్చి, సభ త్వరగా ప్రారంభం కావడానికి సహాయపడింది కూడా చెప్పారు

"అలా ఔతుంటా యొక్కొక్కప్పుడు ! ఎంత బాగా చేసినా, పని సక్రమంగా పూర్తయ్యే వరకూ, సంతృప్తివడరాదు ! తెలుసుకోండి !" అంటూ మునుగు పెట్టుకున్నాడాయన

* * *

భళ్ళున తెల్లవారింది

'అబ్బ ! ఇంకో వేకువ యిక్కడే చూడాలి కాబోలు' అనుకుంటూ లేచాడు ప్రసాద్

"కృష్ణమూర్తి ! ఇవాళేనా చాయ్ సంగతి చూడు ! నిన్న మాడ్చేశావ్ నన్ను" అన్నారు ఆఫీసర్‌గారు

"యస్సార్" అంటూ బయలుదేరాడు ప్రసాద్.

రొట్టె, ఆమ్లెట్లు, చాయ్ పుచ్చుకుని, మధ్యలోనే యిద్దరు వైర్‌మన్లు ఎదురొచ్చారు

'వెరీ నైస్' అనుకుంటూ వెనక్కి తిరుగుతూ, మధ్యలో గులాబీపువ్వు కన్పించగా, వెంటనే దాన్ని తీసి, చొక్కా కాలరులో అమర్చాడు ప్రసాద్

"దట్స్ గుడ్ ! నువ్వూ ఉన్నావ్ ! ఎందుకూ ? వీళ్ళు చూడు, అడక్కుండానే ఎలా తెచ్చి పెట్టారో మొహమాటం ఎందుకూ తీసుకో" అన్నారు ఆఫీసర్‌గారు, ఉపక్రమిస్తూ

అవి తిని చాయ్ త్రాగిన తర్వాత, ఆఫీసర్ గారికి ఉత్సాహం షాంపెన్‌లా ఎగజిమ్మింది

"కృష్ణకుమార్ ! ఆ గులాబీపువ్వును నీ ప్రేయసి కివ్వు ! నీకేమాత్రం బాగుండలేదు" అన్నాడాయన నవ్వుతూ

ముసిముసినవ్వు లొలకపోసాడు ప్రసాద్.

"ఎవరూ లేందే ! ఎవ్వరి కివ్వమంటారుసార్ ?" సిగ్గుపడుతూ అన్నాడు ప్రసాద్

"ఆయ్ ! అబద్ధాలు చెప్తున్నావ్ ! నిజం చెప్పు ! ఉందా లేదా ? లేకపోతే నువ్వలా నవ్వవే !" అన్నాడాయన చాలా గొప్ప విషయం కనిపెట్టినట్లు సంబరపడుతూ

లాభంలేదు ! ఈయన వదలడు, లేదంటే అనుకుని "ఎక్కడ సార్ ! ఎక్కడో వెయ్యి మైళ్ళ దూరాన ఉంటే ! ఎలా వెళ్లను ?" అన్నాడు ప్రసాద్.

44 వ పేజీ చూడండి

# వేల్పులకైనా మార్పులు తప్పవు

మహేష్

(16-4-65 సంచిక తరువాయి)

## ఆళ్వారులు

ఆళ్వారులు దక్షిణ దేశములో వైష్ణవ మతమును ప్రచారము చేసిరి ఆళ్వారు అనగా విశేషమైన జ్ఞానము కలవాడని అర్థం పూదత్తాళ్వారు, పొయ్‌గైయాళ్వారు, పేయాళ్వారు, పెరియాళ్వారు, తిరుమళిశై యాళ్వారు, కులశేఖ రాళ్వారు, తిరుప్పాణి యాళ్వారు, తొండరడిప్పొడి యాళ్వారు, తిరుమంగై యాళ్వారు, నమ్మాళ్వారు వీరు పదిమంది ఆళ్వారులని కొంతమంది అభిప్రాయం. ఈ పదిమంది ఆళ్వారులతో ఆండాళ్ళను, మధురకవి యాళ్వారును చేర్చి మొత్తం పన్నెండు మంది ఆళ్వారులని మరికొందరి అభిప్రాయం వీరిలో పూదత్తాళ్వారు, పొయ్‌గై యాళ్వారు, పేయాళ్వారు యీ ముగ్గురికి మొదలాళ్వారులని ఖ్యాతి ఉన్నది

## మొదలాళ్వారులు

ఈ ముగ్గురు ఆళ్వారులు ద్వాపరయుగములో 860909 సంవత్సరములు గతించగా సిద్ధార్థి నామ సంవత్సర అశ్వీజ శుద్ధ పక్షమందు జన్మించిరని సనాతనుల విశ్వాసం కాని, ఈ కాలమును ఆధునికులు అంగీకరించరు వీరు ముగ్గురు విష్ణువు యొక్క గదాశంఖ ఖడ్గములు అంశమున జన్మించి వైష్ణవమతమును వ్యాప్తి పొందించిరని సనాతనుల అభిప్రాయం ఈ ముగ్గురు ఆళ్వారులు తిరుక్కోవలూరులో కలుసుకొనగా వారికి విష్ణువు సాక్షాత్కరించెను వీరు ఒక్కొక్కరు నూరు పాశురములతో భగవంతుని ప్రార్థించిరి

## తిరుమళిశైయాళ్వారు

వీరు కూడా ద్వాపరయుగమందే చక్రాంశ వలన జన్మించిరని సనాతనుల విశ్వాసం ఈయన తన మహాత్మ్యమును చూపి యితర మతస్థులను వైష్ణవులనుగా మార్చెను.

## నమ్మాళ్వారు

ఈయన విష్వక్సేనుని అంశవలన కలియుగము ప్రారంభమైన నెలా పదమూడు రోజులకు జన్మించిరని సాంప్రదాయం ఉన్నది ఇతడు ఋగ్వేదము తిరువిత్తముగను, యజుర్వేదమును తిరువాశిరియముగను, సామవేదమును తిరువాయ్‌మొళిగను, అథర్వణవేదమును పెరియ తిరువన్దాదిగను యిట్లు నాలుగు వేదములను ప్రబంధరూపములుగ జేసెను.

## మధురకవి యాళ్వారు

కుముదుడను గణనాథుడు మధురకవియై జన్మించి నమ్మాళ్వారుకు శిష్యుడయ్యెను ఇతడు చేసిన గురుస్తుతి అమూల్యమైనది భగవంతుని కంటె గురువే అధికుడని ఇతడు తలంచెను.

## కులశేఖర ఆళ్వారు

ఇతడు కౌస్తుభము యొక్క అంశచేత కలియుగంలో యిరవైమూడవ సంవత్సరమైన పరాభవ సంవత్సరంలో జన్మించెనని సాంప్రదాయమున్నది ఇతడు కేరళ దేశంలోని తిరువంజిక్కళమునకు రాజై యుండెను ఇతడు భక్తిరసపూరితమైన పెరుమాళ్ తిరుమొళిని రచించెను దీనికి పెరియ నాచ్చాంబిళ్ళ వ్యాఖ్యానమును వ్రాసెను.

## పెరియాళ్వారు

విష్ణుచిత్తుడను నామాంతరము గల యితడు కలియుగంలో నలభైయేడవ సంవత్సరములో జన్మించెనని సాంప్రదాయం ఉన్నది ఇతడు వాదములో అన్య మతములను ఓడించి వల్లభదేవుడను రాజును వైష్ణవునిగా చేసెను ఇతడు రచించిన తిరుప్పల్లాండు ప్రసిద్ధమైనది




## ఆండాళ్

భూదేవియే భూమియందు బాలికగా అవతరించి పెరియాళ్వారుకు దొరుకగా అతడు ఆమెను పెంచెను ఈమెకే గోదాదేవి అనే పేరు కూడా ఉన్నది సాక్షాత్తుగా రంగనాథుడే యీమెను పెండ్లి చేసికొనెనని సాంప్రదాయము ఉన్నది ఈమె రచించిన నాచ్చియార్ తిరుమొళి, తిరుప్పావైలలో తిరుప్పావై చాలా ప్రసిద్ధమైనది ఈమె చరిత్రయే ఆముక్తమాల్యద అను ఆంధ్ర ప్రబంధమున కథావస్తువు అయినది.

## తిరుప్పాణియాళ్వారు

ఇతడు శ్రీ వత్సాంశమున కలియుగంలో 163 వ సంవత్సరంలో భూమియందు ఉద్భవించగా ఒక పంచముడు పెంచెనని సాంప్రదాయం ఉన్నది రంగనాథుడు స్వయముగా యితనిని తీసుకొని రావలసినదని ఆజ్ఞాపించగా లోకసారంగముని యితనిని భుజములపై యెక్కించుకొని రంగనాథాలయమునకు తీసికొని వెళ్ళినట్లు ప్రతీతి ఉన్నది ఇతడు అమలనాది పిరాన్ అనే పది పాశురములు గల ప్రబంధమును రచించెను.

## తొండరడిప్పొడియాళ్వారు

ఇతడు వనమాలాంశమున కలియుగంలో 109 వ సంవత్సరంలో జన్మించెనని సాంప్రదాయం ఉన్నది ఇతనికి విప్రనారాయణుడను పేరు కూడా ఉంది దేవదేవి అను వేశ్యవలలో చిక్కినన్ను యితడు తుదకు రంగనాథునిచే రక్షింపబడెను. ఇతడు రచించినవి తిరుమాలై తిరుప్పళ్ళియెళుచ్చి.

## తిరుమంగైయాళ్వారు

ఇతడు శార్ఙ్గముయొక్క అంశవలన కలియుగములో 217 వ సంవత్సరంలో జన్మించెనని సాంప్రదాయం ఉన్నది. ఇతడు మొదట శైవుడే అయినా భార్యయొక్క ప్రోత్సాహమువలన వైష్ణవుడు అయ్యెను. ఇతడు 1351 పాశురములను రచించెను.

## నాథముని

ఇతడు గజముఖుని అంశవలన కలియుగంలో 3265 వ సంవత్సరంలో వీరనారాయణపురంలో జన్మించినట్లు సాంప్రదాయం ఉన్నది. ఇతనికి రంగనాథాచార్యుడనే పేరు కూడా ఉంది క్రీస్తుశకం పదవ శతాబ్దంలో యితడు జీవించినట్లు ఆధునిక చరిత్రకారుల అభిప్రాయం. ఇతనికి నమ్మాళ్వార్ ప్రత్యక్షమై తాను రచించిన పాశురములను ఉపదేశించినట్లు కథ కలదు విశిష్టాద్వైత సిద్ధాంతమును బోధించు న్యాయతత్త్వమను గ్రంథమును యితడు రచించెను

భగవద్గీతలోను, పాంచరాత్ర సిద్ధాంతములోను చెప్పబడినట్లు భగవంతుని శరణు పొందుటయే మోక్షమునకు మార్గమని యితని అభిప్రాయం ఇదియే వైష్ణవ సిద్ధాంతం దీనిని అనుసరించువారే శ్రీవైష్ణవులు. వీరు కర్మ సిద్ధాంతాన్ని అంగీకరించరు

## యామునాచార్యులు

విష్వక్సేనుని మంత్రి అయిన సింహముఖుని అంశవలన యితడు నాథముని కుమారుడైన యీశ్వరభట్టునకు కుమారుడై జన్మించెను చోళరాజా ఆస్థానమున గల పండితులను ఓడించి ఆళవందార్ అనే బిరుదును పొందినట్లు చెప్పబడుచున్నది సిద్ధిత్రయం ఆగమ ప్రామాణ్యం, గీతార్థసంగ్రహం, మహాపురుష నిర్ణయం, స్తోత్రరత్నం అను గ్రంథములను యితడు రచించెను. యామునాచార్యుడు లేకపోయినయెడల రామానుజాచార్యులుకూడ లేకపోయెడివాడని పెద్దలు చెప్పుదురు.

## రామానుజాచార్యులు

ఇతడు శేషుని అంశవలన కలియుగములో 4119 వ సంవత్సరమగు పింగళనామ సంవత్సర చైత్రశుద్ధ పంచమినాడు జన్మించెనని సాంప్ర

ప్రాయం ఉన్నది ఆధునికులు కూడ యీ కాల మును ఎ డి 1016—17గా అంగీకరించెదరు. ఇతడు మొదట యాదవ ప్రకాశుడను అద్వైతికి శిష్యుడై తరువాత వైష్ణవు డయ్యెను. ఇతడు యామునాచార్యులను దర్శించుటకు పోవునప్పటికి అతడు మరణించియుండెను కాని అతని చేతి వ్రేళ్లు మూడిటిని మడిచి యుంచెను ఆ మూడు వ్రేళ్లకు అర్థము (1) బ్రహ్మసూత్రములకు విశిష్టాద్వైత పరముగా భాష్యము వ్రాయవలెను (2) విష్ణు పురాణమును రచించిన పరాశరుని పేరును (3) వేదములను ద్రావిడముగ చేసిన నమ్మాళ్వారు పేరును శాశ్వతముగా ఉండునట్లు చేయవలయును అని రామానుజుడు గ్రహించి ఆ ప్రకారము చేసెనని కొందరు చెప్పుదురు. (1) నా పిమ్మట ఎవరైన వైష్ణవదీక్షను పట్టుదలగా జరుపుదురా ? (2) భాష్యములను వ్రాయవలయును (3) పరాశరుల పేరును శాశ్వతము చేయవలయును ఈ మూడును యామునాచార్యుల కోరిక అని మరికొందరి అభిప్రాయం

## వైష్ణవాచార్యులు

ఇతడు వేదాంతదీపం, వేదాంతసారం, వేదాంత సంగ్రహం, భగవద్గీతా భాష్యం, బ్రహ్మసూత్ర భాష్యం మొదలైనవి రచించెను ఇతని సిద్ధాంతము విశిష్టాద్వైతమని పిలువబడుచున్నది దీని ననుస రించి జీవుడు, జగత్తు, ఈశ్వరుడు వేరు వేరు ఈశ్వరుడే జగత్కారణము జగత్తుయొక్క సృష్టి స్థితి లయములు భగవంతుని వల్లనే కలుగుచున్నవి నారాయణుడే పరబ్రహ్మ జగత్సృష్టి కొరకు, వాసు దేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ రూపము లను పొందుచున్నాడు.

ఇతని అనంతరము ఈ మతము వడగలై, తెంగలై అను రెండు శాఖలుగ విడిపోయినది. ఇందులో తెంగలై శాఖ ఉదారమైనది వీరి అను చరులలో భట్టర్, మణవాళ మహాముని, వేదాంత దేశికులు మొదలైనవారు ముఖ్యులు




### మధ్వాచార్యులు

ఇతడు అచ్యుత ప్రేక్షాచార్యుని శిష్యుడు ఇతని రచనలలో బ్రహ్మసూత్ర భాష్యం, ఉపనిషద్భాష్యం, భారతతాత్పర్య నిర్ణయం ముఖ్యమైనవి ఇతని మతము ద్వైతమని పిలువబడుచున్నది ఈ మతము ననుసరించి జీవులు వేరు, ఈశ్వరుడు వేరు. జీవులు అజ్ఞానాదులచేత పీడింపబడుచున్నారు. ఈశ్వరునికి, జీవునికి గల సంబంధము ప్రభువు నకు, సేవకునకు ఉండు సంబంధము వంటిది. ఈశ్వరుని సేవించుటవలన మోక్షము పొంద వచ్చును. నారాయణుడే పరబ్రహ్మ ఇతడు శంక రుని మాయావాదమును తిరస్కరించెను

### నింబార్కుడు

ఇతడు బళ్లారిజిల్లాలోని నింబాపురంలో జన్మిం చిన ఆంధ్రుడు ఇతడు వేదాంత పారిజాత సౌరభ మను పేరుతో బ్రహ్మసూత్ర భాష్యమును, సిద్ధాంతరత్నమును రచించెను ఇతని మతము సనక సాంప్రదాయమని పిలువబడుచున్నది ఈ మతము చాలవరకు రామానుజుని మతమును పోలియుండును. గోపీ పరివృతుడైన రాధాకృష్ణునియందు అనురాగ పూరితమైన భక్తికి యిందు ప్రాధాన్య మీయ బడెను

### వల్లభాచార్యులు

ఇతడు కూడా ఆంధ్రుడు ఇతని సిద్ధాంతము పుష్టిమార్గమని పిలువబడుచున్నది ఇతడు తన పూర్వుడైన విష్ణుస్వామి చెప్పిన సిద్ధాంతమునే ఆమోదించి ప్రచారము చేసెను పరమాత్మ, తనకు తోడు ఎవ్వరును లేకపోవుటచే సంతృప్తిని పొంద లేదు అందుచే పరమాత్మ అనేకాకృతులు కాగోరి యీ ప్రపంచమును సృష్టించెను శ్రీకృష్ణుడే పరబ్రహ్మ పుష్టిమార్గము మొదట సదు ద్దేశములోనే ప్రతిపాదింపబడినది కాని తరువాత అనేక దురాచారములకు దారితీసినది.

### చైతన్యుడు

ఇతడు కూడ వల్లభాచార్యునివలె రాధాకృష్ణ భక్తికే ప్రాధాన్య మిచ్చెను ఇతడు వర్ణ వ్యవస్థను నిరాకరించి సర్వ మానవ సోదరత్వమును బోధించెను. పరబ్రహ్మయైన శ్రీకృష్ణుడే గోలోకమున రాధతో కూడి విహరించును భక్తుని ఉత్కృష్టమైన ప్రేమయే రాధ

కాలక్రమమున రాధయే శ్రీకృష్ణుని కంటె కూడ గొప్పదని భావించబడినది ఈ మతానుయాయు లైన పురుషులు కొందరు స్త్రీలవలె వస్త్రాభరణ ములను ధరించి ఘోషాలో ఉందురు ప్రతి మాస మును బహిష్టు అయినట్లు కూడా భావించెదరు. సర్వాత్మనా సఖిభావమును గ్రహించి కృష్ణుని పొందు టయే వారి ఆశయము క్రమముగా యిందులో అనేక దురాచారములు ప్రవేశించి నైతికపతనమున కు దారితీసినవి

రామానందుడు, కబీరు, తులసీదాసు, తుకారాము నామదేవుడు మొదలైనవారు వైష్ణవ మతమును వారివారి అభిప్రాయములను అనుసరించి బోధించిరి.

జరతుష్ట్ర మతములో బృహస్పతి గ్రామున అషి అనే పేరుతో విష్ణువుగా భావించెదరు. జైనులు తమ 63 శలాకా పురుషులలో వాసుదేవ బలదేవులను చేర్చిరి. మహావీరుని జన్మ వృత్తాంతము, కృష్ణజన్మ వృత్తాంతమునుండి గ్రహింప బడినదని, జైనుల 24 తీర్థంకరులే విష్ణువు యొక్క అవతారభావమునకు ఆధారమనీ కొందరి అభిప్రాయం. బుద్ధుని పాద చిహ్నలను పూజించ డానికి కారణం అంతకుముందు ఉన్న విష్ణుపద పూజనమే అయిఉండవచ్చును.

క్రీస్తే కృష్ణుడనిన్నీ, భక్తిమార్గం క్రైస్తవ మతం నుండియే గ్రహింపబడినదనీ మరికొందరి అభిప్రాయం. కాని ఇది సరియైనది కాదు కృష్ణుని కథలు క్రీస్తుకు పూర్వము నుంచి ప్రచారములో ఉండుట ఈ అభిప్రాయమును వ్యతిరేకించుచున్నది అభీరులు తమతో యీ దేశమునకు తెచ్చిన దేవతాబాలుని కథలే కృష్ణ బాల్య వృత్తాంతమునకు ఆధారమై ఉండవచ్చునను శ్రీ భండార్కర్ అభిప్రాయమును కొందరు చరిత్రకారులు అంగీకరించరు సరియైన ఆధారము లేక పోయినను మత సామరస్యము కొరకు ఉదార వాదులైన హిందువులు కొందరు కృష్ణుడే క్రీస్తు అని చెప్పెదరు. దానికి క్రైస్తవులు చెప్పే సమాధానం యిది

ఎ ఎం బాక్సు రచించిన "హిందూ మతము" (క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీ ఆఫ్ ఇండియా ప్రచురించినది) లో 119 వ పేజీలో యీవిధముగా చెప్పబడింది

కృష్ణునికిని, క్రీస్తునకును గల తారతమ్యములు— —హిందువులు పలుమారు కృష్ణుని క్రీస్తుతో పోల్చి వారిరువురును ఒకరేయని రుజువుపరుప జూతురు. కావున యీ విషయమును విమర్శించుటకు వీ యిద్దరు పురుషులను గూర్చిన ఈ క్రింది యంశములను చర్చింతము

(1) వీరి నామములు—కృష్ణుడు అనగా నల్లని వాడు లేక యాకర్షించువాడు. యేసుక్రీస్తు అనగా అభిషిక్తుడగు రక్షకుడు.

(2) వీరి జీవితచరిత్రలు—కృష్ణుని గురించిన కథలు భాగవత పురాణము దశమస్కంధమందు అనగా ప్రేమసాగరమందు గలవు. వీటిలో కొన్ని మిగుల అసహ్యకరమైనవి

ఇట్టి దుశ్చరితుడగు కృష్ణుడు ఎక్కడ ? పరిశుద్ధాత్మ ప్రభావముచేత నొక కన్యకకు జన్మించి కేవలము పాపరహితుడుగా జీవించిన యేసు ప్రభువు ఎక్కడ ? ఈ ప్రభువు సదా మేలు చేయుచును, రోగులను స్వస్థపరుచుచును, బీదలకు సహాయము చేయుచును, పరలోక పితను గూర్చియు, పాప క్షమాపణను గూర్చియు, నిత్య జీవమును గూర్చియు జనులకు బోధించుచును సంచారము చేయుచుండెను. చివరకు ఆయన జనులందరి రక్షణార్థము సిలువపై తన ప్రాణముల నర్పించి, మూడవదినమున మరల సజీవుడై లేచి పరలోకమునకు వెళ్ళిపోయెను

(3) వీరు చేసిన యుపదేశములు— భగవద్గీతలో కృష్ణుడు ఈ క్రింది విధమున బోధించుచున్నాడు. ఒకడు తన బంధువులను జంపుట పాపముకాదు. నిష్కామబుద్ధితో సనగా, కోరికలేకుండ నొక డెట్టి కార్యములు [illegible] కొనవు గనుక ఇట్టి భావముతో సకల కార్యములు చేయవలెను దీనినిబట్టి పాపపుణ్యములు సమానము లగునుకదా ! పాప క్షమాపణ, ఆత్మశుద్ధి యను వాటివలన గాక కృష్ణుని నామోచ్ఛారణము వలననే మోక్షము కలుగును. కృష్ణుడు సర్వం బ్రహ్మమయమను సిద్ధాంతము సత్యమే యని యొప్పుకొనెను నీతి విధుల నతిక్రమించినను, కుల ధర్మముల మాత్రము విడిచివేయకుండిన జాలును జ్ఞానమే ముక్తిసాధనము జ్ఞానమే సర్వ కల్మష రహితునిగను, పరమ పవిత్రునిగను జేయగలదు మరియు ఐదు సందర్భములలో అసత్య మాడ వచ్చునని బోధించెను

క్రీస్తు సర్వదా పరలోక పితను గూర్చియు, ఆయనకు పాపాత్ములందు గల ప్రేమను గూర్చియు, పాప పశ్చాత్తాపమును గూర్చియు, నూతన జన్మమును గూర్చియు, పాప క్షమాపణను గూర్చియు, పవిత్ర జీవితమును గూర్చియు, ప్రేమ, సేవ, త్యాగము అను వాటిని గూర్చియు, సిలువ మీద తన ప్రాణ మర్పించుట ద్వారా సకల మానవులకు రక్షణ కలుగుటను గూర్చియు బోధించెను

(4) వీరి గుణభేదములు—కృష్ణుడు దొంగిలించుట, అబద్ధమాడుట, వ్యభిచరించుట, హత్యచేయుట అను పాపములు చేసెను. "ఏ మానవుడును చేయలేని యిన్ని దుష్కార్యములు చేసిన కృష్ణుడు దేవుడు గాక మరియెవడు? అని యొక సామెత చెప్పుచున్నది దేవుని యిష్టానుసారముగ, మానవజీవిత విధానమెట్లుండవలెనో యది లోకమునకు జూపించిన యవతారపురుషుడు యేసుప్రభువు ఒక్కడే ఆయన సర్వకాలముల యందు, సంపూర్ణ సత్యసంధుడును, సంపూర్ణ పవిత్రుడును, సంపూర్ణ స్వార్థ పరిత్యాగియు, సంపూర్ణ ప్రేమగల వాడునై యుండెను. దేవుడెటువంటి గుణలక్షణములు గలవాడని మనము తెలిసికొనగోరిన యెడల ఆయన యేసు ప్రభువు వంటివాడని చెప్పుటకన్న మరియెక్కువ గానేమి చెప్పగలము?

(5) ఈ యిద్దరు వెట్టి యుద్దేశములతో నవతరించిరి— లోకమున ధర్మము క్షీణించినప్పుడు దుష్టులను నాశనజేసి ధర్మమును స్థాపించుటకు కృష్ణుడవతరించెనుగాని దుర్మార్గవర్తనులగు పాపాత్ములను వెదకి యనుగొని వారి పాప ప్రాయశ్చిత్తార్థము తన ప్రాణదానము చేసి వారిని రక్షించుటకే యేసుప్రభువు అవతరించెను.

క్రైస్తవులు తమ యేసుక్రీస్తు కన్యకే జన్మించినాడని యెంత దృఢముగ నమ్మెదరో హిందువులు కూడ తమ కృష్ణుడు దేవుడని అంత దృఢముగ విశ్వసించెదరు. అందుచే దీనిని విమర్శించుట అనవసరం.

ప్రపంచము యొక్క సృష్టి సంహారములు బ్రహ్మరుద్రుల కార్యములుకాగా రక్షణ విష్ణువు యొక్క కార్యమైనది. అందుచే విష్ణువు అనేకములైన అవతారములను దాల్చి లోకకంటకులను నశింపజేసి జగత్కల్యాణ కారకుడైనట్లు వర్ణించబడింది. అటువంటి విష్ణువు, ఒకేసారి అనేక విపత్కర పరిస్థితులను యెదుర్కొంటున్న భారతదేశమును అంతర్బాహ్య శత్రువులనుండి రక్షించుగాక ! ★


తం{ఢి నంది ట్రేడ్‌మార్కు NANDI పేటెన్ 245 రిజిష్టర్డు 1927
"నంది" ఆభరణములు
నంది గోల్డు కవరింగ్ వర్క్సు
చిలకలపూడి మచిలీపట్టణం 2. ఇండియా.

ఊరగాయపచ్చళ్లకు అమూల్యమైననూనెలు
అగ్‌మార్కు కాబడిన ఎ.యస్.బ్రాండ్ నాయపప్ప నూనె.
AGMARKED PURE GINGELLY OIL HUSKED A. SUBBANNA & Co SAMALKOT
అగ్‌మార్కు కాబడిన మేన్షన్ బ్రాండ్ నువ్వుల నూనె
MANSION GINGELLY OIL
★ మూకుడు మేస్తవుడనియవు.
★ బూజు పట్టనీయవు
★ చాల కాలము నిలువ యుండును
సీల్డుగయు నింపుదు
Mfrs: ఎ.సుబ్బన్న & కో. సామర్లకోట
ఆంధ్రప్రదేశ్ అన్ని ముఖ్య నగరాలలోను మా ఏజెంట్లు కలరు
మద్రాసు, బళ్లారి, హోస్పేటు, బరంపురం కటక్, ఖర్గపూర్ కలకత్తా జంషెడ్‌పూరు, సింద్రి ధన్‌బాద్ నాగపూరులలోనున్న మా ఏజెంట్లు కలరు

# సంపెంగాలూ సన్నజాజులూ

అవసరాల రామకృష్ణారావు

## జరిగిన కథ

మంజుల వివాహం అవుతుంది. సహృదయుం గల అన్న చెల్లెల్ని చదువుకోమని సలహా యిస్తాడు. ఆరేళ్ళు గడిచేప్పటికి బి. య్యే పట్టాతో బాటు వాలు కళ్ల మధురిమను కూడా పొందుతుంది మంజు. ఎం. ఏ. పరీక్షకు బలవంతంచేసి భర్తని ఒప్పిస్తుంది. కానీ ఆమె పాసవుతుంది, భర్త ఫెయిలవుతాడు. తనకు చదువు మీద శ్రద్ధ లేదని చెప్తాడు. మంజు అన్నయ్య సంసారం కుంటుపడుతుంది భర్తకు తెలీకుండా తన నగను అమ్మి అన్నయ్య అప్పును తీరుస్తుంది. అన్నయ్య సంసారంగురించి, ఆరోగ్యంగురించి తెలియకపోవడం వల్ల ఆందోళన పడుతుంది మంజు. అక్కడికి వెళ్ళిచూద్దామన్నా వీల్లేకపోతుంది భార్యా భర్తల మధ్య మనస్పర్థలు చెలరేగుతాయి ఎం ఏ. సెకండ్ క్లాస్‌లో పాసవుతుంది మంజు. హరిగోపాల్‌తోచేరిన మంజుల భర్త ప్రవర్తన రోజురోజుకీ విపరీతంగా తయారౌతూఉంటుంది అన్నయ్యకు ప్రమాదంగా ఉందని తెలిసి భర్తకి చెప్పకుండా ప్రయాణ మవుతుంది మంజు

## 19

ఆ మర్నాడు అన్నయ్యను సినిమాకు రమ్మని బల వంతపెట్టేము.

'ఇదేమిటే యిలా యిష్టంవచ్చినట్టు వీధిని కూడా పడితే నలుగురూ ఏమనుకుంటారు ? డాక్టరు ఒప్పుకోవద్దూ ?'

'నలుగురూ ఏమనుకుంటే మనకేం ? వాళ్లేమైనా ఆర్చాలా, తీర్చాలా ? ఇక డాక్టరుమీద నీకెంత గురుందో నాకు తెలుసు, ఆ‌ట్టే వాదించక బట్టలు వేసుకో'

'ఇలా నిత్యం కూచునే యీ మనిషిని సినిమా కెలాగమ్మా తీసికెళ్లడం ? ఆయాసంగాని ఎక్కువవుతుందేమో' అంది వదిన

'జాగర్తగా తీసికెడితే సరి' అన్నాను నేను.

'నువ్వు ఎం బి చదవక ఎం ఏ చదవడం రోగుల అదృష్టమనుకుంటాను లేకపోతే దేశంలో జనాభా సగానికి సగం ఎగిరిపోనేమో' అన్నాడు అన్నయ్య నేనూ, వదిన నవ్వేం—

తీరా తీసుకొచ్చానేగాని నాకు భయంగానే ఉంది. వాడూ, నేనూ ఒక రిక్షాలోనూ, వదినా పిల్లలూ ఒక రిక్షాలోనూ కూచుని బయలుదేరేం ఇన్నాళ్లకు యిలా సంతోషంగా బయలుదేరడం మాకు పండుగ చేసుకున్నట్టుంది అన్నయ్యను కుడిచేత్తో గట్టిగా పట్టుకుని రిక్షా దిగేక అతి నెమ్మదిగా హాలులోకి నడిపించాను. వాడికి ఒక పక్క నేనూ, నాపక్క వదినా, రెండవపక్క పిల్లలూ కూచున్నారు. వదిన నా రెండు చేతులూ దగ్గరగా తీసుకుని అంది,

'ఈయన జబ్బులోపడి లోకాన్నే మరిచి పోయాను. ఇలా వీధి మొహం చూడగలుగుతానని కలలో కూడా అనుకోలేదు. మళ్లీ వచ్చి మా పట్టింట్లో దీపం వెలిగించావ్ మంజూ.'

'మధ్యని నేనేం చేశాను ? ఇన్నాళ్లకయినా రోగం తగ్గించుకుందామని వాడికి మనస్సు ఉద్దేశం కలిగింది ఇక భగవంతుడు సాయం చెయ్యాలి'

'ఆయన పాదాలు చూశావా ?' అంది వదిన నెమ్మదిగా

'ఏం ?' అన్నాను ఆతృతగా

'కొంచెం వాచినట్టున్నాయి చూడు ఇదివరకు ఇంకా ఎత్తుగా ఉండేవి ఇప్పుడు చాలా నయం ఇలా నొక్కితే లొత్తపడుతుంది దాన్ని 'డ్రాప్సీ' అంటారుట, డాక్టరు చెప్పేడు అలా ఉండడం గుండెకి మంచిదికాదుట ఏమో భగవంతుడా, ఇది పూర్తిగా ఎప్పుడూ తగ్గిస్తావో మళ్లీ మనుష్యుల్లో ఎప్పుడు పడేస్తావో'

ఇంటికి వచ్చాక అన్నయ్య నడిగాను.

'ఎలా ఉందిరా అన్నా సినిమా ?' వాడు పొడిగా నిరాశగా నవ్వేడు

'మీరు చూస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు నేను చూడకుండా మీ కబుర్లు వింటున్నాను అంతే తేడా'

'చూడకపోవడం ఏమిటి ? నిద్రా ?'

'అదే, యోగనిద్ర !' వాడి నవ్వు చూసి నాకు భయం వేసింది

'ఏమిట్రా అదీ, సరిగ్గా చెప్పవా ?'

'చెప్తాను మరేం కంగారుపడకు లోకంలో గుడ్డివాళ్లు ఎంతమంది లేరు ? వాళ్లతోపాటు మీ అన్నయ్య కూడా ఒకడు ! నిజం చెప్పాలంటే నాకు సినిమా కనిపించింది చాలా తక్కువ అక్షరాలే కాదు, మొహాలు కూడా అలుక్కుపోయినట్టు కనిపించాయి నా దృష్టి బాగా దెబ్బతిన్నట్టుందమ్మా, మంజూ !'

'అయ్యయ్యో ఎంతపని జరిగింది ! సినిమా మొదట్లోనే నీకలా అనిపిస్తే వెంటనే ఎందుకు చెప్పలేదు ? అలా బాధపడుతూ అంత సేపూ ఎలా కూచున్నావ్ ?'

'అవతల మీ ధోరణిలో మీరున్నారు పిల్లలేమో సినిమాలో లీనమైపోయారు నాతోపాటు ఏవిధమైన సుఖానికీ నోచుకోనివా రయారు మీరు ఆ కాస్సేపయినా ఆనందించనీ అని పూరుకున్నాను!'

పైకి వినబడకుండా నోట్లో గుడ్డ కుక్కుకుని పక్కగదిలో ఏడుస్తోంది వదిన. నా కళ్ల నీళ్ళు బలవంతాన తుడుచుకుని—

'నీ కేమయినా మతి పోయిందా ఏమిటి వదినా ? ఏమయిందని యిప్పుడీ ఏడుపు ? తప్పు ... పూరుకుంటావా, పూరుకోవా ?' అన్నాను.

'నలుగురు స్నేహితులతో పిచ్చాపాటీ చెప్పుకుని పొద్దుపుచ్చే రకం కాదు ఆయన అస్తమానూ చేతిలో ఏదో ఒక పుస్తకం ఉంటూనే ఉంటుంది. రోజుకి ఆయన ఎన్ని గంటలుసేపు చదువుతారో లెక్కపెట్టలేము అందులో ఈమధ్య రోగం వచ్చి బొత్తిగా ఇల్లు కదలడానికి వీల్లేకపోయాక ఆ పుస్తకాలే ఆయనకి ప్రపంచంగా ఉంటోంది. అవి చదువుకోడానికి వీల్లేకుండా దృష్టి జ్ఞానమే లోపిస్తే యింక ఆయన కెలా పొద్దుపోతుంది ? బతుకేముంది ? ఇక ఆయనకేం మిగిలింది ? ఆయనతోపాటు నాకేం మిగిలింది ? భగవంతుడా, ఎప్పుడు ఏం పాపాలు చేశాం, ఎందుకు మమ్మల్నింకా యిలా పరీక్షిస్తున్నావ్ ?'

'వదినా, ఏమిటీ గోల ? అవతల అన్నయ్య వింటాడన్న జ్ఞానమైనా నీకు లేకపోయిందా ? వాడి జబ్బు తగ్గించే పద్ధతి యిదేనా ? వాడి కళ్లు దెబ్బతిన్నాయని యిప్పుడే మనకి తెలిసిందా ? మసక మసకలుగా ఉన్నాయని వా డన్నాడని నువ్వు నాతో చెప్పలేదా ? ఒకవేళ దృష్టి దెబ్బతిన్న పక్షంలో దానికి మందే లేదా ? కళ్లు పరీక్ష చేయించి తగిన కళ్లజోడు పెడితే మళ్లీ మామూలుగా చూడలేడా ? ఎందు కనవసరంగా ఉద్రేక పడతావు ?'

'ఏమోనమ్మా మంజూ కొద్దిగా ఆశ పడ్డాను పూర్తిగా దెబ్బతిన్నాను నువ్వెన్ని చెప్పినా నాకేమాత్రమూ ధైర్యం కలగడంలేదు'

వదిన అనుకున్నది నిజమే మర్నాడు 'ఐ స్పెషలిస్టు' ని పిలిచి పరీక్ష చెయించాము. బ్లడ్ ప్రెషరు బాగా ఎక్కువవడం చేత కంటి దృష్టి దెబ్బతిన్నదనీ, ఇది మామూలు రకం దృష్టిలోపం కాదు కనుక సులోచనాలు ఉపయోగిస్తే లాభం ఏమీ లేదని స్పష్టంగా చెప్పేశారు. చివరి ఆశతో నేను ఆయన్ని వెంబడించాను

'డాక్టరుగారూ, డాక్టరుగారూ దృష్టి జ్ఞానం దెబ్బతిన్న దన్నారు, సరే కళ్లజోడు పెట్టుకుని లాభంలేదన్నారు, సరే తిరిగి మామూలుగా దృష్టి వచ్చే అవకాశమే లేదా ?'

'చెప్పలేమండీ కరుణాకరంగారూ !' అన్నాడాయన సదాశివరావుగారివల్ల వ్యాధి తగ్గుదల కనిపించకపోతే ఈయన్ని ఈమధ్యే మార్చారుట. ఈయన మా కుటుంబాన్ని బాగా ఎరుగునట కూడా.

ఐ స్పెషలిస్టు వెళ్లిపోయాక ఆయన నాతో అన్నారు.

'ఇన్ని కాంప్లికేషన్సు చుట్టబెట్టిన మనిషికి ఈ మాత్రపు దృష్టి యింకా మిగిలి ఉండటమే త్రం కాదటమ్మా ?'

'ఏం కాంప్లికేషన్సు ? నాకేం భయంలేదు. దాచక ప్పండి ప్లీజ్.'

'డైజెషన్ చెడింది లివర్ పాడయింది. హార్ట్ ఎన్‌లార్జ్‌మెంటుంది డ్రాప్సీ ఉంది యూరిన్‌లో ల్బ్యుమిన్ ఉంది. ఇన్ని చెడులక్షణాలు ఉండగా న్నితమ్మైన కంటి రక్తనాళాలు మారిపోడంలో శ్చర్య మేముంది ?'

'అయితే మా అన్నయ్య యిక మామూలుగా చూడలేడంటారా ?'

'ఈమాత్రం చూపు మిగిలిఉంటే అదే దృష్టం అని చెబుతున్నా కాదుటమ్మా ?'

'అయితే రోగం మాట ? అదింక తగ్గ ంటారా ? మరోరకం మందు మార్చిస్తే గుణ మీ కనపడదంటారా ?'

'ప్రయత్నిస్తాను తల్లీ .... నాకు చేతనయి ంతా చేస్తాను ఆపైన భగవంతుడున్నాడు న్నీ బాగా ఆలోచించి సాయంకాలానికి మరో ర్పు మార్చి పంపుతాను. ఈ మందులతో బ్లడ్ షరు దారిలో కొచ్చిందా, తక్కినవన్నీ మబ్బు డిపోయినట్టు విడిపోతాయి.'

నేను లోపలికి వెళ్ళాంటే అన్నయ్య నవ్వుతూ అడిగాడు.

'ఏమే, నేను ధృతరాష్ట్రుడినా, శుక్రాచారినా? ఏమన్నాడు డాక్టరు ?'

'సమదృష్టిలేని ధృతరాష్ట్రుడితో నీకెలా పోలిక కుదురుతుంది ? దూరదృష్టిలేక దృష్టి దూరం చేసుకున్న శుక్రాచారితో నీకు పోటి దేనికి ? ఇంతకీ నీకు వచ్చిన లోపం ఏమిటని ? ఒక్క వారంరోజులపాటు చెప్పినట్టు విని మందు పుచ్చుకుంటే అంతా రైటయిపోతుందిట.'

'వారం రోజులమాట నాకు తెలీదుగాని పిలిచి నంత తొందర్లో అంతా రైటయిపోయే మాట మాత్రం నిజం'

నేను అన్నయ్యనోరు మూశాను. వదినతో కూడా డాక్టరు ప్రోత్సాహకరంగానే మాట్లాడేడని చెప్పేను. అన్నయ్యతోపాటు వదినకూడా నామాట ఏమీ నమ్మినట్టు కనపడదు

ఆ తరువాత మా అన్నగారింట్లో నేను గడిపిన రోజుల కార్యక్రమం ఏవిధంగానూ మరిచిపోలేనిది వెల్లకిలా పడుకోలేక మా అన్నయ్య రాత్రి తెల్లవార్లూ పడక కుర్చీలోనే గడిపేవాడు ఆ క్రిందని చాపలు వేసుకుని నేనూ వదినా పడుకునేవాళ్లం. అప్పుడు పడి వేసవికాలం. ఎండలు ఎక్కువగా ఉండేవికాని దాని ధర్మమా అని గాడ్పులు మాత్రం ఉండేవికావు. రాత్రి మాత్రం చాలా ఉక్కగా ఉండేది. మా అన్నయ్య వాళ్ళున్న యింట్లో కరెంటు లేదు ఆయాసంతో బాధపడుతున్న అన్నయ్యకు గాలిలేక అసలే వూపిరాడేదికాదు. అలా ఒకరి తరువాత మరొకళ్ళం ఆపకుండా విసురుతూ కూచునేవాళ్ళం మాకు తోడు అన్నన్న ఒకడూ. నాన్నగారి కాలంనుంచి ఇంటిని వదలని నౌకరు వాడు 'ఆరు నాకు నేసిన సాయంతో ఇదెన్నో వొంతు బుల్లెమ్మాయిగోరూ !' అని పిమ్మనా పోకుండా రాత్రి అయేసరికి పెద్దపడి పోయేవాడు. 'ఎప్పుడే ఆవసరమొస్తాదో.... రోగం యవ్వారం మాస్తే ఫోర్సుగా ఉన్నట్టుంది. తొత్తిగా అ నేనాలు. మొగదిక్కు లేకుండా తవరేటి సెయ్య గలరు బుల్లెమ్మాయిగోరూ !' అనేవాడు. పిల్లల కూడా 'మేమూ చేస్తాం' అని మాతో తయా రయేవారు ఆడి ఆడి వస్తారేమో, వేడి వేడి అన్న బొజ్జలో పడగానే ఇక వాళ్ళు మా లోకంలో ఉండే వారు కారు నిజానికి ఏ రోగానికయినా రాత్రి వేళే ఉధృతం ఎక్కువ ఏమరకుండా ఉండవ సింది అప్పుడే కన్నులు అలిసిపోయి రెప్ప వాలే నేదీ అప్పుడే అందుకనే వంతులు వేసుకు ఒకళ్ళ తర్వాత ఒకరు కూర్చునేవారం. ఏ పన్నె



మళ్లీ మూడు గంటలకు లేపు' అని చెబితే తెల్ల వారేదాకా గాలి తీసేదికాదు ఎంతో దెబ్బలాడిన మీదట చెప్పినట్లు లేపడానికి ఒప్పుకునేది ఆ భయంకరమైన నిశ్శబ్దమైన దీర్ఘమైన ఆ రాత్రులలో అన్నయ్య చేసే విషాద వివేకాలు మేళవించిన సంభాషణలు హృదయాంతరాళాలను కదిలించివేసేవి

'ఏనాడో నా ప్రాణం పోతుందనుకొన్నాను ఇంకా రోజులకి రోజులు యిలా బతికేస్తూండడం నాకే చిత్రంగా ఉంది పళ్లరసాలూ, మందులూ ఆహారసారాలూ వీటితోబాటు మీరు ఆయుర్దాయమో అమృతమో కూడా నా నోటిలో పోస్తున్నారేమో !'

'ఇక్కడ తిష్టవేసి నువ్వింక కదలవే ఏమిటే మంజూ ! అన్నయ్య సేవలో అన్నీ వదులుకో దల్చుకున్నావా ఏమిటే నువ్వు ! అతని మంచితనాన్ని నువ్వు ఉపయోగించదలచిన తీరు యిదేనా తల్లీ ? నేనేదో అయిపోతానేమో అని మీ కందరికీ యింతింత భయాలు దేనికర్రా ? పుట్టిన మనుషు లందరూ ఏమౌతున్నారు ? ఎక్కడికెడుతున్నారు ? అదేదో నన్ను కూడా చూడనియ్యండి మరి—నాకు మాత్రం సరదాగా ఉండదా ఏమిటి ?'

'నన్నేదో మోసం చెద్దామని నవ్వుతున్నావుగాని మంగళా, నీలో సంతోషం నిండుకుందనీ, నిండు కుండలాంటి నీవంటిదాని కంటినిండా కూడా నీళ్లున్నాయనీ, నేను గ్రహించలే నంటావా? పిచ్చిదానా ఎందుకంత దుఃఖం ? నేను చచ్చిపోను బాధలు భరించలేక ఏదో వెర్రిగా వాగుతుంటాను గాని నాకు జీవితంమీద భ్రమ పోయిందంటావా, లేదే ? సుందరస్వరూపుడైన భగవంతుడు సృష్టించిన ఈ అందమైన ప్రపంచం లోంచి ఏ మందభాగ్యుడికీ మాత్రం వెళ్లిపోవాలనుంటుంది ! అనురక్తీ, ఆసక్తీ ఇంకా నాలో చావలేదు అవి చస్తేగాని అది చావేకాదు నేను బతికే ఉన్నాను బతికే ఉంటాను కూడా మృత్యువుతో యుద్ధం చేస్తున్నాను ప్రస్తుతం వోడిపోతానేమో ననే అధైర్యం నా కెప్పుడూ లేదు నాలాంటి మొండి ప్రాణాన్ని ఎవడూ తీసెయ్యలేడు కూడా ఎంత తెగించినవాణ్ణీ కాకపోతే యిన్నిన్ని హార్ట్ ఎటాక్సు వచ్చినా ఎలా నిగ్రహించుకొచ్చాను యిప్పట్లో ఈ ప్రాణానికి ఢోకాలేదు. మరేం బెంగెట్టుకోకండి'

'మంజూ నా తల్లీ యిలా రావమ్మా ! సీతలతడమనీ ! ఎంత చిక్కిపోయావే నువ్వు ! ఇందుకేనుటే నిన్ను ఇంతదాన్ని చేసింది ? ఉన్నవాళ్ళ మాట అటుంచి రేపొద్దుట నీ కూతురికి ఏం జవాబు చెప్పుకోనే ? ఎన్నివిధాల నీదగ్గర దాచుదామన్నా నా రోగం నీ ముందు బయటపడిపోయింది గదే ! నాలుగుపేటల నిండైన నగని నీ అన్నపాలు చేశావు, అది చాలదా, నీ అయిదు ప్రాణాల నిండు బ్రతుకునీ నాకు బలియిద్దామని వచ్చావా చెల్లెమ్మా ?'

'అప్పన్నా .... ఉన్నవాళ్లు చాలక నువ్వెక్కడ కొట్టుకొచ్చావురా. రాత్రీ, పగలూ యిక్కడ కని పెట్టుకు కూర్చోడానికి నేను నీ కెవర్నిరా ? నీకేం పిల్లా పాపా లేరట్రా ? పనీపాటా లేదట్రా ? ఆ పడే కునికిపాట్లేవో యింటిదగ్గరే పడకూడదూ ?'

'రోగికి సేవ చేద్దామని మీ రందరూ నా చుట్టూ చేరేరు నిద్రాహారాలు మానేసి నాకు చేస్తున్నారు. మీ రందరూ రోగులయిపోయే టట్టున్నారు, మీకెవరు చేస్తారు ?'

ఒంట్లో శక్తి తగ్గి కంట్లో దృష్టి తగ్గి ఆ శక్తులన్నీ అన్నయ్య నాలుకలో చేరిపోయాయేమో ఇంక ఆ కబుర్లకీ ఆ విసుర్లకీ అంతూ దరీ ఉండేదికాదు పైకి వినపడకూడని బాధని అనుభవిస్తూ అలా యాంత్రికంగా పనులు చేసుకుంటూ పోయేవాళ్లం. తీరని వ్యథ అనుభవిస్తున్న అన్నయ్య రాత్రి అంతా కలిపి ఏ గంటో నిద్రపోయేవాడేమో. అంతే మిగిలిన వేళంతా సరిగా కనపడని కళ్లతో అలా శూన్యమైపోతుందేమో నన్న తన బ్రతుకులోకీ, చివర లేదేమోనన్న చీకటి లోకీ చూస్తూ కూచునేవాడు. రాత్రివేళ గడ మటుకు తను ఉత్సాహంగానూ, చూసే వారికి ఆశాజనకంగానూ కనిపించేవాడు.

ముఖ్యంగా పిల్లల్ని కూచోపెట్టుకుని కబుర్లు చెబుతున్నప్పుడు కొత్తగా చూసినవారికి 'నిజంగా ఈమనిషికేనా రోగం !' అనిపించేది 'ఏమర్రా, మీకు నేనో కథ చెప్పనా ? అనగనగా ఓ రాణిట. ఆవిడకేమో ఏడుగురు కూతుళ్లట ఏడుగురు కూతుళ్లూ ఆట కెళ్లేరుట ఏడు బంతులు తెచ్చారుట. ఆరు బంతులు తిరిగి వచ్చాయిట ఏడోది రాలేదుట'

'ఓస్, ఈ కథ ఎవడికి తెలీదూ ?' అనేది మా మధురిమ అందరూ ఎరిగిన కథలు యిలా మార్చి మార్చి చెప్పడం అన్నయ్యకో సరదా వాళ్ల సీతకి చిన్న ఎలకతోక లాంటి జడ ఉండేదిగాని మా మధురిమకు పెద్ద జడే ఉండేది. దానిని కూచోపెట్టుకుని దానికి మూడో అయిదో ఎప్పుడూ బేసి సంఖ్యని జడలు వెయ్యడం మా అన్నయ్యకు మరో సరదా ! ఒక్క నిముషమైనా నిరుపయోగంగా గడపకుండా ఏ సత్కాలక్షేపం లోనో, గ్రంథపఠనంలోనో మునిగిఉండే మా అన్నయ్య కళ్లు సరిగా కనపడక, కాలం గడిచే దారి కనపడక చేసే వెర్రి మొర్రి పనులకి కళ్లలో నీరు వచ్చేదాకా నవ్వుకోనా ? ఇక కన్నీరు మిగల నంతగా ఏడ్చుకోనా ?

ముసిముసి నవ్వుల వసువు పూతలూ, కన్నుల వెలుగుల తోరణాలూ రాజ్యంచేసే శుభ్రపదమైన ఆ యిల్లు చూస్తే రాగద్వేషాతీతుడైన ఆ భగవంతుడికే కన్ను కుట్టిందేమో ! ఒకప్పుడు వాళ్లకు ఏ లోటూ ఉండేదికాదు ఎవర్నీ ఏమీ యాచించి ఎరుగరు పొందికగల భార్యాభర్తలు బుద్ధిమంతులైన యిద్దరు పిల్లలు చల్లగా సాగుతున్న సంసారం చివరికీ స్థితికి వచ్చిందా అనిపించింది. పెద్దపెద్ద రోగాలు వచ్చి పడిపోతే ఏం నిలబడతాయి మధ్యరకం సంసారాలు ? మామూలు జ్వరంలాంటిది వచ్చి వో అయిదారు లంకణాలు చేసి పత్యం పుచ్చుకోడం ఎక్కడైనా ఉంది నెలల తరబడి పీల్చి పిప్పిచేసేస్తూంటే ఎవరు మటుకు నిలబడగలరు ?

వదిన ఒంటిని ఎప్పుడూ ఎక్కువగా నగలు లేవు ఉన్న ఒక్క గొలుసూ ఏనాడో తాకట్టుకు వెళ్లింది ఇక మిగిలినవల్లా చేతులకు రెండేసి జతల గాజులు నెలల తరబడి అన్నయ్యకు జీతం కూడా రావడంలేదు ఇంక సంసారం నడిచే దెలా ? దేశంమీద రోగం కాదాయె మామూలు ఖర్చులు పెట్టుకుంటూ ఖరీదైన ఇంగ్లీషుమందులు కూడా కొనడానికి ఎంత సొమ్మని చాలుతుంది ? ఒక్కొక్క గాజూ తీసి అమ్మేసింది

ఒకనాడు కిటికీ దగ్గరికి వచ్చి ఏదో వినపడి ఆగిపోయాను 'సీతా ! నా బంగారుతల్లివిగదూ ! నాన్న జబ్బు తగ్గిపోయాక నీకు కావలసినన్ని నగలు చేయిస్తారుగా ! వాళ్ల రాధారాణికున్న జూకాలు కూడా చేయిస్తారుగా ! మా అమ్మవి కదూ, యిచ్చెయ్యమ్మా' సీత చేతినున్న గాజులు ఒకటీ ఒకటీ వదిన మంచిమాటలాడి తీసేస్తోంది. ఓపట్టాన అది ఒప్పుకోలేదు అది గట్టిగా పేచీ పెట్టినా ఏడ్చి సాధించినా నేనంత బాధపడేదాన్ని కాదు. మారు మాటాడకుండా సీత గాజుల



"మనం ఇంట్లోలేనప్పుడు ఎవడో నాకోసం వచ్చేడులాగుంది..."

యిచ్చేసింది వదిన వెళ్ళిపోగానే దాని దుఃఖం ఆగ లేదు ఒక్కమారు బావురుమంది!

నేను నా వస్తువుల్ని చూసుకున్నాను. చేతికి నాలుగు జతల గాజులూ, మెళ్ళో ఒంటి గొలుసూ చెవుల్ని ఖరీదైన దుద్దులూ యింకా ఉన్నాయి ఆ పరిస్థితుల్లో వాటిని మనస్సు అస హ్యించుకున్నాను. మంచి కంటె మంచి వస్తువ ఏముంది? మానవత్వం కన్న వెలగల నగ ఏముంది? అవి లేనప్పుడు ఈ ఆభరణాల మూల్యం ఎంత?

కాని, వాళ్ళకి నేనేం చెయ్యగలను? ఒక్క గొలుసు స్వతంత్రించి అమ్మినందుకు నేను వాళ్ళకు చేసిన సహాయం చాలు నామటుకు నేను కొని తెచ్చుకున్న సుఖమూ చాలు అయినా వదిన వస్తు వూచిక పుల్లయినా చూసి చూసి అమ్మనిస్తుందా? ఆ సంగతి అతి తెలివిగల అన్నయ్య ముందు దాచడం మాత్రం అంత తేలికైన పనా? నోట్లో థర్మామీటరు పెట్టి యివతలికి తీసి చూస్తూంటే కళ్ళ కదలికల్ని బట్టి ఎంతుందో ఊహించగలడు భుజానికి పొరల గుడ్డ చుట్టబెట్టి బ్లడ్ ప్రెషర్ రీడ్ చేస్తూంటే హెచ్చుగా ఉందో, తక్కువగా ఉందో మొహంలోని నీడల్నిబట్టి చెప్పెయ్యగలడు అలాంటివాడి దగ్గిర ఏది మాత్రం దాచగలం?

'ఎందుకమ్మా సీతా ఏడుస్తున్నావ్? ఇలారాతల్లీ!'

'ఏముంది ముకుందంగాడు దాన్నికొట్టాడు'

'నువ్వేనా చెబుతున్నది కలియుగ మాంటె క్రిస్టో?' నేను ఎక్కువగా అబద్ధాలు చెబు తున్నానని అన్నయ్య నాకీమధ్య ఈ పేరు ప్రసా దించాడు!

వచ్చేటప్పుడు తెలివిగా పర్సులో డబ్బయి అయిదు రూపాయలు పెట్టుకున్నాను వద్దన్నా వినకుండా సరళ ఓ పాతిక యిచ్చింది 'ఎందు కైనా ఉంటాయి ఉంచక్కా, పిలునిబట్టి తీర్చెయ్యి వచ్చుతే' అంటూ ఆ పందా తెచ్చేను కాబట్టి కొన్ని ఖర్చులైనా పెట్టగలుగుతున్నాను, గాని లేక పోతే?

పాపం అన్నమూ పక్కింటి నిర్మల అడుగు తూండేది. అన్నయ్య ఎలా ఉన్నాడని సరళ వారా నికి రెండుత్తరాలైనా రాసేది కాని, నేను ఆశిం చిన చోటునుండి మాత్రం నాకు జాబు వచ్చేది కాదు ఇంట్లో పని సహాయం చెయ్యడంలో, అన్నయ్యకు సేవ చెయ్యడంలో శరీరమైతే నిమ గ్నమై ఉండేదిగాని మనస్సెప్పుడూ అదే ఆలో చిస్తూ ఉండేది 'ఒక్కరూ ఎలా గడుపుతున్నారో పాపం భోజనం సరిపడుతుందో లేదో' అనుకునే దాన్ని మరుక్షణం 'నే నిలా ఒక్కర్తినీ బాధపడు తున్నాను, ఈ బాధలో పాలు పంచుకుంటే ఎంత బాగుణ్ను! నాలుగు రోజులు శెలవుపెట్టి యిక్క డికి వస్తే ఎంత సంతోషిద్దును! పోనీ ఒక్క గంటయినా వచ్చి చూసి వెడితే నా కెంత సాంత్వన చిక్కును!' అని ఆయనమీద కోపంతో తిరగబడేదాన్ని

కాళ్లకు నీరు పట్టడం ఎక్కువైనకొద్దీ అన్న య్యకు మరింతగా చూపు దెబ్బతింది కొన్ని కొన్ని మన పేపర్లూ పుస్తకాలూ అందులో అచ్చు తప్పులూ, తప్పు అచ్చులూ చూస్తే మామూలి వాళ్ళ దృష్టే చెదురుతుంది అలాంటిది రోజు రోజుకీ దిగజారుతున్న ఆరోగ్యం గల అన్న వెర్రి చూపులు ఆ దండకారణ్యాలలో దారి ఎక్కడ వెతకగలవు కనుక! ఒకనాడు నాకే హఠాత్తుగా తోచింది. ఇన్నాళ్ళూ నేనే గుడ్డిదాన్నిఅయిపోయా నేమో! వాడికి దృష్టి లేకపోవచ్చు. నాకు ఉందిగా అన్నయ్యకు కాలక్షేపం ఆయేందుకు నే నెందుకు చదివి వినిపించకూడదు? ఆరోజుమొదలు ఎక్క డెక్కడి పత్రికలూ చదివి అన్నయ్యకు వినిపించే దాన్ని. శరీరం అంటే మొహం ఒక్కటే కానట్టు సాహిత్యం అంటే సెక్సు ఒక్కటే కాదుగా? దేశ దేశాల వారాంగనల వార్తలు ప్రకటించేంతగా దిగజారిపోయిన పత్రికలు చదివి వినిపిస్తూంటే చికాకుతో అన్నయ్య నొసట ముడతలు పడేవి. 'మృష్టాన్నంతోగాని తృప్తిపడని నా మనసు మృగ తృష్ణ సదృశమైన ఈ తేలిక కథలు విని ఆనందించ లేదే! మరోసారి ఆలోచించ నేర్పేవి, మనోవికాసా నికి తోడ్పడేవి, మనోవ్యధను మరపించేవీ అలాంటి వేవైనా ఉంటే తెచ్చి చదువు తల్లీ!' అవి ఏవని చెప్పేది! ఎక్కడ తెచ్చేది? మంచి గ్రంథాన్ని వెతికి తేవడం మంచి సంబంధాన్ని వెతకడంకన్న కష్టం. అప్పటికీ నిర్మలా వాళ్ల బావ లైబ్రేరియను కాబట్టి—పాపం ఎప్పటి కప్పుడు కొత్త కొత్త పుస్తకాలు తెచ్చి పడేసే వాడు. చాలావరకు అన్నయ్య చదివేసినవే ఇష్ట మైనవిమాత్రం మళ్లీ మళ్లీ చదివించుకుని వినే వాడు. తీరని ఆలోచనలతో ఆ కని కనపడని కళ్లలో భారమైన భావమేదో గోచరించేది

ఓసారి డాస్టొవిస్కీ రాసిన 'క్రైం అండ్ పనిష్మెంటు' చదివి వినిపిస్తూండగా డాక్టరు కరుణాకరంగారు వచ్చినన్ను దెబ్బలాడేరు

'అసలే అది సర్వ సామాన్యమైన జబ్బుకాదు. దానిపైన బ్రహ్మాండమైన రోగం ఇది చాల కనా తల్లీ నువ్వు రోజుకో పుస్తకం చదివి విని పిస్తూంట? ఈ రక్తపుపోటు రోగులకు ముఖ్యంగా మానసిక విశ్రాంతి అవసరం అని ఎన్నిసార్లు నీకు చెప్పాను? ఈ రోగానికున్న మరొక దారుణమైన లక్షణం ఏమిటీ అంటే ఏమాత్రం నిద్రపట్టినా భయంకరమైన కలలు రావడం అయున్ని మామూలు ఆలోచనలో ఉంచడమే తప్పు. అలాంటిది చలనా నానికీ, స్పందనకీ దారితీసే ఈ బృహత్ గ్రంథా లెందుకమ్మా చదివి వినిపిస్తావ్?'

దుర్బలుడైపోయిన అన్నయ్య ఇంక పూరుకో లేకపోయాడు 'ఏ పనీ చెయ్యలేను! ఏదీ చదవలేను! ఎవరూ చదివి వినిపించనూ కూడదా? నిశిత మైన బుద్ధీ, పదునైన ఆలోచనా మరి నా కెందు కిచ్చావ్? అవి ముందు తీసేసి తరువాత రోగాలు కలుగజెయ్యకపోయావా? ఇంక ఎలా గడపను? నా బాధలన్నీ దేన్ని చూసి మరువను? ఓయి భగవంతుడా ఇలా ఎంకెన్నాళ్లు బతకను!' అన్నయ్య నిలువెల్లా కంపించిపోయాడు రెండు చేతులతోనూ తల బాదేసుకున్నాడు హాహారున ఏడ్చేశాడు వెర్రెత్తినట్టు అరిచేశాడు! మేమందరం చూస్తూ కూడా ఏమీ చెయ్యలేకపోయాం రోజుల తర బడి మేము చేసిందంతా వృధా అయిపోయింది మరింత తీవ్రంగా హార్ట్ ఎటాక్ వచ్చేసింది!

అది తగ్గుతుందనిగాని అన్నయ్య మళ్ళీ మాతో కలుస్తాడనిగాని నేను జన్మలో అనుకోలేదు ఎటాక్ అన్నది ఎలా ఉంటుందో అదే నేను మొదటిసారి చూడడం అన్నయ్యమాట అలా ఉంచి నన్ను పట్టుకోడం కష్టమైపోయింది ఇంట్లో వాళ్లకి! అంత బాధ అన్నయ్య అన్నిసార్లు ఎలా భరించాడో, ఒంటరి రాత్రులలో వదిన నాటి వెలా భరించిందో ఆ సర్వాంతర్యామే సాక్షి. (సశేషం)


ఫోన్ 243
శారదా (రిజిష్టరు)
ఆభరణములు
బంగారురేకు కవరింగు చేయబడినవి!
శారదాగోల్డుకవరింగ్‌వర్క్సు (REGD)
చిలకలపూడి పోస్టు మచిలీపట్నం (ఆంధ్ర)



క్రమంతప్పక వాడండి
నీమ్
టూత్‌పేస్ట్
ఆధునిక టూత్ పేస్టులో వాడబడు అవసరమైన ఔషధము లన్నింటితో కలసి, వేపలోని శక్తివంతమైన భాగములన్నియు పొందియున్న ఒకే ఒక టూత్ పేస్ట్
కలకత్తా కెమికల్ కలకత్తా-29
MTP-192-TE

ఎంతో
రుచిగా ఉంటుంది
లాక్టవిటా
ఆదర్శమైన ఆహార పానీయం




అతిమూత్ర రోగులందరికీ
ఉచిత సలహా

మూత్రము ద్వారా చక్కెర వెలువడుట "మెల్లిటస్" అతిమూత్రవ్యాధి. (Diabetes Mellitus) చక్కెరలేకుండ తరచుగా మూత్ర విసర్జన జరుగుట "ఇన్‌సిపిడస్" అతిమూత్రవ్యాధి (Diabetes Insipidus) అవ ఉడును. అమిత ఆకలి, దాహము, శరీరమంతా పోట్లు, బరువు తగ్గిపోవుట ఈ వ్యాధి యొక్క ముఖ్య చిహ్నములు. ఇవిగాక, చర్మవ్యాధులు, దురద, మూత్రకోశము, కాలేయము బలహీనమగుట మున్నగునవి కూడ పొడసూపవచ్చును వీటికి వెంటనే తగుచర్య తీసికొనకున్నచో దృష్టిమాంద్యము నిద్రలేమి, కీళ్లవాతము, మానసిక శారీరక శ్రమలయందు అయిష్టత మున్నగువాటికి దారి తీయ వచ్చును ఇటువంటి లక్షణములతో బాధపడుచున్న రోగులు, ఇన్‌జెక్షన్లు, కఠిన పత్యములు, ఉపవాసము లు లేకుండ తమ వ్యాధిని నివారణ చేసుకొనుటకు తగిన ఉచిత వైద్యసలహా కొరకు మాకు వ్రాయవచ్చును. మించిపోకముందే మాకు వ్రాయండి.

VENUS LABORATORIES (A. M.)
P. Box No. 587 Calcutta-1.

# ఆఫీసర్‌తో క్యాంప్‌కి

36వ పేజీ తరువాయి

"రెక్కలు కట్టుకో ! గాలి అటువైపుకే వీస్తున్నది ! తప్పకుండా చేర్తావ్, ఎగురుకుంటూ ! ఆ అమ్మాయి జడలో ఆ పువ్వలంకరించి, అప్పుడామె ముఖం చూస్తూ నిన్ను నువ్వే మరిచిపోదువుగాని ! .. ఎలాగైనా ప్రేమ చాలా గొప్పదోయ్ కృష్ణకుమార్ .... యేమంటావ్" అన్నాడాయన చిదానందంగా.

ఆయన ఇచ్చిన చనువును అప్పుడు సద్వినియోగం చేసుకున్నాడు ప్రసాద్

"ఎలాగైనా సెల్ఫ్ ఎక్స్‌పీరియన్స్ సార్" చిన్నగా గొణిగినట్లుగా అన్నాడు ప్రసాద్.

"అబ్బెబ్బె ! ... అదేంలేదు . కాదు కాదు" బోలెడు కంగారుపడుతూ అన్నారాఫీసర్‌గారు.

పకపక నవ్వేశారు, ప్రసాద్, ఆనంద్.

"యూ సిల్లీ ఫెలో ! త్వరగా వెళ్లి ఆ పంపు సంగతి చూడండి ! వెళ్లండి !" అంటూ చిరునవ్వు దాచుకుని, ఇద్దర్నీ తరిమేశాడాయన.

ఎక్కడికి పోతావు చిన్నవాడా !

నా చేతుల్లో చిక్కుకున్న పిల్లవాడా ! అని పాడుకుంటూ, లయబద్ధంగా గంతులేస్తూ బయలుదేరాడు ప్రసాద్.

ముందు తల వంచుకుని నడుస్తున్నాడానంద్.

ఆఫీసర్ వద్దనుండి లెక్కపెట్టి పాతిక గజాలు నడచాడు ప్రసాద్

"మిస్టర్ ఆనంద్" షోగ్గా పిలచాడు ప్రసాద్

తలెత్తి ఏమి టన్నట్లు చూశాడానంద్

"నువ్వేమనుకోనంటే, వొక్కమాట అడుగుదామనుకుంటున్నాను అడగమంటావా ?" నెమ్మదిగా ఉపక్రమించాడు ప్రసాద్.

"అడుగు" అన్నాడానంద్.

"నేను యీ ఉద్యోగం చెయ్యడం కోసం, అమ్మానాన్నల్నీ, అన్నదమ్ముళ్లనీ, స్నేహితులనీ, అందర్నీ వదిలేసి, భాషేమాత్రం రాకపోయినా, వెయ్యి మైళ్ల దూరంలో ఉన్న పరాయి రాష్ట్రానికి వచ్చాను అది తప్పనే నీ అభిప్రాయమా ?" అతి కష్టంమ్మీద ఉద్రేకాన్ని ఆపుకుంటూ అన్నాడు ప్రసాద్

"అబ్బెబ్బె ! ఎంతమాత్రం కాదు" అన్నాడానంద్, ఎందుకిలా అడుగుతున్నాడో తెలియక

"నావల్ల నీకేమైనా తప్పులుగానీ, అపచారంకానీ జరిగాయా ?" అన్నాడు ప్రసాద్

"అబ్బె అల్లాంటిదేం లేదు !" అన్నాడానంద్ తెల్లబోతూ

"ఐతే నేను చెడ్డవాడిననా నీ అభిప్రాయం ?" అన్నాడు ప్రసాద్

"కాదు కాదు! యూఆర్ క్వైట్ నైస్ అండ్ డేరింగ్ ! ఐనా ఎందు కిలా అడుగుతున్నావ్ ?" అన్నాడానంద్, విస్తుపోతూ.

"అహ ! ఏమీలేదు ! .... ఇవేమీ కాదుకదా, మరి నన్నిలా మోసం చెయ్యమని, నిన్నే పరిస్థితులు పురికొల్పాయో ?" అన్నాడు ప్రసాద్, కోపంతో వణుకుతూ.

ఒక్కసారిగా పెల్లుబడిపోయింది, ఆనంద్ ముఖం.

అలా తెల్లబోతున్నట్లు "మోసమేమిటి ?" అన్నాడు ఆనంద్.

"మోసం కాక మరేమిటి ? డబ్బులు తినుకునే ముందర ఏం చెప్పావ్ ? ఆఫీసర్ నడిగాననీ, కంట్రాక్టరిస్తాడనీ, ఎందుకు చెప్పావ్ ? నన్ను బాధపెట్టినంతమాత్రాన నీ కొచ్చే లాభమేమిటి ? నీతో సమానంగా ఉన్నవాడికి, నీ వియాల్సిన మర్యాదేనా యిది ?" పాఠం వొప్పగించినట్లు దడదడా మాట్లాడాడు ప్రసాద్.

"నువ్వంటున్నదంతా అబద్ధం" గొంతు జీరబోతూ ఉండగా అన్నాడానంద్.

"అలాగా ?! ఐతే మన ఆఫీసర్‌గారిక్కడే ఉన్నాడు. బాగా తెలిసినవాడు, పద ఆయన్నే అడుగుదాం ఎవరిది తప్పో ఆయనే తేల్చగలడు . వస్తావా ?" ఆగి, అన్నాడు ప్రసాద్.

మాట్లాడకుండా పంపు వైపుకు నడిచాడు ఆనంద్

పంప్ హవుస్ దగ్గర పడడం చూసి, "మాట్లాడవేం ?" అన్నాడు ప్రసాద్, గద్దిస్తూ

నిజానికి, ఆనంద్‌ను నలుగురిలో రభస చేయడం ఇష్టంలేదు ప్రసాద్‌కు ఎంతైనా అతను నిజం వొప్పుకోక పోయేసరికి, తప్పనిసరిగా అలా గద్దించాడు ప్రసాద్

"నీకు డబ్బు కావాలంటే నిముషంలో యిస్తాను" అన్నాడు ఆనంద్, గుర్తుపట్టడానికి వీల్లేని స్వరంతో

"వెరీ గుడ్" తృప్తిగా అని, పంపును సమీపించాడు ప్రసాద్, "పని ఐపోయిందా ?" అంటూ.

"ఐంది సాబ్" అన్నాడావైర్‌మన్

మిగిలిన కొద్ది పని పూర్తిచేసి, అందరూ డేరాల దారి పట్టారు.

"కృష్ణమూర్తి ! పని పూర్తయిందా ?" డేరాలో ప్రవేశిస్తుండగానే, ఆఫీసర్‌గారు స్వాగతమిచ్చాడా ప్రశ్నతో

"యస్సార్" అన్నాడు ప్రసాద్, చేతులు దులుపుకుంటూ

"ఇంకా చేయవలసిన పనులేమీ లేనట్టేగా ! యిప్పుడేం చేద్దాం ? రేప్పొద్దున వరకూ ఏం తోచదే ? ఏం చేసేట్లు ?" ఆఫీసర్‌గారు ఆలోచిస్తూ అన్నారు

"కబుర్లు చెప్పుకుందాం సార్" అన్నాడానంద్.

"అదికాక ఇంకా చేసేదేముందిలే !" అన్నాడాఫీసర్.

"పాటలు వినొచ్చుసార్" అన్నాడు ప్రసాద్.

"ఎవరు పాడితే ? బైదిబై, సార్, కృష్ణకుమార్ చాలా బాగా పాడుతాడు, విందామా ?" కసిగా అన్నాడు ఆనంద్

"అరె ! నా కింతవరకూ తెలీదే ! ఊఁ ! కృష్ణకుమార్ కానీ" అన్నాడాయన, సంబరపడుతూ.

'చంపావురా నాయనా !' అనుకుంటూ ఉరిమి చూశాడు, ప్రసాద్

కానీ ఆనంద్ ప్రసాద్ వైపే తల తిప్పి, ఆఫీసర్ గారినే చూస్తున్నాడు !

"కృష్ణకుమార్ ! ఎందు కాలస్యం ? కానీ, త్వరగా పాడు" అన్నారాఫీసర్‌గారు ఆయనకు ఆలస్యం అవుతున్నకొద్దీ ఉత్సాహం ఎక్కువవుతున్నది.

"నాకు రావు సార్" అన్నాడు ప్రసాద్.

"లాభంలేదు! పాడాలి" గట్టిగా అన్నాడాయన.

"మీ రిద్దరూ పాడితే, నేనూ పాడతాను" అన్నాడు ప్రసాద్, తప్పించుకోవడానికి.

"మేం తర్వాత పాడతాం! నువ్వు ముందు పాడు" అన్నా డాయన, ఆనంద్ వంకకు చూస్తూ.

తప్పనిసరిగా "వూ" అన్నాడు ఆనంద్

'తుమ్ అగర్ ముఝ్‌కో నచాహోతో కోయీ బాత్ నహీ

'తుమ్ కిసీ ఔవుర్‌కో చాహోగీ, తోముష్కిల్ హోగీ' ప్రక్కనే పోతున్న అమ్మాయిని చూస్తూనే పాట ఎత్తుకుని, ఆ రెండు చరణాలు పాడి ఆపేశాడు

"ఇంక నాకు రాదు సార్" అన్నాడాయాసం తీర్చుకుంటూ.

"అది నీ ప్రియురాలివద్ద పాడాలి! ఇక్కడ పాడితే ఎలా" అన్నారాఫీసర్‌గారు

"ప్రియురాలయిన తర్వాత పాడడ మెందుకు సార్" అన్నాడు ప్రసాద్.

"ఓహో పాయింటే" నవ్వుతూ అటూ యిటూ చూసి, "అయ్" అన్నాడాయన, కోపంగా పోతున్న పిల్లను గమనించి, మహాశ్చర్యంగా

ముసిముసినవ్వు లొలకపోశాడు ప్రసాద్.

"ఆనంద్, నువ్వుకానీ" అన్నా డాయన.

"రుక్కుజా ఓ జానేవాలా రుక్కుజా" అంటూ యెత్తుకున్నాడానంద్.

పాటయిపోయిన తర్వాత "ఇదేం న్యాయం ? నువ్వూ ఆ పిల్లవంకే ?!" బోలె డాశ్చర్యం వొలకబోస్తూ అన్నా రాయన

తెల్లబోయాడానంద్ ! నవ్వాడు ప్రసాద్

"సార్ ఇక మీవంతు!" అన్నారిద్దరూ, కూడబలుక్కున్నట్టుగా.

"నేను బాగా పాడలేనే !" అన్నారాయన యిబ్బందిగా ముఖంపెట్టి.

"ఇక్కడ విద్వాంసు లెవరూ లేరు లెండి" అన్నాడు ప్రసాద్.

"ఫర్వాలేదు ! పాడండి సార్" అన్నాడానంద్

తప్పనిసరిగా ప్రారంభించా డాయన. "ఓ మెహబూబా . . వో మెహబూబా" అంటూ

"అదేమిటిసార్ ? మీరూ కూడా ఇట్లా పాడారు, కుర్రవాళ్లలా" అన్నాడు ప్రసాద్

"నే నిప్పుడు మీతో సమానమే! మన ఊరు చేరితే కానీ తేడాలు రావు" అన్నారాయన.

కాస్సేపునిశ్శబ్దం, హఠాత్తుగా ఆయనేదో గుర్తుతెచ్చుకున్నాడు

"కుమార్! లే, త్వరగా బయలుదేరు .. బయల్దేరూ . . ఏమిటలా తెల్లబోతావ్ ?... లే" అన్నారాయన తొందరపెడుతూ.

"ఎక్కడకుసార్?" తెల్లబోతూ, ఏమీ అర్థం కాని ప్రసాద్ అడిగాడు.

"నీ ప్రేయసి దగ్గరకు లేకపోతే నీకో విలన్ తగులగలడు" అన్నారాయన గంభీరంగా.

"భగవంతుడా నీకు వంద కొబ్బరికాయలు కొడతాను. యీాయన్ని, నాపెళ్ళి గురించి, లేని ప్రేయసి గురించి ప్రస్తావించకుండా చెయ్యి" అని లోపల్లోపల ప్రార్థించాడు ప్రసాద్ పైకిమాత్రం,

"ఎలాపోను సార్! రైళ్ళేమీలేవు!" అన్నాడు యిబ్బందిగా ముఖంపెట్టి.

"యిక్కడనుండి పదిమైళ్ళలో వాగొకటి వుంది. ఆ వాగు కృష్ణానదిలో కలుస్తుంది నువ్వా వాగు వొడ్డుకెళ్ళి, కళ్ళుమూసుకొని మూడడుగులు ముందుకు వెయ్యి అక్కడ మునిగి, బెజవాడ వద్ద కృష్ణలో తేల్తావు అక్కడనుండి అడ్డం పడితే మీవూరు చాలాదగ్గర" అన్నారాయన గలగలా నవ్వేస్తూ శ్రుతి కలిపారిద్దరూ.

మర్నాడు పొద్దున్నే అతిథులు వెళ్ళిపోయారు తరువాత దేరాలకు చేసిన వైరింగ్‌ను గాడబెరికారందరూ కలిసి భోంజేసి, కారులో అంతాసర్దేసరికి దాదాపు రెండయింది

బయలుదేరేముందు, రెస్టు హవుస్ వాలాకు భోజనం బిల్లు వచ్చింది. ఒక్క క్షణం తటపటాయించి, తనే బిల్లు చెల్లించాడాయన

"కుమార్! నువ్వు పెళ్లి చేసుకోకు! చేసుకుంటే, ఇంకో అమ్మాయి జీవితాన్ని నాశనం చేసినవాడి వవుతావు .. నువ్వో పిసినారివి" కరుగ్గా అన్నా రాయన ఇద్దరి వంకా చూస్తూ.

కళ్ల నీళ్ల పర్యంతమై, కాళ్లీడ్చుకుంటూ వెళ్లి బయలుదేరబోతున్న కారులో కూలబడ్డాడు, ప్రసాద్.

"తవా పీనాసి?!"

'తెచ్చిన డబ్బులన్నీ ఈయన కాల్చిన సిగరెట్లకే అయిపోయాయే! తనవద్ద డబ్బుల్లేనవి గూడా ఆయనకు తెలుసునే!'

'డబ్బు కోసం బాధపడ్డవద్దని ఆయనేగా చెప్పింది ?!'

'ఈ మాట ముందరే చెప్తే, తన ఉంగరం అమ్మేసి డబ్బు తెచ్చుకునేవాడే!'

బాధగా నిట్టూర్చాడు ప్రసాద్. దిగులుగా చూశాడు.

"ఏం ప్రసాద్! ఎవరన్నా గుర్తుకొస్తున్నారా?" నవ్వుతూ అడిగారాయన

జీవంలేని నవ్వు నవ్వాడు ప్రసాద్. జవాబివ్వకుండా తలదించుకున్నాడు.

'అనలిదంతా ఆనందే చేశాడు!'

'ఇవ్వాల్సిన డబ్బేదో తన ముఖాన పారేసినట్లయితే, తన కింత మాట తగిలేదా ?'

కోపంతో, ఉక్రోషంతో ఉడికిపోయాడు ప్రసాద్

వూరు చేరిన తర్వాత, తల తాకట్టుపెట్టి


నాప్సీ తిలక్
స్త్రీల సౌందర్యమునకత్యవసరము.
చక్కని 5 రంగులలో దొరకును.
ఫ్యాన్సీసామానుల వర్తకులందరు అమ్ముదురు.
NAFSY TILAK
ఏజంట్లు :
నేషనల్ ప్రోడక్ట్సు సిండికేట్,
మద్రాసు-21



వేసవిలో దాహానికి ఆరోగ్యకరమైన
చల్లని పానీయం!
AN ACE PRODUCT
డ్రింకాల్‌నే
వాడండి!
వలు రకముల
పళ్ళ రసములతో
తయారుచేయబడినది
★
వివిధ రకముల పళ్ళ రసములతో తయారైన
అన్ని రకముల పానీయములు కూడా లభించును.
DRINKOL
తయారుచేయువారు:
ఎంబ్రోసియా
క్యానింగ్ ఎంటర్‌ప్రైసెస్,
పోష్టుబాక్సునెం. 543, విజయవాడ-3
సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
A. L. సౌత్ ఇండియా
ట్రేడింగ్ కంపెనీ,
(జె. బి. మంగారాం అండ్ కంపెనీకి
డిస్ట్రిబ్యూటర్లు)
శివాలయం వీధి, విజయవాడ-1.

## తెల్ల వెంట్రుకలను వెంటనే పోగొట్టుకోండి

కొండ మూలికలతో తయారైన క్రొత్త ఔషధము. ఉపయోగించిన వెంటనే మీ తెల్ల వెంట్రుకలు నల్లబడును మామూలు నల్లరంగు పూర్తిగానిచ్చును పూర్తికోర్సు రు 10-50 వి పి ఛార్జిలు రు. 2-00 పనిచేయకున్న డబ్బు వాపసు ఇవ్వబడును.

K C. BHARDWAJ (PW-M)
P B. 1257, DELHI-6



## పుస్తకములు

5 పుస్తకముల సెట్టు రు 3-50.
(1) కొక్కోకశాస్త్రం (2) మహాగాత్ (3) చుంబన పద్ధతులు, (4) 84 ఆసనములు, (5) రహస్యఫొటో ఆల్బం ఒక్కొక్క పుస్తకం రు 2/-. పోస్టేజి, ప్యాకింగ్ అదనం. ఇంగ్లీషులో వ్రాయండి.

ARHANT BOOK DEPOT,
26, ALIGARH (U. P.)



## ఇవి చదివేరా?

విద్యార్థినీ -మీపిల్లల బాగుకి పనికొచ్చే కొన్నివందలఉపయోగ విద్యా వివరాలు రూ.5-00
చేతిపనులు - ధనసంపాదనకు పనికొచ్చే అనేక వందలమంచిసరుకులుచేసే సులభ మార్గాలు రూ 3 50
మంత్రశక్తి - మీకోర్కెలు సిద్ధింపజేసే అనేక మంత్రాలు వాటి గొప్పరహస్యాలు,సాధన మార్గాలు రూ.3 50
జీవితరహస్యాలు మీదాంపత్యసుఖానికి వెంటనే తెలుసుకోదగ్గ అనేక కామ సూత్రాలు రూ 3 50
యువతి -స్త్రీలనుగురించి తెలుసుకోదగ్గ అనేక మంచి కుతూహల విషయాలు రూ 3-50
సంతానము -అవుసరం లేనపుడు గర్భం రాకుండా 60 నవీన సులభ మార్గాలు రూ 3-50
పోస్టుఖర్చులుచితం,దేశసేవప్రచురణలు ఏలూరు.
ఆంధ్రకు వ్రాస్తే వి పి పోస్టుద్వారా పంపబడును



## ఫోల్డింగ్ 50 షాట్ పిస్టల్

లైసెన్స్ అక్కరలేదు అమెరికన్ మోడల్. దొంగలు, క్రూరమృగముల నుండి రక్షించుకోండి ఉల్లాస ప్రయాణాలు, యాత్రలు, నాటకాలకు ప్రశస్తమైనది ఆటోమేటిక్ 50 షాట్లు ఏర్పాటు గలదు తేలికైనది ఇందు నుండి వెలువడు నిప్పు తన్యలు మిమ్ములను కాపాడును.




ధర 50 షాట్లు గల నెం 33 రు 13/50 జర్మన్ మోడల్ నెం 99 రు. 15/50 విపి ఛార్జీలు రు 2/50 లెదర్ కేస్ రు 3/50 అదనపు షాట్లు 100 కి రు 5/-

ADD. INDUSCO (WA 13)
Beat No 13, Aligarh



పండిత డి గోపాలాచార్యులవారి

## జీవామృతం

ఆరోగ్యానికి బలానికి
ఆయుర్వేదాశ్రమం (ప్రైవేట్) లిమిటెడ్
మదరాసు 17



## ఉత్తమ చికిత్స

ఏకారణముల చేతనైనా దాంపత్య సౌఖ్యం అనుభవించ లేని వారు వెంటనే 15 పైసల స్టాంపుతో మమ్మలను సంప్రదించండి :



డా. ఎ. పూర్ణచంద్రరావు,
N D.F.N F-U. (Ceylon) R A M P
సెక్సు స్పెషలిస్టు,
పూర్ణాపిక్చర్సువద్ద గాంధీనగరం,విజయవాడ3



## ధనం ఆర్జించండి సుఖపడండి

డ్రాయింగ్, సైన్ బోర్డులు, పెయింటింగ్ గైడ్ రు 6/-. 350 జపాన్ పరిశ్రమల గైడ్ రు. 8/- సచిత్ర ట్రాన్సిస్టర్ రేడియో గైడ్ రు 4/- వైవాహిక జీవితం- 100 పటములు గలదు రు 5/- ఫోటోగ్రఫీ రు 3/- టైలరింగ్ & కట్టింగ్ గైడ్ రు 4/- సెక్స్ అట్లాస్ 325 పటములుగలదు (అమెరికన్ ప్రచురణ) రు 5/- ప్రతిపుస్తకానికి పోస్టేజి రు 1-25 అదనం

ILFA BOOK DEPOT
(JDA) Rafat Ganj, Aligarh(UP)



## ఎలెక్ట్రిక్ & రేడియో గైడ్

ఎలెక్ట్రికల్ ఇంజనీరింగ్, రేడియో రిపేరింగ్, మెకానిజం, అసెంబ్లింగ్, ఎలెక్ట్రికల్ సూపర్ వైజరీ, వైరింగ్, పూర్తి కోర్సు చదవండి రు 50లకు ట్రాన్సిస్టర్ తయారుచేయడంకూడ నేర్చుకోండి ఎలెక్ట్రికల్ వర్కుషాప్ ప్రారంభించండి (800 పటములు)ధర రు 12/50 VPP రు 2

## పొడుగు పెరగండి

శాస్త్రీయ మరియు రహస్య పద్ధతుల మూలంగా 6" వరకు పొడుగు పెరగండి వయోపరిమితి లేదు అమెరికన్ ప్రచురణ ధర రు 8/50 వి పి ఛార్జీలు రు 2/-

Sulekha Book Depot (AP) Aligarh


# ఆఫీసర్ తో కాంప్ కి

ఐనా సరే, ముందు డబ్బులు ఈయనకిస్తాడు.

"భోజనమైనా మానేస్తాను కానీ, ఇంతమాట సహించి వూరుకుంటానుగా ?!" అనుకున్నాడు ప్రసాద్

అలాగే తీవ్రంగా మథన పడుతున్నాడు ప్రసాద్.

సాయంత్రం అయ్యింది

ఇంకా పాతిక మైళ్ళు ముందున్నాయి

ఇంతలో చిన్న పట్టణం చేరారు చాయ్‌కని ఆగారు

ఆఫీసర్‌గారు కార్లోనే కూర్చున్నారు

రెట్లు తేవడానికి ఆనంద్ బయలుదేరాడు.

రెండంగల్లో అతన్ని సమీపించాడు ప్రసాద్.

"మిస్టర్ ఆనంద్ ! నిమిషంలో డబ్బిస్తా నన్నావు. దాదాపుగా యిప్పటికి రెండువేల నిముషాలు గడిచాయి. నా కింతవరకూ ఒక్క పైసా రాలేదు ! ఏమిటి కథ ?" అన్నాడు ప్రసాద్, నమిలి మింగేలా ఆనంద్‌ను చూస్తూ.

చిన్నబోతూ మరు క్షణంలో డబ్బులిచ్చాడానంద్.

డబ్బు చేతులో పడ్డ మరు నిముషంలో కారు వద్ద కెళ్లాడు ప్రసాద్

ప్రశ్నార్థకంగా చూశాడాయన మాట్లాడకుండా తల వంచుకుని, డబ్బంతా ఆయన చేతుల్లో పెట్టాడు ప్రసాద్

అతని కళ్లల్లోంచి జారిన రెండు కన్నీటి బొట్లు, ఆయన చేతిపై బడ్డాయి

ఉలిక్కిపడ్డాడాయన

"ఏమిటి ప్రసాద్ ?" అన్నారాయన విస్తుపోతూ

"సార్ ! నే నింతవరకూ పీనాసిని కాను, ఇంత కాబోను కూడా" అన్నాడు ప్రసాద్, బొంగురు గొంతుతో

"కృష్ణకుమార్ ! ఇంత బాధపడతా వనుకో లేదు అంతకుముందు మాదిరిగానే సర్దాగా అనేశాను ! నీమీద నాకా అభిప్రాయం లేదు." అన్నా రాయన బాధగా

కరిగిపోయాడు ప్రసాద్ ఆశ్చర్యంగా ఆయన వంక చూసి, వెనక్కు తిరిగాడు.

"ఇదుగో, డబ్బు తీసుకో" అన్నా రాయన. తీసుకోలేదు ప్రసాద్

"భలేవాడివే ! నేను సర్దాగా ఆమాట అంటే, నువ్వు నిజంగానే నన్ను పీనాసిని చేస్తున్నావే ? తీసుకో ! నా కవసరం వచ్చినప్పుడు నిన్ను తప్పక అడుగుతానులే" అన్నారాయన

నవ్వుతూ డబ్బులు తీసుకుని "థాంక్స్ చెప్పి స్తానుసార్" అంటూ వెనుదిరిగాడు ప్రసాద్

'వల్లని వెన్నెలలో, చక్కని కన్నె సమీపములో
అందమే నాలో లీనమాయెనే, ఆనందమే నా
గానమాయెనే'

హుషారుగా పాట పాడుకుంటూ హోటల్‌కేసి వెళ్తున్న ప్రసాద్‌ను చూస్తూ చిన్నగా నవ్వుకున్నారాయన.



# పరుగు పందెం యోధులు...



మిల్కాసింగ్



మఖన్ సింగ్



గుర్బచన్ సింగ్

## భారతీయ క్రీడాకారుల వివరాలు, విశేషాలు!

### పి. వి. నరసింహారావు

ఒకప్పుడు శ్రీరామచంద్రుడు బంగారపు లేడి కోసం పరుగెత్తాడు. మరొకప్పుడు శ్రీకృష్ణ భగవానుడు గజేంద్రుడి ప్రాణాలు రక్షించడానికి పరుగెత్తాడు. ఇలా పరుగు అనబడే ఈ భౌతిక ప్రక్రియ పురాణేతిహాసాల కాలంలో జీవితంలో నిత్యావసరమై ముఖ్యపాత్ర వహించింది. కాని తర్వాత క్రమేణా కాలం పరుగులో చాలా మార్పులు వచ్చాయి. అనేక వాహనాలు కనిపెట్టబడి మనిషికి పరుగెత్తే అవసరాన్ని క్రమంగా తగ్గించివేశాయి. దాంతో పరుగు చాలావరకు మరుగున పడిపోయింది. ఇలా భౌతికావసరంగా మరుగున పడిన పరుగు ప్రస్తుతం ఒక క్రీడగా మారి మనతో సన్నిహితాన్ని ఇంకా నిలుపుకొని ఉంది. ఈవిధంగా 'పరుగు' క్రీడగా మారిఉండకపోతే చెప్పినట్లు వాహనాల స్పూన్ ఫీడింగ్ తో మనం ఈపాటికి పరుగు మరిచిపోయి ఉండేవాళ్లం.

జీవితాల పునాదుల్లోంచి 'అవసరం' గా పెరిగి 'క్రీడగా' మారిన ఈ 'పరుగు' ఇప్పుడు క్రీడా ప్రపంచానికే అగ్రత వహించి తన ఔన్నత్యాన్ని నిలుపుకొంది.

నాలుగేళ్ల కొకసారి ఏథెన్సులో టార్చి వెలిగించి, ఒలింపిక్ గ్రామం వరకూ దాన్ని చేత బూని పరుగెత్తడాన్ని, వేగాన్ని లొంగదీసుకొంటూ క్రీడాకారులు పరుగులుతీశాక ప్రారంభమయ్యే ఒలింపిక్ క్రీడోత్సవాల్లో పెద్ద ఎత్తున, ప్రపంచదేశాల పోటీమధ్యా ఈ పరుగులో పందాలు నిర్వహించబడతాయి. వీటిలో విశిష్ట స్థానం ఆక్రమించుకుంటున్న దేశాల్లో మన దేశం కూడా ఒకటి కావడం నిజంగా ఎంతో గర్వించదగ్గ విషయం.

**మిల్కాసింగ్ :**

భారతీయ పరుగు క్రీడాకారులను గురించి చెప్పాల్సివస్తే, ప్రస్తుతం పాటియాలా క్రీడా శిక్షణాలయంలో శిక్షకుడిగా (కోచ్) ఉంటోన్న మిల్కాసింగ్ ని మొట్టమొదట పేర్కొనాలి.

ఒక దశాబ్దంపాటు దేశంలోనూ, విదేశాలలోనూ పరుగు పోటీలలో ప్రముఖస్థానం ఆక్రమించి, మాతృదేశానికి పేరు ప్రఖ్యాతులను ఆర్జించిపెట్టిన మిల్కాసింగ్ ని అందరూ 'ఫ్లయింగ్ సిక్' (ఎగిరే సిక్కు) అని అభిమానంగా పిలుస్తారు. రోమ్ ఒలింపిక్ క్రీడల కాలంలో (1960) ఒక ఆసియా దేశంలో (పేరు గుర్తు లేదు— మనదేశం మాత్రం కాదు). రిక్షాలమీద 'ఫ్లయింగ్ సిక్' అని వ్రాసుకునేవారు. అంటే మిల్కాసింగ్ లాగ అఘమేఘాలమీద రిక్షా తొక్కుతామని అర్థం. అంతగా అతను విదేశీయులను కూడా ఆకట్టుకున్నాడు!

మిల్కా మూడవ (టోకియో), నాల్గవ (జకర్తా) ఆసియా క్రీడా పోటీలలో పాల్గొని 200, 400 మీటర్ల పరుగులలో కొత్త ప్రమాణాలను సాధించాడు.

రోమ్ ఒలింపిక్ క్రీడలలో పాల్గొనడానికి 400 మీ పరుగులలో ఎక్కువగా కృషిచేసి ప్రపంచ స్థాయికి చేరుకున్నాడు. ఈ పోటీలో బంగారు పతకం పొందడానికి లెక్కించబడిన క్రీడాకారులలో ఇతడు ఒకడు. అంతిమ పోటీ (ఫైనల్స్) లో క్రీడాకారు లందరూ 'డేష్' లాగ పరుగు మొదలు పెట్టారు 'నువ్వా ? నేనా ?'—అన్నట్లు సాగిన ఆ పోటీలో ఓటిస్ డేవిస్ (అమెరికా), కారల్ కాఫ్ మన్ (జర్మనీ), మాల్ స్పెన్స్ (దక్షిణాఫ్రికా)ల తర్వాత మిల్కా నాల్గవ వాడిగా వచ్చాడు. మొదటి ఇద్దరూ 44.9 సె లలోనూ, తర్వాతి ఇద్దరూ 45.5 సెం. ల లోనూ వచ్చారు. ఫోటో ఫినిషింగ్ గనుక ఒకే కాలంలో వచ్చినా ఫలితాలు సరిగానే నిర్ణయమయ్యాయి. పాత ఒలింపిక్ ప్రమాణాన్ని (45.9 సె) ఈ నలుగురూ అధిగమించేశారు! ఒలింపిక్ క్రీడలలో అంతిమ పోటీకి చేరుకొని, నాల్గవ వాడిగా వచ్చిన ప్రథమ భారతీయుడు మిల్కాయే. (ఇప్పటివరకూ ఆఖరివాడు కూడా అతడే!)

కార్డిఫ్ లో జరిగిన కామన్వెల్త్ పోటీలలో కూడా పాల్గొని 400 మీ. లో కొత్త ప్రమాణాన్ని నెలకొల్పాడు.

200 మీ. లో ఇతడు అందుకున్న తక్కువ కాలం 20.8 సె, 400 మీ లో 45.5 సె. ఇవి రెండూ ప్రపంచ ప్రమాణాలకి దగ్గరలో ఉన్నాయి. (ప్ర. ప్ర : 200 మీ—20.2 సె., 400 మీ—44.9 సె.)

అంతర్జాతీయ స్థాయి చేరుకున్న తర్వాత దేశములో అద్వితీయుడిగా ఉన్న మిల్కా 1964 జాతీయ క్రీడలలో 400 మీ పోటీలో—తనకు ఎప్పుడూ ద్వితీయుడిగా వస్తుండే మఖన్ సింగ్ చే— ఓడించబడ్డాడు. దానితో మిల్కా క్రీడా జీవితం ఆఖరై పోయిందని కొందరు తేల్చేశారు అయితే, వాళ్ల ఉద్దేశాలు నిరాధారమైనవని చెప్పడానికి ఎంతో కాలం పట్టలేదు. ఒలింపిక్ ఎన్నికకు జరిగిన పోటీలలో మిల్కా మఖన్ మీద సునాయాసంగా గెలిచి, ముప్ఫయ్యేళ్లు దాటిపోయినా దేశంలో తనకి తిరుగులేదని మరోసారి నిరూపించాడు.

అనేక పోటీలలో మిల్కా పాల్గొన్న ఈవెంట్స్: 100 మీ 200 మీ, 400 మీ, 800 మీ పరుగులు 4×100 మీ, 4×100 మీ. రిలేలు (అందింపు పరుగులు)

మెల్బోర్న్ (1956), రోమ్ (1960), టోకియో (1964) ఒలింపిక్ క్రీడలలో పరుగు

# పరుగుపందెంలో పరుగులు తీస్తున్న ఏకైక వనిత!

పాల్గొని, జెస్సీ వోవెన్స్ (బెర్లిన్ ఒలింపిక్ హీరో, క్రీడా విలేఖరి) లాంటి వాళ్ల మన్ననలని బడసిన మిల్కాసింగ్ టోకియో క్రీడల తర్వాత అంత ర్జాతీయ పోటీలనుండి విరమించుకున్నట్టు ప్రక టించాడు. 'మిల్కాసింగ్' లాంటి వాళ్లను తయారుచెయ్యాలనే కోరికతో మిల్కాసింగ్ పాటి యాలా శిక్షణాలయంలో శిక్షకుడిగా పని చేస్తున్నాడు

అంతర్జాతీయ పోటీలలో పెద్ద ఎత్తున కృషి చేస్తేగాని మనకి విజయాలు లభ్యం కావన్నది— అనుభవంమీద ఏర్పరచుకున్న మిల్కా భావం ట్రాక్ అండ్ ఫీల్డ్ క్రీడలలో భారతీయ ప్రాముఖ్య తని నెలకొల్పి, పతకాలని, పేరుని సంపాదించడానికి యువకులు కష్టపడి కృషిచెయ్యాలని అంటాడు మిల్కా

అనేక జాతీయ, అంతర్జాతీయ పోటీలలో పాల్గొని చాలా పతకాలు, అంతకు మించిన ఖ్యాతి తెచ్చుకున్న మిల్కాసింగ్‌కి 1960 లో 'అర్జున' ఎవార్డు యిచ్చి గౌరవించింది ప్రభుత్వం

భారతదేశం ప్రపంచానికి అందిచ్చిన ప్రకృతి జన్యమైన క్రీడాగ్రేసరుడు మిల్కా! ఇతడి పేరు భారత క్రీడా చరిత్రలో చిరకాలం నిలిచిపోతుంది

**మఖన్ సింగ్**

మిల్కాసింగ్ అంతర్జాతీయ పోటీల నుండి విర మించుకున్నట్టు వినగానే, అతడి స్థానాన్ని ఆక్ర మించుకోగల క్రీడాకారు డెవరు ?—అన్న ప్రశ్నకి మఖన్‌సింగ్ సమాధానంగా నిలిచాడు

మఖన్‌సింగ్‌ని భారతదేశపు హెన్రీకార్ అనవచ్చు హెన్రీకార్(అమెరికా) కి లాగే 100 మీ , 200, 400 మీ పరుగులు, 4 × 100 మీ , 4 × 400 మీ రిలేలు మఖన్‌కి అభిమాన క్రీడలు హెన్రీకార్ ప్రపంచ ప్రమాణం (3 ని 07 సె ) నెలకొల్పిన 4 × 400 మీ. రిలే జట్టు సభ్యుడయితే, మఖన్ భారత ప్రమాణాలు నెలకొల్పిన 4 × 100 మీ రిలే జట్టు (3 ని 8 8 సె ) లోనూ 4 × 100 మీ రిలే జట్టు (40 5 సె) లోనూ సభ్యుడు (200 మీ ప్రపంచ ప్రమాణం (20 2సె ) హెన్రీకార్ స్వంతం).

400 మీ లో మిల్కాకి ద్వితీయుడిగా ఉంటూ వచ్చిన మఖన్ కలకత్తాలో జరిగిన జాతీయ పోటీలలో (1964) ఆ దూరాన్ని 47 5 సె లలో మిల్కా (47 9 సె ) మీద గెలిచి, క్రీడాభి మానుల్ని చకితుల్ని చేశాడు అదే పోటీలో 200 మీ లో ఆరితేరిన మైసూర్ క్రీడాకారుడు కెన్నీ పవెల్ మీద గెలిచాడు తర్వాత బెంగుళూరులో జరిగిన పోటీలలో కూడ మఖన్ పవెల్‌మీద గెలిచాడు.

1957 నుండి పోటీలలో పాల్గొంటున్న మఖన్—మిల్కా, పవెల్‌లమీద—విజయాలు విస్మ యాన్ని కలిగించినా, అతడి శక్తి సామర్థ్యాలు శంకించనక్కరలేదు. అధికంగా పరిశ్రమ చేస్తే మిల్కా నెలకొల్పిన స్థాయి త్వరలోనే చేరు కుంటాడు

సైనికదళంలో పనిచేస్తోన్న మఖన్ సైనిక దళం జట్టు సభ్యుడిగా 1960 లో యూరపు యాత్ర చేశాడు. ఇరాన్, సింహళం, పాకిస్తాన్, పశ్చిమ జర్మనీ జట్లతో పోటీలలో పాల్గొని పత కాలు గెలుచుకున్నాడు. నాల్గవ ఆసియా పోటీ లలో 400 మీ. లో మిల్కాకి ద్వితీయుడిగా వచ్చి రజిత పతకం పొందాడు.

టోకియో ఒలింపిక్ క్రీడలలో 4 × 400 మీ 4 × 100 మీ రిలే జట్లలో సభ్యుడు పాతికేళ్ల వయస్సులో ఉన్న మఖన్‌సింగ్‌కి మంచి భవిష్యత్తుని ఎదురుచూడవచ్చు

**గుర్బచన్‌సింగ్ :**

40 కోట్ల జనాభాగల భారతదేశం పదముగ్గురు ట్రాక్ అండ్ ఫీల్డ్ క్రీడాకారుల్నే ఒలింపిక్ పోటీలకు పంపగలిగితే, వారికి నాయకత్వం వహిం చిన గుర్బచన్ సింగ్ ఒక్కడే తగిన ఎత్తుకి లేచి ప్రపంచస్థాయి క్రీడాకారుల సరసన నిలబడ గలిగాడు

నాల్గవ ఆసియా క్రీడాపోటీలలో పాల్గొని దశక్రీడా సమ్మేళనం (డెకాథలన్—100 మీ పరుగు, లాంగ్‌జంప్, షాట్‌పుట్, హైజంప్, 400 మీ పరుగు, 110మీ హర్డిల్స్, డిస్కస్‌త్రో, పోల్‌వాల్ట్, జావలిన్ త్రో, 1500మీ పరుగు)లో స్వర్ణపతకం సంపాదించుకున్న గుర్బచన్ యిప్పుడు ఢిల్లీలో సెంట్రల్ రిజర్వ్ పోలీస్‌శాఖలో ఇన్‌స్పెక్టర్‌గా పనిచేస్తున్నాడు దశక్రీడా సమ్మే ళనం క్రీడని వొదిలి, 110మీ హై హర్డిల్స్‌లో (అక్కడక్కడ వుంచబడిన అడ్డంకులను దాటు కుంటూ పరిగెత్తడాన్ని 'హర్డిలింగ్' అంటారు) అధికంగా కృషిచేసి దేశంలో తనకు సరైన ప్రత్యర్థి లేడనిపించుకున్నాడు దేశంలో 14 2 సె. లలో పరుగెత్తిన యితడు కెస్సెల్‌లో (జర్మనీ) 14 1 సె లలోనూ, టోకియోలో అర్ధాంతిమ (సెమీ ఫైనల్స్), అంతిమ పోటీలలో 14 0 సె లలో పరుగెత్తి క్రీడాభిమానుల హృదయాలను దోచు కున్నాడు ఈసారి ఒలింపిక్ క్రీడలలో అంతిమ పోటికి చేరుకున్న భారతీయుడు ఇతడొక్కడే! అమెరికా క్రీడాకారుడు హేస్‌జోన్స్ (13 6సె ) గెలుచుకున్న ఈ క్రీడలో గుర్బచన్ ఐదవ వాడిగా వచ్చాడు ఒలింపిక్ క్రీడల తర్వాత, అమెరికా—కామ న్వెల్త్ రాజ్యాలమధ్య జరిగిన క్రీడలలో గుర్బచన్ మళ్లీ 14 0సె లలో పరుగెత్తి ఐదవ వాడిగా వచ్చాడు

సన్నగా పొడవుగా వుండే గుర్బచన్ సింగ్‌కి సమస్త సదుపాయాలూ సమకూర్చి దశక్రీడా సమ్మేళనం లోనే కృషిచేయమనంటే జిమ్‌థార్ప్, జాన్సన్, సి కె యాంగ్‌ల లాగ ఆ క్రీడా సమ్మేళనం క్రీడలో ఛాంపియన్ అయ్యే అవకాశాలు వుండివుండేవి (యాంగ్ వొక్కసారికూడా ఒలింపిక్ ఛాంపియన్ కాలేదు ప్రపంచ ప్రమాణస్థాపకుడు మాత్రమే ) అయితే, ఆధునిక క్రీడాసామాగ్రి సమగ్రంగా కొన లేని స్థితిలో వున్న మనం (ఒక ఫైబర్ గ్లాస్ పోలు ఖరీదు సుమారు 1,000రూపాయలు!) అటువంటి ఆశలు పెట్టుకోవడం అనవసరమనిపిస్తుంది.

గుర్బచన్ ఎన్నో జాతీయ, అంతర్జాతీయ పోటీ లలో పాల్గొని విజయాలు సాధించాడు 110మీ. హర్డిల్సేకాక యితడు సాధారణంగా పాల్గొనే యితర ఈవెంట్స్: హైజంప్ ( రోమ్ ఒలింపిక్ క్రీడలలో హైజంప్ పోటీలోనే పాల్గొన్నాడు), లాంగ్ జంప్, 100మీ , 200మీ పరుగు, 4 × 100మీ రిలే

గుర్బచన్ హైజంప్, 110మీ హర్డిల్స్, జావలిన్‌త్రో, దశక్రీడా సమ్మేళనం ఈవెంట్స్‌లో భారత ప్రమాణాలను నెలకొల్పాడు ఆలిండియా పోలీస్ అథ్లెటిక్ పోటీలలో పాల్గొన్నప్పటి నుండి యిప్పటివరకూ వరసగా ఐదుసార్లు హోమ్ మిని స్టర్ పతకం అందుకున్నాడు 1961లో అర్జున ఎవార్డు అందుకున్నాడు

పాతికేళ్లు నిండిన గుర్బచన్‌కి ఇంకా మంచి భవిష్యత్ వుందని చెప్పవచ్చు

**షార్ట్ స్ప్రింటర్స్.**

షార్ట్‌స్ప్రింటర్స్‌లో (తక్కువ దూరం పరుగు) మనకి చెప్పుకోదగ్గ క్రీడాకారులు (100 మీ లో పింటో, 200 మీ లో మిల్కాసింగ్‌తప్ప) ఈ మధ్యవరకూలేరు. 200 మీ. పరుగులో మిల్కా కాలం 20 8 సె అంత దగ్గరలో మరొకరు పరుగెత్తలేదు 100 మీ లో యూనివర్సిటీ స్థాయిలో 11 సె ల వరకూ వస్తున్నా, ఆ కాలాన్ని అభివృద్ధి చెయ్యడం (అంటే తగ్గించడం) ఆ స్థాయిని నిలుపుకోవడం ఎవ్వరోగాని చెయ్యలేక పోతున్నారు

రెండు మూడేళ్లుగా కొందరు క్రీడాకారులు 100 మీ పరుగులో మంచి అభివృద్ధి సాధించడం ముదావహం

100 మీ లో భారత ప్రమాణాన్ని (10 5 సె.) బీహారు యువకుడు అంథోనీ ఫ్రాన్సిస్ కొటిన్‌హో నెలకొల్పాడు ప్రపంచ ప్రమాణం కన్నా ఇది 0 5 సెం ఎక్కువ. ఇతడు గత సంవ త్సరం జరిగిన టోకియో ఒలింపిక్ క్రీడలలో మొదటిసారిగా 4 × 100 మీ. రిలే పోటీలో పాల్గొన్నాడు

ప్రస్తుతం రైల్వేలో పని చేస్తున్న మద్రాసు యువకుడు రాజశేఖరన్ చిన్న వయస్సులోనే షార్ట్ స్ప్రింటర్‌గా పేరు తెచ్చుకున్నాడు. 100 మీ పరుగులో రాజశేఖరన్ కాలం 10 5 సె ఇతడు నాల్గవ ఆసియా క్రీడలలోనూ, టోకియో ఒలిం పిక్ క్రీడలలోనూ పాల్గొన్నాడు టోకియోలో 4 × 100 మీ రిలే జట్టులో సభ్యుడు

ఈమధ్యనే రైల్వేలో చేరిన మైసూరు క్రీడా కారుడు కెన్నెత్ పవెల్ ఇప్పుడు మంచి స్థాయిలో ఉన్నాడు ఈ ఏడాది జరిగిన అంతర్రాష్ట్ర క్రీడా పోటీలలోనూ, ఆలిండియా వోపెన్ మీట్‌లోనూ 100 మీ , 200 మీ గెలుచుకున్నాడు ఆలిం డియా మీట్‌లో బెంగాల్ క్రీడాకారుడు బెర్రీ ఫోర్డ్‌తోబాటు 100 మీ దూరాన్ని 10 4 సె. లలో పరుగెత్తి కొత్త ప్రమాణాన్ని నెలకొల్పాడు. దీనితో భారత క్రీడాకారులు ప్రపంచ ప్రమాణా నికి 0 1 సెం దగ్గరకు రాగలిగారు

1960 లో నైరోబీలో జరిగిన కెన్యా అంత ర్జాతీయ క్రీడా పోటీలలో పవెల్ 100 గ. 9.7 సెం లలో పరుగెత్తి ద్వితీయ స్థానాన్ని 220 గ 21 ని. లో పరుగెత్తి తృతీయ స్థానాన్ని పొందాడు. 1963 లో జరిగిన నేషనల్, ఆలిం డియా వోపెన్ మీట్ పోటీలలో 100 మీ.

00 మీ. పరుగులను గెలుచుకున్నా, 1964 లో జరిగిన నేషనల్ పోటీలలో రెండు స్ప్రింట్స్ లోనూ ఓడిపోయాడు. (100 మీ. కాటిన్‌హా, 200 మీ. మఖన్‌సింగ్ గెలుచుకున్నారు.) అయినా ఈ ఏడు ఒలింపిక్ క్రీడలకు జరిగిన 100 మీ. ఎన్నిక పోటీలో అర్హతకు నిర్ణయించిన స్థాయికి ఇతడొక్కడే చేరుకోగలిగాడు. ఒలింపిక్ క్రీడలో 100 మీ. 200 మీ. పరుగు పోటీలలోనూ 4×100 మీ. రిలే పోటీలోనూ పాల్గొన్నాడు.

పరుగు క్రీడలో కొత్తగా చోటు చేసుకుంటున్న బెర్రీఫోర్డ్ ఈ ఏడు జరిగిన ఆలిండియా ఓపెన్ మీట్‌లో 100 మీ. పవెల్‌తోబాటు 10.4 సె. లలో పరుగెత్తి, అందరి దృష్టినీ ఆకర్షించుకున్నాడు. ఆ పోటీలలోనే 200 మీ. లో పవెల్‌కి ద్వితీయుడిగా వచ్చాడు. ఈ ఫలితాలు—రాబోయే కాలంలో ఇంకా మంచి ఫలితాలను అందించగలడనే నమ్మకాన్ని కలిగిస్తున్నాయి.

**స్టెఫీ డిసౌజా :**

ఇక స్త్రీల విషయం చూస్తే—

గత ఒలింపిక్ క్రీడలకు స్త్రీల ఎన్నికలో అర్హతకు నిర్ణయించిన స్థాయి చేరుకోగలిగిన ... కుమారి సి పి డిసౌజా, మిల్కా ...





కాలగమనంతో బాటు, మిగతా రంగాలలో వలె, చిత్ర రంగంలో కూడా విశేషమయిన మార్పులు రావటంలో ఆశ్చర్యం లేదు. పెళ్ళికానుక, దిల్ ఏక్ మందిర్ మొదలయిన చిత్రాల దర్శకుడు శ్రీధర్ తమిళంలో తాజాగా రూపొందించిన 'వెన్నిర్ ఆడయ్' చిత్రంలో జయలలిత.

# 'హరిశ్చంద్ర' సమీక్ష

సత్యహరిశ్చంద్రుని కథ తెలియని తెలుగువాడు తెలుగునాట అరుదు సత్యాన్ని, ధర్మాన్ని తూ. చ తప్పకుండా ఆచరించేందుకు అసంఖ్యాకమయిన కష్టాలననుభవించిన హరిశ్చంద్రుడు కృతయుగంలోని షట్చక్రవర్తులలో ఒకడు

నలుగురి నోళ్లలోనూ నాలుగుకాలాలనుంచి నానుతూవచ్చిన యిలాంటి కథను చేపట్టటానికి కొంత ఆత్మవిశ్వాసం కావాలి కథల్లో కొత్తదనం కోసం ప్రాకులాడే, కృతకమయిన సాంఘికాల దాడి ఎక్కువవుతున్న యీరోజుల్లో 'హరిశ్చంద్ర' కథకు ఒక నిర్ణీతమయిన వర్గంలో వుండవలసిన ప్రాముఖ్యత ఎన్నడూ వుంటుంది

విజయావారు నిర్మించిన యీచిత్రం యీనెల 22వ ఆంధ్రదేశంలో విడుదల అవుతుంది చిత్ర దర్శకత్వంలో విశేషమయిన అనుభవంతోబాటు, విశాలమయిన కీర్తిప్రతిష్టలను సంపాదించుకొన్న శ్రీ కె వి రెడ్డి గారే దీనికి సారధ్యం వహించారు

కథను విపులీకరించటం హాస్యాస్పదంగానే వుంటుంది పైగా, అలా చేయటంద్వారా మా పాఠకుల విజ్ఞతను తక్కువగా అంచనా వేయదలచుకోలేదు

హరిశ్చంద్రుని కథవిషయమై, సినిమాకు అవసరమయిన కొన్నిమార్పులను, కూర్పులను చేస్తూ, యీ చిత్రాన్ని రూపొందించినట్లు కనిపిస్తుంది అయినప్పటికి ప్రేక్షకునిలో అలాంటి భావం స్ఫురించదు హరిశ్చంద్రుని ధర్మనిష్ఠను, సత్యవిరతిని భంగం చేయాలన్న పట్టుదలతో విశ్వామిత్రుడు చేసిన ప్రయత్నాలే యీ చిత్రంలో 'ప్రముఖంగా' కనిపిస్తాయి రకరకాల రూపాల్లో, తన మహిమను విశ్వామిత్రుడు ప్రదర్శించినా, హరిశ్చంద్రుడు చలించకపోవడం 'వింత' అనిపించేలా యీ చిత్రాన్ని తయారుచేశారు

అసలు కథ యీనాటి సినిమా వాతావరణానికి పనికిరాదేమోననిపిస్తుంది సమకాలీన ప్రేక్షక లోకానికి అంతగా నచ్చదేమోనని కూడా ఒక భావం చిత్రానికి సంబంధించినంతవరకు కథ మీద, ఇతివృత్తం మీద మక్కువ వున్న వాళ్లకు ఇది బోలెడంత తృప్తినిస్తుంది నన్నివేశాలు కూడా ఆ తరహా వ్యక్తుల హృదయాలలోకి చొచ్చుకుని, చిరస్థాయిగా నిలిచేలా వున్నాయి

హరిశ్చంద్రుడు రాజ్యాన్ని వదలి వెళుతూంటే, ప్రజలంతా కన్నీరు మున్నీరై విలపిస్తున్నదృశ్యం, సత్యనిరతుడైన ఒకవ్యక్తి, చేతులార భార్యను అమ్ముకొంటున్న దృశ్యం, ధర్మ నిష్ఠాపరునికి కాటికాపరి వుద్యోగం దొరకటం, అసలే దాస్యవృత్తితో కష్టాల ననుభవిస్తున్న చంద్రమతికి పుత్రవియోగం, ఆ తరువాత పుత్రుని దహనం చేద్దామని వెళ్లిన ఆమెను హరిశ్చంద్రుడు కాటిసుంకం అడగటం తదితర దృశ్యాలు ప్రేక్షకుని హృదయంలో గంభీరమయిన ముద్రను వేస్తాయి కాని, మరికొన్ని చిన్న చిన్న సంఘటనలకు కూడా విశేషమయిన ప్రాముఖ్యత ఇవ్వవలసిన అవసరం ఏముంది?

హరిశ్చంద్రుడుగా రామారావు నటన ఉన్నతంగా వుండి వుండటంలో ఆశ్చర్యంలేదు. కారణం, ఆయన అందరినీ మెప్పించ గలిగే విధంగా నటించగల కొన్ని పాత్రల్లో ఇదీ ఒకటి. ఒక చేతిలో కర్ర మరో చేతిలో కుండ పట్టుకొని 'కాటిసీను'లో నిలుచున్న దృశ్యంలో హరిశ్చంద్రుడు కంటె, మనకు రామారావుగారే ఎక్కువగా కనిపిస్తారు మిగతాదృశ్యాలలో ఆయన నటన గంభీరంగాను, సమయోచితంగాను వున్నది.

చంద్రమతిగా యస్. వరలక్ష్మి లో మునుపటి వుత్సాహం, ఉత్తేజం యీ విమర్శకుడికి కనిపించలేదు పాత్ర ధోరణి కూడా అందుకు కొంత కారణం కావచ్చు

విశ్వామిత్రుడుగా ముక్కామల, వశిష్టులవారుగా నాగయ్య, వీరబాహుడుగా రాజనాల, శివుడుగా ప్రభాకరరెడ్డి, సత్యకీర్తిగా ఎ వి సుబ్బారావు, మేనకగా యల్ విజయలక్ష్మి, మాతంగ కన్యలుగా రాజశ్రీ, మీనకుమారి, మాతంగిగా వాణిశ్రీ వారివారి పాత్రలకు తగిన నటనను ప్రదర్శించారు లోహితాస్యుడుగా మాస్టర్ బాబు చక్కగా వున్నాడు

ఇంతటి బరువైన కథను చెప్పి, ప్రేక్షకులను బరువైన హృదయాలతో ఇళ్లకు పంపకూడదన్న భావంతోనే కాబోలు హాస్యం నిండుగా గుప్పించారు. నక్షత్రకుడుగా రమణారెడ్డి హాస్యం కంటె దాన్నే ఎక్కువగా అందించగలిగాడు రేలంగి, గిరిజల నటనలో కొత్తదనం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ఈ రెండు పాత్రలలోను నిజమైన జీవం చూడగలుగుతాము కాలకౌశికుని శిష్యులు నలుగురు—బాలకృష్ణ, నల్లరామమూర్తి, రాజబాబు, రామకోటి— బృందం మంచి హాస్యాన్నే అందించారు

శ్రీ కె వి రెడ్డి దర్శకత్వం గురించి ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు మనకు యీనాడున్న బహుకొద్దిమంది అగ్రశ్రేణి దర్శకులలో ఆయన ఒకరు

పాటలు, మాటలు రచించిన శ్రీ పింగళినాగేంద్రరావు సిద్ధహస్తుడయిన రచయిత ఇహపర లోకాలకు సంబంధించిన ఎలాంటి ఇతివృత్తం ఇచ్చినా, అందుకు సంబంధించిన వాతావరణాన్ని సరళమయిన సంభాషణాల ద్వారా ఆయన ప్రవేశపెట్టగలరు 'హరిశ్చంద్ర' కూడా అంతే

పెండ్యాల వారి సంగీతం బావుంది పాటలు పెద్దగా 'హిట్' కాకపోవచ్చును లోగడనే ప్రజాదరణ పొందిన ఒకటి, రెండు బాణీలను మళ్లీ ప్రవేశపెట్టటం సముచితంకాదేమో!

మొత్తంమీద 'హరిశ్చంద్ర' చూసిన మూడు గంటలసేపూ విసుగనిపించని చిత్రం

—వాశిరాజు ప్రకాశం ★



'హరిశ్చంద్ర'లో రామారావు.

# చిత్రలహరి

## విజయావారి సాంఘికం

విజయావారు హరిశ్చంద్ర విడుదలానంతరం ఒక సాంఘికచిత్రం నిర్మించే సన్నాహాలలో ఉన్నారు డి. వి నరసరాజు రచన చేస్తున్నారు సంగీతం ఘంటసాల, దర్శకత్వం తాపీ చాణక్య వహించే ఈ చిత్రంలో ఎన్ టి రామారావు, యస్ వి రంగారావు, కుమారి జమున ప్రధాన భూమికలు పోషించగలరనీ, మిగిలిన వారిని కూడ త్వరలోనే ఎన్నికచేసి సెట్స్‌కు వెళ్ళగలరనీ తెలుస్తున్నది

## బ్రహ్మచారి

రత్నశ్రీ ఫిలిమ్స్‌వారు "బ్రహ్మచారి" అనే చిత్రం తయారు చేస్తున్నారు దేవిక, శివాజీ గణేశన్, నాగయ్య, పుష్పలత, చంద్రబాబు, బాలాజీ మొదలయినవారు నటించిన ఈ చిత్రానికి మాటలు, పాటలు అనిసెట్టి వ్రాశారు ఆర్ట్. బాలు, నృత్యాలు రాజ్ కుమార్, ఎడిటింగ్ కె సత్యనారాయణ కెమెరా తంబు, దర్శకత్వం కె శంకర్ నిర్వహించే ఈ చిత్రానికి యువ సంగీత దర్శకుడు బి శంకర్ సంగీతం సమకూర్చడమే గాక, ఇందులో కొన్ని పాటలు పాడుతున్నారు. మధురిమ చిలికే ఆయన గళము ఈ చిత్రం ద్వారా నయినా ఆంధ్ర ప్రేక్షకులకు పరిచయం కావడం ముదావహం.

## శ్రీకాకుళ ఆంధ్రమహావిష్ణు కథ

శ్రీ శంభూ ఫిలిమ్స్‌వారి "శ్రీకాకుళ ఆంధ్ర మహా విష్ణు కథ" ఏప్రిల్ 15 న వాహినీ స్టూడియోలో ప్రారంభించారు ప్రారంభానికి వచ్చిన వారిలో శ్రీయుతులు బి నాగిరెడ్డి, బి యన్ రెడ్డి, కె. వి రెడ్డి, కవి పింగళి నాగేంద్రరావు, పెండ్యాల, కొసరాజు, బ్రిజమోహన్‌దాస్, నటి శ్రీమతి సావిత్రి, జి రామినీడు మొదలయినవారు వచ్చారు అతిథులకు నిర్మాత శ్రీ దగ్గుబాటి లక్ష్మీ నారాయణచౌదరి స్వాగతం చెప్పారు

ప్రారంభానికిముందు దర్శకులు ఏ. కె. శేఖర్ శ్రీ యన్ టి రామారావు మెడలో పూలమాలవేసి సత్కరించారు

విష్ణుమూర్తి ఆలయప్రాంగణం ఆలయం లోని దేవుని విగ్రహం చిరునవ్వు వెదజల్లుతున్నది దివ్య తేజస్సుతో, అఖండ జ్యోతులతో, ఫల పుష్పాదులతో కళకళలాడుతూ మంగళప్రదంగా ఉన్నది ఆలయం ఇరువైపులనుండి ప్రజ పుష్పార్చన చేస్తూండగా వల్లభదేవుడు ప్రవేశించాడు సతీ సమేతంగా సర్వాలంకార భూషితుడయిన వల్లభదేవుని చూడగానే "శ్రీకాకుళేశ్వరునకూ జై, ఆంధ్ర మహావిష్ణుకూ జై" అంటూ ఉత్సాహంతో నినాదాలు చేయసాగారు

వల్లభదేవుడు విజయగర్వంతో అర్ధాంగివేపు చూశాడు అర్ధాంగి సుజాత 'ఈ విజయం మీదికాదు, నాది!' అన్నట్లు భర్త కన్నుల్లోకి చూస్తూ నవ్వింది వల్లభదేవుడు మందహాసం చేసి "మహాజనులారా! జనవాక్యమే జయప్రదముగ, శ్రీకాకుళమే కళ్యాణరంగముగ, లోక శాసనము ఏకము చేసినది ఇది ఎల్ల మీ సంకల్ప మహిమ!" అన్నాడు

ఈ షాట్‌లో ఎన్ టి రామారావు, జమున పాల్గొన్నారు. ఇంకా ఈ చిత్రంలో ఎస్ వి రంగారావు, బాలయ్య, లింగమూర్తి, రేలంగి, మిక్కిలినేని, ప్రసాద్, మల్లాది, ఎల్ విజయలక్ష్మి, గిరిజ, ఛాయాదేవి, సబితాదేవి మొదలయినవారు ముఖ్య భూమికలలో ఉన్నారు



'సింగపూర్ సి. ఐ డి'లో జానకి.

పింగళి రచన, పెండ్యాల సంగీతం నిర్వహించుతున్న ఈ చారిత్రాత్మక జానపద చిత్రానికి తోట కళా దర్శకత్వం చేస్తున్నారు నృత్యాలు పసుమర్తి, కెమెరా యమ్ రాజగోపాల్, దర్శకత్వం ఏ. కె శేఖర్

## ప్రతిజ్ఞాపాలన

సురేష్ పిక్చర్స్‌వారు తమ మొదటి చిత్రంగా నిర్మించుతున్న జానపద చిత్రానికి "ప్రతిజ్ఞాపాలన" అని నామకరణం చేశారు

రాజశ్రీ, కాంతారావు, రాజనాల, పద్మనాభం, బాలకృష్ణ, కె వి యస్ శర్మ, శోభన్‌బాబు, ఎల్. విజయలక్ష్మి, వాణిశ్రీ మొదలయినవారు నటించుతున్నారు సంభాషణలు జూనియర్ సముద్రాల, గీతాలు సి నారాయణరెడ్డి, ఆరుద్ర, దాశరథి, సముద్రాల (జూ), కొసరాజు, సంగీతం వేణు, నృత్యాలు కె యస్ రెడ్డి, కళ రాజేంద్ర కుమార్ ఎడిటింగ్ మార్తాండ్, కెమెరా అన్నయ్య, దర్శకత్వం సి యస్ రావు ఈ చిత్రం ఇంతవరకు పదిరీళ్లకుపైగా పూర్తి అయిందనీ, మే మొదటివారంలో అవుట్‌డోర్‌లో రెండు పాటలు చిత్రీకరించనున్నామనీ నిర్మాత శ్రీ డి.



"ప్రేమించి చూడు"లో రాజశ్రీ.

షూటింగు నిర్విరామంగా జరుగుతున్నది ఆంధ్రలో ఇది విజయ పిక్చర్స్‌వారి ద్వారా విడుదల అవుతుంది

## ప్రమీలార్జునీయము

మహారాణి ప్రమీలకు చిరాకుగా ఉన్నది. ఆమె మనసు ఆందోళనతో నిండిపోయి ఉన్నది. తన అంతఃపురపు వరండాలో అత్యవసర సమావేశం ఏర్పాటు చేసినది.

"మహామాయా, ఆ రాయబారి ఈ కుట్ర లోనివాడే! ఈ ప్రాంతంలో ఎక్కడో ఉండి ఉంటాడు" అన్నది ప్రమీల

ఆమెకు అనతిదూరంలో యోగి కూచునే ఆసనం ఉన్నది దానిపై తోలు తివాసీ, కమండలం, అర దండం, కృత్రిమగెడ్డం, మీసం, రుద్రాక్షమాల— కాషాయ వస్త్రాలు ఉన్నవి ఆసనంముందు పావు కోళ్లు

"మహారాణీ !" దూకుడుగా అన్నది రణచండి "ఆ నారదుడూ, ఈ సాధకుడూ, కలిసి చాలాసేపు మాట్లాడుకున్నారట !" మహామాయ ఆశ్చర్యపోయి నది "ఏమిటే, ఆయ నెవరో మన దగ్గర తెలియ నట్లు నటించేవే ?" అంటూ అడిగినది నారదుని మీద అంతులేని ఆగ్రహం అంకురించినది ప్రమీ లకు "ఈసారి వచ్చిన ఆ నారదునికి తగిన శాస్తి చెయ్యండి వెయ్యి కళ్లతో కనిపెట్టి ఉండండి!" అంటూ వారిరువురనూ హెచ్చరించినది. రణచండి, మహామాయ అక్కణ్ణించి కదలి వెళ్లిపోయినారు

ప్రమీల పక్కకు తిరిగి "గురుదేవి !" అంటూ పిలిచింది గురుదేవి ముందుకు వచ్చింది "ఈ సాధ కుడు అర్జునుడు కాదుకదా ?" అన్నది ప్రమీల— తన సందేహాన్ని వెలిబుచ్చుతూ "అర్జునుడో, దుర్జనుడో, వాడి అంతు ఇప్పుడే తేలుస్తాను" ముందివచ్చింది గురుదేవి.

ప్రమీల ఒక్క క్షణంపాటు ఆలోచించి "గురు దేవీ ! అతడు అంత త్వరగా అంతం కాకూడదు తెల్లవార్లూ చెరలోనే మగ్గనివ్వండి. ఆ తరవాతే విచారించి తగిన శాస్తి చేద్దాం" అంటూ తన పడకగదిలోకి వడివడిగా వెళ్లినది

ఉత్సుకతను రేకెత్తించే యీ సన్నివేశం ఎస్. ఆర్ మూవీస్‌వారి పౌరాణిక చిత్రం "ప్రమీ లార్జునీయము" లోనిది ప్రమీలగా బి సరోజా దేవి, రణచండిగా ఛాయాదేవి, మహామాయగా గిరిజ, గురుదేవిగా రుష్యేంద్రమణి నటించారు ఇది ఏప్రిల్ 10వ తేదీన వాహినీ స్టూడియోలోని అయిదవ ఫ్లోర్‌లో చిత్రీకరించారు దర్శకులు శ్రీ ఎం మల్లికార్జునరావు

రచన పింగళి, సంగీతం పెండ్యాల, కళ గోఖలే, అసోసియేట్ ప్రభాకర్ (కె అర్), కెమెరా రవి కాంత్, రెహమాన్ నిర్వహించుతున్న యీ చిత్రానికి నిర్మాతలు నాగుమణి, ఆదిబాబు వాహినీ పిక్చర్స్ వారి ద్వారా యిది ఆంధ్రలో మే నెల మధ్య భాగంలో విడుదల అవుతుంది

## సతీసక్కుబాయి

చెప్పులు త్రొక్కినదానివలె గదిలోనికి ప్రవే శించుతూ "ఆసిపీ పిగ్గు పిడకా, నీజన్మ తగులబడి పోనూ, చేసింది చాలక తగుదునమ్మా అని తందనా కాచుకున్నావా?"



"అంతస్తులు"లో కృష్ణకుమారి, నాగేశ్వరరావు.

"ఏమిటా పారవశ్యం? కొంపలో పడుండవే కొరకాసీ అంటే ఎక్కడికి వెళ్లావ్? ఎక్కడికెళ్లావూ అంట?" అడిగింది భగీరథి

"గురువుగారి ఆశ్రమానికి అత్తయ్యా!" చెప్పింది మెల్లగా సక్కు

"గురువుగారా? ఎవరాగురువిందని?"

"మహాత్ములు మాధవస్వాములే, అత్తయ్యా!"

గుడ్లు పెద్దవిచేసి చూస్తూ "వాడే, ఇందాక తప్పితగలేసిన ఆ మాధారం బైరాగి వాడేనా? వాడి ముఖం చూడరాదు. మాట్లాడరాదు అని ఎన్ని చెప్పినా నీకు బుద్ధిలేదు. మళ్లీ వాడిదగ్గరకే వెళ్లావ్! ఆ మాయదారి వాడంతే! అందమైన ఆడది మెత్తగా కనిపిస్తే—ఆకట్టే మత్తుమందు చల్లేసి వల్లో వేసు కొంటాడు. అకుంకతో నీకేంగునుగునలే— అమ్మ వైపు బంధువా? అత్తవైపు బంధువా?" అడిగింది కటువుగా భగీరధమ్మ.

"ఆత్మబంధువత్తయ్యా! ఇవ్వనమేతంగా పండరీ పురం బ్రహ్మోత్సవానికి వెళుతున్నారు వారు భూ



"దేవత"లో పద్మనాభం, గీతాంజలి.

## పాదాలలో ఆనెలు

పాదాలలో ఆనెలు, కండలు పెరిగి, వ్రేళ్లు పొతుకుపోయి పాదములు నేలపై బెట్ట లేకరాళ్లు తగిలిన తుల్లి పడు వారు పైపూతగ వాడిన వ్రేళ్లతో సహా పోమాయించేయ. గల సంజీవి వెల పోస్టు ఖర్చులతో రు.5–50న.పై

| | |
|---|---|
| కొక్కోకము 91 చిత్రపటములు గలది. | రు. 1–50 |
| దాంపత్య రహస్యములు ... | రు. 3–00 |
| తెలుగు హిందీ స్వయంశిక్ష | రు. 4–50 |
| తెలుగు–ఆంగ్ల భాషాబోధిని | రు. 5–00 |

పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

ప్రభ అండ్ కో.

3, మలయపెరుమాళ్ వీధి, మద్రాసు–1.

## సలహా

కోల్పోయిన ఆనందం, బలం, శక్తిని తిరిగి యిచ్చేందుకు ఆహ్లాదకరమైనది నరాల బలంకు పైపు తకు వాడే తైలం. 1 సీసా రు 11-50 స్పెషల్ రకం అర్జంటు గుణంకు రు 27/– వివరాలు పంపుతూ జవాబుకు కవరు పంపాలి.

Sex Spe

రిజిష్టరు నెం.3174 + స్థాపితము 1936.

అసలు బంగారు రేకు కవరింగు చేయబడిన

## శ్రీస్వదేశి ఆభరణములు

అందమునకు + గ్యారంటీకి మాప్రత్యేకత

కేటలాగు ఉచితం

శ్రీస్వదేశి గోల్డు కవరింగు వర్క్సు

H.8 చిలకలపూడి P.O. + కృష్ణాజిల్లా

ఫోటోగ్రఫీ

అభ్యర్థులు

కనీస వేతన

బాక్సు నెం.

పత్రిక వారి

పంపవలెను.

SIRITONE


## చిత్రలహరి

సద్దర్శనం చేయించమని అర్థించాను నన్ను వెంట తీసుకొని వెళ్ళమన్నాను" అన్నది సక్కు నిర్మల చిత్తంతో

భగీరథమ్మకు ఉక్రోషం ముంచుకొస్తున్నది "ఎంతమాట, ఎంతమాట! ఆకాశం విరిగి పడకుండా అలాగె ఉందేమే! అత్తగల కోడలివి, అర్ధరాత్రివేళ లేచిపోవడమే! ఆ బైరాగి వాడితో లేచిపోవడమే!. ఆ వెధవ నిన్ను తీసుకుపోతానన్నాడా?"

"అన్నారు—కానీ, భర్తగారి అనుజ్ఞ తీసికొని ప్రయాణానికి సిద్ధంగా ఉండమన్నారు" చెప్పింది సక్కు.

కస్సుమన్నది భగీరథి "ఆ పిపిస్సివాడికున్న యింగితమన్నా నీకు లేకపోయిందంటే—అత్త చచ్చిపోయిందనుకున్నావా? కట్టుకున్న వాడి కళ్లల్లో కారంగొట్టి పరువు కరువు చేద్దామను కున్నావా?... బ్రతుకు బజారు కెక్కిస్తావుటే! పండరీ యాత్ర మిషతో వాడితో లేచిపోదామనా—చూడు నిన్ను ఏం చేస్తానో, వైకుంఠానికే పంపి

"పుణ్యభూమి"లో పుష్పవల్లి

స్తాను" అని యింట్లోకి చూస్తూ "ఒసేవ్. గంగా! ఇంకా అక్కడే ఏం చేస్తున్నావే? త్వరగా తగలడు" అన్నది.

"తెచ్చానమ్మా!" అంటూ వచ్చింది, ఆ అమ్మగారి పెద్ద కూతురు.

"పండరీనాథుని దర్శనం కావాలనే నీకు? వదినకు చూపించు. నేను గట్టిగా పట్టుకుంటా గాని పంత గాల్సు" అంటూ కూతురుకు పురమాయించి కోడలి చేతులు గట్టిగా పట్టుకున్నది. గంగ కొరివితో వదిన చేతులకు వాతలు పెడుతున్నది. సక్కు భయకంపిత వ్రుక్కులతో "కృష్ణా కృష్ణా! పండరినాథా!!" అంటూ సొమ్మసిల్లి పడిపోయినది.

—ఈ సన్నివేశం చిన్ని బ్రదర్స్ వారి "సతీ సక్కుబాయి" చిత్రంలోనిది. వేదాంతం రాఘవయ్య దర్శకత్వంతో తయారవుతున్న యీ చిత్రానికి నిర్మాత: పి. చిన్నారావు. సంగీతం: ఆదినారాయణరావు, కెమెరా: కమల్ ఘోష్. ఇందులో అనురాధ రుక్మిణిపాత్ర ధరించు చున్నది. ★




మనోహర్, కుమారి వసంతగానం చేస్తున్న దృశ్యం.

# వసంత, మనోహర్‌ల మధురగానం

సంవత్సరాది సందర్భంగా ఆంధ్రపత్రిక అభ్యుదయ కళామండలి వారు ఏర్పాటుచేసిన ఉత్సవాలలో సినిమా ప్లేబాక్ గాయకులు కుమారి వసంత, శ్రీ ఎస్ మనోహర్‌ల గానకచ్చేరి ఒక ముఖ్యాకర్షణ.

ఆంధ్రపత్రిక సంస్థలో పనిచేసే పలువురు కార్మికులు, కొందరు ఉద్యోగులు కలిసి యీ ఉత్సవాలను ఏర్పాటు చేశారు రిక్రియేషన్ కార్యక్రమాలకోసం యీ ఉత్సవాలు జరుగుతుంటాయి పోయిన సంవత్సరం ఉగాది సందర్భంగా ఏర్పాటయిన కార్యక్రమంలో కుమారి వసంత, శ్రీ బసవేశ్వర్‌లు గానకచ్చేరి జరిపిన విషయం పాఠకులకు తెలిసిందే ఈ ఏడాది కూడా తెలుగు ఉగాదినాడే యీ కార్యక్రమాలను ఏర్పాటు చేద్దామని మండలి కార్యవర్గం అనుకొన్నది —కాని, కారణాంతరాలవల్ల అవి ఏర్పాటు కాలేదు ఏప్రిల్ 12 వ తమిళ సంవత్సరాది కూడా కావటంతో, అదేరోజున యీ ఉత్సవాలను ఏర్పాటుచేయుటానికి పరిస్థితులు అనుకూలించాయి.

ఏప్రిల్ 12 న మరొక విశేషం కూడా ఉంది ఆంధ్రపత్రిక సంస్థాపకులు, విశ్వదాత, దేశోద్ధారక, కళాప్రపూర్ణ శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి 27 వ పుణ్యవర్ధంతి కూడా అదేరోజున కొన్ని నిమిషాల ముందు మా కార్యాలయంలో జరిగింది ఉద్యోగులు, కార్మికులు అందరూ దేశోద్ధారకునికి భక్తిప్రపత్తులతో శ్రద్ధాంజలి ఘటించారు

అనంతరం కార్యాలయం ఆవరణలో కళామండలి వారు ఏర్పాటుచేసిన సభకు ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంపాదకులు శ్రీ శివలెంక రాధాకృష్ణ అధ్యక్షత వహించారు.

ఆంధ్రపత్రిక సహాయ సంపాదకులు శ్రీ పి శ్రీరాములుగారు ప్రసంగిస్తూ, విరామసమయాల్లో వినోద కాలక్షేపం కోసం యిలాంటి కార్యక్రమాలను ఏర్పాటుచేస్తున్న మండలి కృషిని కొనియాడారు పగలల్లా పనిచేసినవారికి ఇలాంటి సంగీత కార్యక్రమాలు కొంత ఆటవిడుపును కలుగజేస్తాయని వారన్నారు రానున్న రోజుల్లో మండలి నిధులను ఇంకా విరివిగా సేకరించుకొని, తమ కార్యక్రమాలను విస్తరించుకోవాలని అన్నారు

శ్రీ వి. వి. ఎల్. నరసింహారావు ప్రార్థన చేశారు. కార్యదర్శి శ్రీ జి. ఆర్. సుబ్రహ్మణ్యం సభికులకు స్వాగతం చెబుతూ, మండలి కృషిని స్థూలంగా సమీక్షించారు.

తదనంతరం పాటకచ్చేరి ఆరంభమయింది. మధురమైన గానాన్ని వినిపించిన శ్రీ మనోహర్, కుమారి వసంతల కంఠ మాధుర్యానికి, ఆర్కెస్ట్రా వారి సహకారం కూడా తోడునీడగా నిలిచింది.

కుమారి వసంత సినీరంగానికి పరిచితురాలే. 'వాగ్దానం' లో తొలిసారిగా శ్రీ బసవేశ్వర్‌తో యుగళగీతం పాడిన కుమారి వసంత యీనాడు పలు చిత్రాలలో అసంఖ్యాకమయిన పాటలు పాడుతున్నారు.

శ్రీ ఎస్. మనోహర్ యీ శాఖకు కొత్తవాడు. ఎన్. వి. కె. ఆర్. పబ్లిసిటీ సంస్థకు మద్రాసు ప్రతినిధిగా ఉంటున్నాడు. నేపథ్యంలో లోగడ కొన్ని పాటల్లో భాగాలను పాడారు. సినిమా రంగానికి బాగా పరిచితుడే.

దాదాపు రెండు గంటలసేపు జరిగిన యీ కచ్చేరిలో పలు రకాల సంగీతం వినే అవకాశం లభించింది. సినిమాలలో బహుళంగా ప్రజాదరణ పొందిన పాటలను, కొంత శాస్త్రీయ సంగీతాన్ని వినిపించారు. హిందీ, తమిళ పాటలను కూడా పాడటం జరిగింది.

రమ్యమైన ప్రార్థనగీతంతో కార్యక్రమాన్ని ఆరంభించిన కుమారి వసంత, పాడమనినప్పుడగ వలెనా, గోదారి గట్టుంది, పగలే వెన్నెల మొదలయిన పాటలను పాడారు

శ్రీ మనోహర్ పాడిన పాటలలో పాడుతా తీయగా, దినకరా, రాగమయీరావే చెప్పదగినవి

ఇవికాక, ఇరువురూ కలిసి కొన్ని యుగళగీతాలను పాడారు



సభికులలో ఒక భాగం.

## సంగీత కచ్చేరి

కార్యక్రమం అనంతరం శ్రీ శ్రీరాములుగారు మరి వాక్యాలు పలుకుతూ కుమారి వసంత 'పాడమని నన్నడగవలెనా' అంటూ పాడటం, నిజంగా మళ్లీ మళ్లీ పాడమని అడగవలసిన విధంగా ఉన్న దన్నారు ఎప్పుడూ మనమధ్య ఉండే శ్రీ మనోహర్ ఇంత చక్కగా పాడటం విశేషమని కూడా వారన్నారు.

శ్రీ శివలెంక రాధాకృష్ణ బహుమతులను అంద జేశారు

హాజరైనవారిలో శ్రీ తిరుమల రామచంద్ర, హారీత శివశర్మ, పి గణపతిశాస్త్రి, శివలెంక నాగేశ్వర రావు, వి ఎ. కె రంగారావు, ప్రభృతులు ఉన్నారు

శ్రీ సుబ్రహ్మణ్యం వందనసమర్పణ చేశారు

–ప్రకాశం ★

# వార్తలు-విశేషాలు

## బాలల వేడుకలు

ఆంధ్ర బాలానందం సంఘం 17 వ వార్షికోత్సవ సందర్భాన్ని పురస్కరించుకొని మద్రాసులోని తెలుగు బాలలు గత మాసం 31 వ తేదీన స్థానికంగా ఉన్న 'చిల్డ్రన్స్ థియేటర్‌లో" వివిధ రకాలయిన వినోద ప్రదర్శన లిచ్చారు. ఈ ప్రదర్శనలిచ్చిన బాలలో మూడు సంవత్సరాల వయస్సు కలిగినా వారు కూడా ఉన్నారు. విజ్ఞానమూ, వినోదమూ ఉన్న యీ వివిధ ప్రదర్శనలు ఆనాటి సభికులను విశేషంగా ఆకర్షిం చాయి. నృత్యాలు, చిన్న నాటికలు, హాస్య సంభాష ణలుమొదలయిన అంశాలు ఈ ప్రదర్శనలోనిభాగాలు.

మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. చంద్రారెడ్డి సభకు అధ్యక్షత వహించారు శ్రీమతి చంద్రారెడ్డి బహుమతులను అంద జేశారు. బాలల మానసిక వికాసానికి బాలానంద సంఘాలు ఎంతగానో దోహదమిస్తాయని శ్రీ చంద్రారెడ్డి అన్నారు

ఈ ఉత్సవాలకుగాను హైదరాబాదు నుంచి "అన్నయ్య" శ్రీ న్యాపతి రాఘవరావు ప్రత్యేకంగా వచ్చారు. ఈనాడిక్కడ ఉండటం పుట్టింట్లో ఉన్నట్లుందని అన్నారు శ్రీ "అన్నయ్య".

శ్రీ డి. బి శర్మగారు స్వాగత వాక్యాలు పలుకుతూ సంస్థ కార్యకలాపాలను సమీక్షించి, ఆశయాలను వివరించారు. శ్రీ పి. నాగేంద్రప్రసాద్ వందన సమర్పణ చేశారు.

వినోద కార్యక్రమాలన్నీ రసవత్తరంగా నిర్వ హింపబడ్డాయి. చిన్న చిన్న పిల్లలు, పెద్ద పెద్ద భావాలను స్ఫుటంగాను, సమర్థతతోను వ్యక్తీక రించారు వీరికి చక్కని శిక్షణ ఇచ్చినట్లు కనుపి స్తుంది

ఈ సందర్భంలో వెలువరించిన 'సావనీర్' మా కార్యాలయం చేరింది శ్రీ బాపు ముఖచిత్రంతోను, బాలలకు సంబంధించిన వ్యాసాలతోను ఈ పుస్తకం ఆకర్షణీయంగా ఉంది.

## ఐ. సి. ఎఫ్. ఆంధ్రుల ఉగాది వేడుకలు

ఇంటిగ్రల్ కోచ్‌ఫ్యాక్టరీ ఆంధ్ర ఉద్యోగులు తమ ఓపెన్ ఎయిర్ థియేటరులో 2—4—65 నాడు ఉగాది ఉత్సవములు వైభవోపేతంగా జరుపు కొన్నారు ఉత్సవము పంచాంగ శ్రవణముతో ప్రారంభ మైనది కోచ్‌ఫ్యాక్టరీ జనరల్ మేనేజరు శ్రీ హైదరీ గారు అధ్యక్షత వహించిరి ముఖ్య అతిథులుగా ప్రముఖ సినీనటులు శ్రీ రామారావు, చెన్నపురి ఆంధ్ర మహాసభాధ్యక్షులు శ్రీ సోమయాజులుగారు ప్రఖ్యాత సినీ రచయిత శ్రీ పింగళి నాగేంద్రరావు గారు పాల్గొనిరి

తెలుగు సోదరుల విద్యా సౌకర్యములకు శ్రీ రామారావుగారు సహాయము చేయుదురని చెప్పినమాట 'రా మ బా ణ ము' వంటిదనియు, అందుకు తిరుగులేదనియు కాన తెలుగు బిడ్డల కోర్కె సఫలీకృతమగుననియు ఆశించుతూ శ్రీ పింగళి నాగేంద్రరావు శుభాశీస్సులతో తమ ఉపన్యాసము ముగించిరి

ప్రఖ్యాత గాయకులు, సంగీత దర్శకులైన శ్రీ ఘంటసాల వేంకటేశ్వరరావుగారి పాట కచ్చేరి, కుమారి యడవల్లి రమగారి కూచిపూడి భరత నాట్యము అందరి మన్ననలందుకొన్నది కమిటీ వారు శ్రీ ఘంటసాలవారిని, కుమారి యడవల్లి రమను ఉచిత రీతిగా సత్కరించిరి

శ్రీ ధర్మారావుగారి వందన సమర్పణతో ఉత్స వము ముగిసెను

### 'పంజరం' ప్రదర్శనం

క్రియేషన్ ఇన్ సినీ ఆర్ట్స్, మద్రాసువారు గత శనివారంనాడు స్థానిక శ్రీ కృష్ణగాన సభలో శ్రీ అవసరాల రచించిన సాంఘిక నాటకం 'పంజరం' ప్రదర్శించారు శ్రీ శ్యామలరావు దర్శ కత్వం వహించిన యీ ప్రదర్శనకు సంగీతం శ్రీ శంకరరావు.

శ్రీయుతులు శ్యామలరావ్, సురేంద్రనాథ్, కృష్ణమూర్తి, కె వి చలం, వెంకటేశ్, సుబ్ర హ్మణ్య చౌదరి, దేవకి ప్రభృతులు నటించారు. నిర్వహణ . సురేంద్రనాథ్.

* * *

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాల (తిరుపతి) ఫైనలు విద్యార్థుల వీడ్కోలు మహోత్సవ సంద ర్భంగా కళాశాల విద్యాభివర్ధినీసభ కళా విభాగం శ్రీ ఆకుల సుబ్రహ్మణ్యంగారు రచించిన "సమర్పణ" నాటిక ప్రదర్శించింది.

పురప్రముఖులు చాలమంది యీ ప్రదర్శనకు హాజరయి ప్రశంసించారు.

* * *

2—4—65 నాడు సాయంత్రం అలహా బాద్ ఆంధ్ర సంఘంవారు అక్కడి తెలుగు పిల్లలకు తెలుగులో పాఠాలునేర్పే ఏర్పాట్లు ప్రారంభించారు. ఈ సందర్భంలో జరిగిన సభకి ఎందరో ప్రము ఖులు వచ్చారు. ★

## మౌల్వీనసిరుద్దీన్ కథలు-5

# కోతలు



మహీధరనళినీమోహన్

ఓ రోజున తైమూర్ పెద్ద సంత ర్పణ చేశాడు. మౌల్వీని కూడా పిలిచేడు. అందరూ వచ్చేరు. కూర్చుని కబుర్లు చెప్పుకొంటు న్నారు. మౌల్వీ పదిమందిని చేర్చు కొని ఏదో చెప్తున్నాడు. అంతా శ్రద్ధగా వింటున్నారు.

ఆ సమయంలో తైమూర్ అటు వేపుగా వచ్చేడు. మౌల్వీని వేళా కోళం చేయాలను కొన్నాడు.

ఏమిటయ్యా! కోతలు మహా కోస్తున్నావు ?— అన్నాడు.

మౌల్వీ తడుముకోకుండా సమా ధానం ఇచ్చేడు.

"ప్రభువులు గమనించాలి. నేనేం చేసేది ? కోతలు కొయ్యకుండా చెప్పడం సాధ్యమే కావడం లేదు. ఏమంటే ఈ నాస్నేహితులకు ఇంత సేపటినుంచీ తమ ధర్మబుద్ధిని గురించే చెప్తున్నా"అన్నాడు.★

Edited. Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6&7 Thambuchetty Street Madras-1. Phone: 29766 & 23713. Chief Editor S. Sambhu Prasad.



"సింగపూర్ సి. ఐ. డి." లో జానకి.

